اِنَّ الذین یبایعونک انما یبایعون اللہ ید اللہ فوق ایدیہم

జగద్గురు గ్రంధమాల



నెం. 2







శ్రీమద్విరాట్

# వీరభోగవసంతరాయలు

జంబూద్వీప

అఖండ

భారతదేశము)





రక్షకుని

అభయహస్తము

వెల  3-0-0





انما یؤمن بآیاتنا الذین اذا ذکروا بها خروا سجدا وسبحوا بحمد ربهم وهم لا یستکبرون

# لا اله الا الله محمد رسول الله

శ్రీ జగద్గురు గ్రంథమాల – నెం. 2

ఓం శ్రీ జగద్గురవే నమః

# హిందూ – ముస్లిం ధార్మిక సమ్మేళనము (2 వ భాగము)

# The Hindu - Muslim Religious Unity ( Part - 2 )

## (The Spiritual Regulator of this Age)

కలియుగ సర్వమత సంస్కర్త ఇమామ్మున్నాన్ :– ఆయోని కల్కి యవతార్
శ్రీ మద్విరాట్ మౌలానా సిద్దీక్ దీన్‌దార్ చెన్నబసవేశ్వర్ –

# శ్రీ పీరభోగ వసంతరాయులు

రచయిత :

**శ్రీ హజరత్ మౌలానా పండిత దివాకర్ ముహమ్మద్ అబ్దుస్ సత్తార్,**
**వర్ధమాన్ మహావీర్ – శ్రీ హయగ్రీవ యవతార్‌గారు**
హిందూ–ముస్లీం ధార్మిక సమ్మేళన ప్రచారకులు.

గృహ నెంబర్ : 10–2–491,
శ్రీ జగద్గురు ఆశ్రమము – ఆసిఫ్‌నగర్,
హైదాబాద్ సిటి, ఆంధ్రప్రదేశ్. (India).

మొదటి ముద్రణ :
జూన్ 1960
1000 – ప్రతులు.

★



వెల : 2–0–0

జై హిం ద్



ఈ గ్రంథ రచయితచే వ్రాయబడిన పుస్తకములు :-

1) హిందూ-ముస్లిం ధార్మిక సమ్మేళనము (తెలుగు)
మొదటి భాగము - వెల 1—0—0

2) ఇక అనతికాలములోనే సర్వధర్మ పరిరక్షకంబైన ఇస్లాం - శాంతి ధర్మము భారతదేశ మంతట వ్యాపించిపోవును. (తెలుగు) వెల 0—4—0

3) The five religious principles called 'Panch-santi-marg' for the establishment of universal peace. (English) వెల - 0—4—0

4) శ్రీ వీరభోగ వసంతరాయులు (తెలుగు) వెల - [illegible]
హిందూ-ముస్లిం ధార్మిక సమ్మేళనము (2వ భాగము)

(ప్యాకింగు, పోస్టేజి ప్రత్యేకం)



* పై కనపర్చిన పుస్తకములు దొరుకు స్థలం *

**శ్రీ వీరభోగ వసంతరాయులు బుక్ డిపో,**

శ్రీమతి జహిరా బేగం. గృహ నెం. 10-2-491,

జగద్గురు ఆశ్రమము - ఆసిఫ్‌నగర్,

**హైద్రాబాద్ సిటీ** - ఆంధ్ర ప్రదేశ్ (India).




యుగపురుషుని పాదపద్మంబుల సేవాధురంధరుడైన, శ్రీ వీరాంజనేయావతార్.

# ప్రార్థన

ప్రళయకాలమునకు అధిపతి, కర్మ ప్రతిఫలమిచ్చు, సర్వలోక బ్రహ్మ, క్రమేపి పోషి
ప్రభువగు అల్లాః సర్వేశ్వరునకు సర్వస్తోత్రములు చెల్లుగాక !

శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం।
ద్వంద్వాతీతం గగన సదృశం తత్వమస్యాదిలక్ష్యం।
ఏకంనిత్యం విమలవచనం సర్వాది సాక్షిభూతం।
భావాతీతం త్రిగుణరహితం సద్గురుతన్నమామి॥

బ్రహ్మ, విష్ణు, ఈశ్వర, తత్వగుణసంపన్న, మహావిష్ణు, పది యవతార కల్కియు శ్రీ మన్స్వరాట్ ముహమ్మద్‌గారికి (శాంతి, ప్రసన్నత వీరిపై వర్ధిల్లుగాక !) నమస్కరి చున్నాను.

శ్లో॥ మమాత్మ సర్వభూతాత్మ। మన్నాథో శ్రీ జగన్నాథః।
మద్గురు శ్రీ జగద్గురుః। తస్మై శ్రీ గురువేనమః॥

జణగణమన అధినాయక జయహే। భారత భాగ్యవిధాతా।
పంజాబసింధు గుజరాతమరాటా। ద్రావిడ వుత్కలవంగ,
వింధ్య హిమాచల యమునాగంగా। ఉచ్ఛల జలధితరంగ।
తవశుభ నామేజాగే తవశుభ అశిషమాగే। గాహేతవజయగాధా।
జనగణ మంగళదాయక జయహే। భారత భాగ్యవిధాతా।
జయహే జయహే జయహే జయ జయ జయ జయహే॥

జై హింద్।



రత్నా ప్రెస్, గుడివాడ.

# ప్రార్థన

ప్రళయకాలమునకు అధిపతి, కర్మ ప్రతిఫలమిచ్చు, సర్వలోక బ్రహ్మ, క్రమేపి పోషించు ప్రభువగు అల్లాఃసర్వేశ్వరునకు సర్వస్తోత్రములు చెల్లుగాక!

శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం ।
ద్వంద్వాతీతం గగన సదృశం తత్వమస్యాదిలక్ష్యం ।
ఏకంనిత్యం విమలవచనం సర్వాది సాక్షిభూతం ।
భావాతీతం త్రిగుణరహితం సద్గురుతన్నమామి॥

బ్రహ్మ, విష్ణు, ఈశ్వర, తత్వగుణసంపన్న, మహావిష్ణు, పది యవతార కల్కిమూర్తి శ్రీ మస్వరాట్ ముహమ్మద్‌గారికి (శాంతి, ప్రసన్నత వీరిపై వర్ధిల్లుగాక!) నమస్కరించుచున్నాను.

శ్లో॥ మమాత్మ సర్వభూతాత్మ । మన్నాథో శ్రీ జగన్నాథః ।
మద్గురు శ్రీ జగద్గురుః । తస్మై శ్రీ గురువేనమః॥

జణగణమన అధినాయక జయహే । భారత భాగ్యవిధాతా ।
పంజాబసిందు గుజరాతమరాటా । ద్రావిడ వుత్కలవంగ ।
వింధ్య హిమాచల యమునాగంగా । ఉచ్ఛల జలధితరంగ ।
తవశుభ నామేజాగే తవశుభ అశిషమాగే । గాహేంతవజయగాధా ।
జనగణ మంగళదాయక జయహే । భారత భాగ్యవిధాతా ।
జయహే జయహే జయహే జయ జయ జయ జయహే॥

జై హింద్!

రత్నా ప్రెస్,  గుడివాడ.

# విషయసూచిక

**ఈ గ్రంథమందు ప్రమాణముగా తీసుకున్న గ్రంథముల పేర్లు.**

1 ప్రణవవేదమగు తేజోమయ ఖుర్-ఆన్

2 పవిత్ర హదీసులు

3 యజుర్వేదము

4 ఉపనిషత్తులు

5 కల్కి-పురాణం

6 భగవద్గీత

7 భవిష్య పురాణం

8 మానసీకా పూజాకృతము

9 నారదముని ఉపనిషత్

10 కల్యాణ అష్టకములు

11 విష్ణుపురాణం

12 పవిత్రబైబలు (పాత. క్రొత్త)

13 కన్నడభాష రుద్రముని కాలజ్ఞానం

14 కన్నడభాష కాలజ్ఞానం-పురాతనప్రతి

15 సంగ్రామ పురాణం

16 ఓంఢ్రభాష అచ్చుతానంద మాలికా కాలజ్ఞానం

17 ఓంఢ్ర కల్కి-పురాణం

18 ఆంధ్రసారస్వత 2వతరగతి వాచకము
19 5వ తరగతి తెలుగు వాచకము
20 పెద్దమనుష్యుల సినిమా పాటలు
21 చేతావని-తెలుగు అనువాదము
22 భగవన్నుతి రత్నములు
23 శ్రీ కవీంద్ర రవీంద్ర ఠాగూర్ గారి సందేశం
24 విద్యార్థి కరపత్రము
25 ఖండకావ్యము
26 ఈతచెట్టు సూచన
27 శ్రీ వీరబ్రహ్మంగారి వాక్యామృతం
28 సనారి విశ్వేశ్వర సంవాదం
29 శ్రీ వీరబ్రహ్మంగారి వచనకాలజ్ఞానం
30 శ్రీ వీరబ్రహ్మంగారి గోవింద వాక్యములు
31 శ్రీ వీరబ్రహ్మంగారి కాలజ్ఞాన తత్వములు
32 శ్రీ వీరబ్రహ్మంగారి భూత, భవిష్య ద్వర్తమాన కాలజ్ఞానం
33 శ్రీ వీరబ్రహ్మంగారి తాటాకుల కాలజ్ఞానం
34 శ్రీ వీరబ్రహ్మంగారి మఠములోని (పెదవడ్లపూడి) శ్రీఅన్నే కృష్ణయ్యగారి ముచ్చటలు
35 శ్రీ వీరబ్రహ్మంగారి వచన కాలజ్ఞానం Madras A. D. 1897
36 The predication of Mr. Edward Lyndoe, the Astrologer in the people.
37. The book of forty-future wonders
38 మహాభారతము
39 భాగవతము
40 కల్కియవతార పురుషుని పత్రికలోని వ్యాసం

# — విజ్ఞప్తి —

భక్తమహాశయులారా! హిందూ-ముస్లిం ధర్మ సమైక్యతకై నేటివరకు అనేక ప్రయత్నములను కొనసాగించినప్పటికిని, తగిన ఫలితము ప్రాప్తించలేదు. ఎందుకనగా "రోగ మొకటి - మందొకటి" అను సామెతగా పరిణమించినది. భారత ధర్మశాస్త్రములన్నియు సంస్కృత భాషలోను, ఇస్లాం ధర్మశాస్త్రములన్నియు అరబ్బీ భాషలోను యున్నవి. ఇవి రెండు కూడ చాలా కఠినమైన భాషలు, సులభముగ ప్రాప్తించు భాషలు కావు. ఒక భారతీయుడు తన ధార్మిక భాష సంస్కృతమును కృషిచేసి ఆర్జించుకొనగలడు. ఒక ముస్లిం తన ధార్మిక భాష అరబ్బీ నేర్చుకొనగలడు. అయితే యీ రెండు భాషలను నేర్చుకొని ప్రావీణ్యము పొందుట చాల కష్టము. ఒకడు యెంతటి ఉభయభాషాపరిజ్ఞానమును సంపాదించినప్పటికినీ, ధార్మిక సద్బుద్ధితో ధర్మములను సమన్వయము చేయుటకు అతనియందు పరమాత్ముని ప్రేరేపణ కలుగకపోతే యీ కార్యమును చేయజాలడు. ఇదియునుగాక నేటివరకు రాజకీయ సంస్థల కారణమువలన ఉభయులలోకూడ మతములను ఐక్యపరచుటకు త్రికరణశుద్ధిగా వైరాగ్యముతో ఒక్కరైనను నిలబడి పనిచేయలేదు. వెనుకటి కాలములో ఇప్పటి అధర్మకాల పరివర్తనలుకూడ యుండలేదు. పై కారణములచేత హిందూ-ముస్లిం ధర్మసమైక్యత నేటివరకు సాధ్యపడలేదు.

ధర్మ సంస్థాపనము సర్వేశ్వరునిద్వారానే యెల్లయుగాల్లోను జరిగినది. ఇప్పటి యుగ సంధిలోకూడ దీని కర్త సర్వేశ్వరుడే. సర్వలోక కల్యాణకర, జగన్నాధ, జగద్గురువగు అంత్య ప్రవక్తను జగత్తులో అవతరింపజేసిన విషయమును ఇప్పటి యుగసంధిలో భారతదేశము నుంచి జగమంతటకును సర్వేశ్వరుడు పునః ప్రజ్వలింపచేయును.

కాబట్టి అల్లాః సర్వేశ్వరుడు తగిన శక్తులను ప్రసాదించి, తన ప్రియ ప్రవక్త అయిన శ్రీ హజ్రత్ ముహమ్మద్ (వీరిపై అల్లాః సర్వేశ్వరుని శాంతి, ప్రసన్నత యుండుగాక!) గారి అనుయాయులలో హిందూ - ముస్లిం ధర్మములను సమైక్యత పర్చుటకు శ్రీ అయోని కల్కియవతార్:- "వీరభోగ వసంతరాయులను" నియమించినాడు. వీరిని నియమించుట భారతీయు లందరికిని కల్యాణకరము, సుఖప్రదాయకము, గంగావతరణము వంటిది, సర్వులకు ఆనందదాయకము.

ఈ మహనీయులు నావంటి 300 ల శిష్యులకు ఇస్లాం, వైదిక భాషలను అనువదించి నిజమైన శాస్త్రార్థజ్ఞానమును ప్రసాదించినారు. కాబట్టి యీ కార్యమును చేయుటకు కంకణము కట్టుకొని, సర్వత్యాగములను చేయుటకు సర్వదా సంసిద్ధులమై నిలచినాము.

కాబట్టి నేను హిందూ-ముస్లిములకు సంధిచేయునట్టి శ్రీ జగద్గురువుయొక్క అనుచరుడుగా నిలబడిన శ్రీ మద్విరాట్ వీరభోగ వసంతరాయులు: "అయోనికల్కి యవతార్" యొక్క ఆగమనమును, కుర్-అన్, హదీస్, సర్వ భారతీయ శాస్త్రముల ప్రమాణపూర్వకముగా నిరూపించుచున్నాను.

ఇప్పటి కాలమార్పుల ప్రభావగతులను అర్థము చేసికొని, సర్వులు ఈ ధర్మప్రచారమగు హిందూ – ముస్లిముల ధార్మిక సమైక్యత కొరకు తను, మన, ధనములతో మాకు సహాయముచేసి, ధర్మము యొక్క పేరు, ప్రతిష్ఠలను నిలబెట్టి, నేటి భారతదేశపు కాంగ్రెస్ ప్రభుత్వపు (Secular Govt. అనగా విమత పరిపాలనము) పరిపాలకుల హృదయములను పరివర్తన చెందించి, వారిని ధర్మరాజ్య స్థాపనకు మళ్ళించి, పాపముతో కూడియున్న పుణ్యభూమి యగు భారత దేశమును సాక్షాత్ ఉద్యానవనములతో కూడిన స్వర్గసీమగా, కైలాస నివాసముగా చేయుదురని మనవి చేయుచున్నాము.

ఇట్టి సర్వ కల్యాణకరమైన ధార్మిక సమైక్యత కొరకు పాలితులేమి, పాలకులేమి, ప్రోత్సాహ మొసంగక పోయినట్లయితే అల్లాః సర్వేశ్వరునిచే దండింపబడుదురనే అంశమును గుర్తించాలని హెచ్చరిక ! కావున సద్భావముతో కూడిన సర్వమతముల ధార్మిక సమ్మేళనమగు ఇస్లాం: శాంతి మతమును స్వీకరించి, ఈ కార్యమందు మాకు సహాయపడవలసినదిగా నా విజ్ఞప్తి.

శ్రీ మహావిష్ణువుని దశయవతార పురుషులలో కల్కి యవతార పురుషుడు శ్రీ ముహమ్మద్‌గారే (వీరిపై అల్లాః సర్వేశ్వరుని శాంతి, ప్రసన్నతయుండుగాక!) మరెవ్వరు కాజాలరు. వీరు జగత్తులో అవతరించి నేటికి దాదాపు 1380 సంవత్సరములు అయినప్పటికిని భారతీయ పండితులు, గురువులు, మతాధిపతులు, తమ సాక్షాత్ గురువగు శ్రీ ముహమ్మద్ (శాంతి, ప్రసన్నత వారిపై యుండుగాక!) గారిని విశ్వసింపక యుండుటచేత అప్పటి నుండి భారతీయులు అధఃపతనములైనారు. పాపము పెచ్చుపెరిగిపోయినది.

(శ్రీ ముహమ్మద్‌గారే కల్కి యవతార పురుషులు అనే విషయము హిందూ–ముస్లిం ధార్మిక సమ్మేళనము, మొదటిభాగమును చూడుడు. ఇది దొరకేచోటును ఈ పుస్తకములో కనపరచినాను.

కరుణామయుండగు అల్లాః సర్వేశ్వరుడు, పతిత భారతీయులందరికిని అధ్యాత్మిక, ఉన్నతోన్నత, ఆత్మపదాంతములను ప్రసాదించుటకు శ్రీమత్ విరాట్ వీరభోగ వసంతరాయులును నియమించినాడు. వీరు అయోని కల్కి యవతార్, అనగా:– కల్కి యవతార్ పురుషుడగు శ్రీ ముహమ్మద్‌గారిలో ఐక్యమయినవారు, శ్రీ ముహమ్మద్‌గారి కార్యతత్వమును మూర్తీభవించినవారు.

గమనిక:– (1) ఈ గ్రంథమందు ప్రవక్తలగు శ్రీరామ, శ్రీకృష్ణ, శ్రీ యేసుక్రీస్తు, శ్రీ బుద్ధ, శ్రీ వర్ధమాన మహావీర్ మొదలగు ప్రవక్తల పేర్లు వచ్చునపుడు, అల్లాః సర్వేశ్వరుని శాంతి వారి ఆత్మలపై యుండుగాక అని ఉచ్చరించవలయును.

(2) స్వరాట్, విశ్వకర్మ, దయాసాగరుండగు శ్రీ ముహమ్మద్‌గారి నామధేయము వచ్చినపుడు, అల్లాః సర్వేశ్వరుని శాంతి, ప్రసన్నతయుండుగాక అని ఉచ్చరించవలయును.

భక్తులెల్లరకును నా మనవి యేమనగా, ఈ పుస్తకములో వ్రాసిన విషయములను అర్థము చేసికొని, శ్రీ మద్విరాట్ వీరభోగవసంతరాయులను, ఒక క్షణమైనను ఆలసించక గుర్తించి, శ్రీ ముహమ్మద్‌గారిని విశ్వసించుడు. వీరి ముక్తిదాయక మంత్రమగు "లా-ఇలాహ-ఇల్‌లల్లాహు-ముహమ్మదుర్ - రసూలుల్ లాహి" పఠించండి. శ్రీ కల్కి గ్రంథమగు ప్రణవ వేదము; "కుర్-ఆనను" చదవండి.

ఓయీ ! అల్లాః సర్వేశ్వరుడా ! మా భారతీయులందరికిని శ్రీ వీరభోగవసంతరాయులను గుర్తించుటకును, శ్రీ ముహమ్మద్‌గారిని విశ్వసించుటకును ప్రేరేపించుము !!!

ఆమీన్ ! తథాస్తు !!

**జై హింద్ !**

క్యాంపు - గుడివాడ.
10 - 6 - 60.

**ముహమ్మద్ అబ్దుస్ సత్తార్,**
పరివ్రాజకాచార్యుడు.

---

××××××××××××××××××××××××××××××××××××××××××××××××××××××××××××

THE CERTIFICATE OF APPRECIATION GIVEN BY

**Mr. Kavi M. A. Gani khan, Burdwan City, West Bengal.**

# West Bengal Muslim Research Society.

Memo No.

From :

**Kavi M. A. Gani khan**
President, West Bengal Muslim,
Research Society,
Peerbahram Road - BURDWAN (West Bengal)

I had the privilage to attend the religious lectures of Sri Pandit Divakar Md. Abdul Sattar Bardhamana Mahaveer held in the Burdwan Bangs Gopal Town hall from 18th to 20th February, 1955.

The Scientific, logical and philosophical speeches touched the hearts of the audience. His liberal views are much appreciated and will be of immence value to the members of religious faiths.

(Sd.) *M. A. Gani Khan.*
20 - 2 - 55.

××××××××××××××××××××××××××××××××××××××××××××××××××××××××××××

---

మా సర్వధర్మ సమ్మేళన శాంతి ఉపన్యాసములు విని, వొసంగిన అభిప్రాయ పత్రము లలో కొన్నింటిని ఈ క్రింద యిచ్చుచున్నాను :—

నూజివీడు (కృష్ణాజిల్లా, ఆంధ్రప్రదేశ్) భక్తసమాజంవారు సమర్పించిన స్వాగతపత్రము.

ఓం తత్ సత్.

# స్వాగతపత్రము

**నూజివీడు పట్టణ - శ్రీ వెంకటేశ్వర న్యూ బిల్డింగ్సులో జరిగిన వేదాంతసభలు జరిపిన**

1. శ్రీ పండిట్ దివాకర్ మహమ్మద్ అబ్దుల్ సత్తారు వర్ధమాన్ మహావీరుగారు.
2. శ్రీ వేదాంతకవి షేక్ ఆలీహుశ్శైన్‌గారు.
3. శ్రీ మౌల్వీ మహమ్మద్ రజా షరీఫ్‌గారు.

ది 24 - 8 - 54 లగాయతు 30 - 8 - 54 తేదీ వరకు అనగా వారం రోజులు పండిట్ వేదాంత మౌల్వీగార్లు యిచ్చిన మహోపన్యాస సభలకు యిచ్చిన స్వాగతము.

**మహాపండితులారా ! వేదాంతులారా !!**

మీయొక్క మృదుమధుర వాక్కులచే మమ్ము యావన్మందిని పరమాత్మ గోష్ఠిచే రంజింపజేసిన మహాభక్తులు హిందూ మహమ్మదీయ సర్వమత సామరస్యముచే మెప్పించి సర్వ గ్రంథములలోయున్న, సారాంశములు మాకు చెప్పిన ధీరులు, కేవలము ఆధ్యాత్మికమైన విషయములు, వొకరినిమించి నొకరు చెప్పుచు ప్రజల హృదయములను చూరగొనిన సహజమైన పండితులు. మిమ్ములను మేమందరము కొనియాడుటకు కేవలము న్యాయసమ్మతమై యున్నది కాని అతిశయోక్తిగాదు. గనుక మహమ్మదీయ పండిట్ వేదాంత మౌల్వీ మహాశయులారా, కేవలము అన్ని మతములు సమానభావముగ నిరూపించి గ్రంథములయొక్క నిజస్థితి తెల్పిన మహాశయులు, మీరు యింత అనుభవముతో నేర్చుకొన్న విద్య మీ పూర్వజన్మ సుకృతము గాని వేరొండుగాదు. గాన భగవంతుడు మిమ్ములను సకల ఐశ్వర్య ఆరోగ్య అభివృద్ధితో రక్షించుగాక యని ప్రార్థించుచున్నాము.

ఇట్లు,

**నూజివీడు భక్త సమాజం.**

కృష్ణాజిల్లా - ఆంధ్రప్రదేశ్.)

 انما یؤمن بآیاتنا الذین اذا ذکروا بها خروا سجدا وسبحوا بحمد ربهم وهم لا یستکبرون 

# لا الہ الا اللہ محمد رسول اللہ



శ్లో॥ మ్లేచ్ఛవ్రాత వినాశకః । కలియుగాశ్వాధిరూఢా మహాన్ ,
మయూపి బహుభానుకోటి । సదృశోభీమాంశు చక్రాయుధాః ।
యస్సాక్షకృత కల్కిరూప । విభవో భూమహా భవిషాన్వయః ,
శ్రీమాన్ సింహగిరీశ్వరః । కరుణయాదిత్యాత్ సదామంగళం ॥

## అయోని కల్కి అవతార్

## శ్రీ వీరభోగవసంతరాయులు [వయస్సు 63 సం॥]



శ్రీ వీరభోగవసంతరాయుల కుడిచేయిపై రెండు మచ్చలున్నవి.

కన్నడ కాలజ్ఞానం (వయస్సు 40 సం॥)

انما یؤمن بایتنا الذین اذا ذکروا بها خروا سجدا و سبحوا بحمد ربهم و هم لا یستکبرون

# لا اله الا الله محمد رسول الله

There is no god but Allah muhammad is the prophet of Allah.

శ్రీ జగద్గురువే నమః

## అధ్యాయము - 1

# అయోని కల్కి యవతార్ శ్రీ మద్విరాట్ వీరభోగ వసంతరాయుల ఆగమనము.

నవూజు - బిల్లాహి - మినషైతా - నిర్రజీమ్ :—

దైవసన్నిధినుంచి బహిష్కరించబడిన షైతాన్ (పిశాచము) నుంచి అల్లాః సర్వేశ్వరుని రక్షణ మేము గోరుచున్నాము.

శ్లో॥ శుక్లాంబర ధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్ ।
ప్రసన్నవదనం ధ్యాయేత్సర్వ విఘ్నోప శాంతయే ॥

తెల్లనిదుప్పటి ధరించు, చంద్రుని ప్రకాశముగల, కార్యభారము వహించు నలుగురు శిష్యులుగల, సర్వవిఘ్నములను తొలగించు, శాంతమూర్తి, భక్తులకు ప్రసన్నమగు విష్ణుదేవుని ధ్యానించుచున్నాను. ఈ సద్గుణములను మూర్తీభవించినవారు శ్రీ ముహామ్మద్‌గారు (వీరిపై శాంతి, ప్రసన్నత యుండుగాక !) గాక మరేప్రవక్తకాదు సుమా! (ప్రచురణమగు హిందూ - ముస్లింధార్మిక సమ్మేళనము 6వ భాగములో ఈవిషయమును తెలుసుకొనుడు)

బిస్మిల్లా - హిఱ్ఱహ - మా - నిఱ్ఱ - హీం.

పరమ దయాళుడు, దాక్షిణ్యమూర్తియగు అల్లాః నామధేయంబుతో ప్రారంభమగు గాక!

యా - అయ్యు - హల్లజీన - ఆమను - మై - యక్ - తద్ద - మిన్ - కుమ్ - అన్ - దీనిహి ఫ-సౌఫ - యాతి-యల్లాహు-బిఖౌమిన్-యు-హిబ్బు-హుమ్-వ-హిబ్బూనహూ-అజిల్లతిన్ -అలల్-మోమి - నీన - అఇజ్జతిన్ - అలల్ - కాఫిరీన-యుజాహిదూన-ఫీ-సబీలిల్లాహి-వ-లా- యకాఫూన-లౌమత - లాఇమిన్ - జాలిక - ఫజ్ - లుల్లాహి-యుగాతీహి - మైషాఉ - వల్లాహు - వాసివున్ - అలీమ్ - ఇన్నమా - వలీయుకు ముల్లాహు - వ - రసూలుహు - వల్లజీన - ఆమనుల్లజీన - యుకీ

మూాలస్సలాక - వ - యుతూనజ్జు కాత - వ - హుమ్ - రాకిఊన్ - వమైయతవల్లాహ - వర సూలహా - వలజ్జీన ఆమను - ఫఇన్నహిజ్ బల్లాహి - హుముల్ గాలిబూన్.

(కుర్-ఆన్, సూరా: అల్‌మాయిదా 5 రుకూ : 8.)

అర్థము:- ఓయీ విశ్వాసులారా! మీలో కొందరు అతని మతమునుంచి విముఖులైనప్పుడు, అల్లాః సర్వేశ్వరుడు తనభక్తులను తీసికొనివచ్చును. వారు పరమాత్ముని ప్రేమింతురు. అతడు వారిని ప్రేమించును. వారు విశ్వాసులయెడ నమ్రతగా యుందురు, అవిశ్వాసులయెడ కఠిణముగా యుందురు. అతని ధర్మసంస్థాపనార్థమై తమ సర్వశక్తులను ధారపోయుదురు. ఇతరుల పరిహాసములను లక్ష్యపెట్టరు. ఇదియే అల్లాః పరమాత్ముని అనుగ్రహము, అతడు, తనకిష్టపడు వారిని అనుగ్రహించును. అల్లాః పరమాత్ముడు, అతని ప్రవక్త, మరియు విశ్వసించి, ప్రార్థన స్థిరపర్చి విధిప్రకారము ధన (జకాత్) మిచ్చి, దైవ విధులకు శిరసావహించువారే మీసహజ మిత్రులు సుమా! అల్లాః పరమాత్ముని, అతని ప్రవక్తను, భక్తులను ప్రేమించువారే తప్పక విజయమును పొందువారు.

"మీకు క్రైస్తవులకు మధ్య నాలుగు యుద్ధములు జరుగును. ఆయుద్ధములు ఏడు యేండ్లుజరుగును. అప్పుడు నా అనుయాయులలో ఒకడు దైవకార్యమునకు నిలబడును. అతడు నా సంతతివాడై యుండును. అప్పటికాయన వయస్సు 40 యేండ్లుండును. అతని కుడిచెంపపై నల్లని మచ్చయుండును. అతడు రెండురంగుల దుస్తులు తొడుగును."

(హదీసులు, (1) అబూదావూద్ పుటము 588, (2) మిష్‌కాత్ పుటము 270, (3) కంజులుల్ - ఆమాల్ పుటము 187.)

పై హదీస్ సూచన ప్రకారముగా తుర్కీ-ముస్లీములకు, క్రైస్తవులగు ఇంగ్లీష్‌వారికిని 7 సంవత్సరముల వరకు యుద్ధములు జరిగెను. ఆయుద్ధములు క్రీ. శ. 1923లో అంతమాయెను. శ్రీ ముహమ్మద్‌గారి (వీరిపై అల్లాః పరమాత్ముని శాంతి, ప్రసన్నత యుండుగాక!) వంశీయులగు శ్రీవీరభోగ వసంతరాయుల వయస్సు అప్పటికి 40సం॥ ములు. వీరికుడిచెంపపై నల్లనిమచ్చ యున్నది. (ఫోటోచూడుడు) పచ్చపాగ, కాషాయచొక్కా, ఈ రెండురంగుల దుస్తులు తొడిగినారు.

" షోడశ కళాయుక్తో పరమాత్మః "

(1) యజుర్వేదము, అధ్యాయము 8, మంత్రం. 36,
(2) మానసికా పూజాకృతము, పుటము 1.)

వేద, ఉపనిషత్తులలో పరమాత్ముడు 16 కళలు గలవాడని వర్ణించినారు. అట్టి పరమాత్ముని తత్వమును మూర్తీభవించి, శంఖు, చక్ర, గదా, మొదలగు 16 శారీరక చిహ్నములతో

అవతరించిన శ్రీ మద్విరాట్ వీరభోగవసంత రాయులను విశ్వసించువారు మహాభాగ్యశాలులగుదురు సుమా!

( 16 కళల ఫోటో చూడుడు )

శ్లో॥ జయ్ సత్యయుగ్ స్థాపన్ కరన్, నాశన్ మ్లేచ్ఛఅపార్ ।
కఠిన్ధార్ తల్వార్ కర్, కృష్ణకల్కి అవతార్ ॥

(సంస్కృత కల్కిపురాణము హిందీ అనువాదకుల విజ్ఞప్తిపుటం 1, శ్రీ పండిత బలదేవ్ శర్మప్రసాద్‌జీ. ముద్రణకళ్యాణ బాంబె. క్రీ. శ. 1937)

ధర్మ విద్వేషుల శిక్షించువాడు, సత్యయుగ స్థాపకుడు, ఖడ్గపాణి, మేఘవర్ణుడగు శ్రీ కల్కియవతార పురుషునకు జయము గల్గుగాక !

ఇట్టి సద్గుణములు గల్కిన శ్రీ వీరభోగ వసంతరాయులు అవతరించారనే విషయమును తెల్పుటకు నేను బహు ఆనందించుచున్నాను. భక్తులారా! మీరుకూడ ఆనందించండి. ఈ శుభ యోగము మనకు ఇప్పటి యుగములో కలిగినది ! (అయోని కల్కియవతార్ శ్రీ వీరభోగ వసంత రాయుల ఖడ్గపాణి ఫోటో చూడుడు.)

శ్లో॥ యదా యదాహి ధర్మస్యగ్లానిర్భవతి భారత ।
అభ్యుత్థానమధర్మస్య తదాఽత్మానాం సృజామ్యహమ్ ॥

(భగవద్గీత, అధ్యాయం 4, శ్లోకము 7)

ధర్మము నశించి, అధర్మము అభివృద్ధి చెందినప్పుడెల్ల నేను ఆత్మనుపొంది అవతరింతును.

శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతామ్ ।
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥

( భగవద్గీత : అ. 4, శ్లో॥ 8 )

భక్తులరక్షణ, దుష్టులశిక్షణ, ధర్మ సంస్థాపనకై యుగ యుగములలో నేను పుట్టివత్తును.

పై రెండు శ్లోకములలో కనపర్చిన కార్యనిర్వాహణ కర్తయై శ్రీ వీరభోగవసంత రాయులు అవతరించినారు. వీరి పూర్ణచరిత్ర చదవండి. విషయములు తెలియవచ్చును.

శ్లో॥ యో ధర్మో బ్రాహ్మణానాంహి సా భక్తిర్ మమపుష్కలా ।
తయాహం తోషితః శ్రీ శః సంభవామి యుగే యుగే ॥

(కల్కిపురాణము. అధ్యాయము. 1 శ్లోకము. [redacted]

శ్రీ మహావిష్ణువు లక్ష్మీపతి రూపముతో ప్రతియుగములోను అవతరించి, భక్తులకొరకు ధర్మమును స్థాపించును.

శ్రీ వీరభోగ వసంతరాయులు శ్రీ మహావిష్ణు అంశముతో అవతరించి, ధర్మసంస్థాపన కార్యము సాగించుచున్నారు.

(వీరి జగద్గురు ఆశ్రమమును దర్శించి పూర్ణ విషయములను వ్యక్తిగతముగా తెలుసుకొనుడు.)

"అంత శ్రీ లక్ష్మీదేవి నారాయణస్వామికి సాష్టాంగ నమస్కారములుచేసి, స్వామీ పరమపురుషా! ఆదిమధ్యాంత రహితా! అఖిలాండ కోటిబ్రహ్మాండ నాయకా! జగదీశ్వరా! యీ కలియుగ ప్రమాణంబు నాలుగులక్షల ముప్పది రెండువేలసంవత్సరములు, (4,32,000 సం॥) అందు నిదివరకు గతమైనది నాలుగువేల తొంబన్నూట తొంభై రెండు సంవత్సరములు (4,992 సం॥) ఇంతలో పాపము మూడుపాళ్లును, పుణ్యము ఒకపాలును అయినది. ఇంక నేను నిర్వహించలేననియె నంత నారాయణుండు బ్రహ్మాదులను జూచి. మనము ఈ భూలోకమందు భూమి పరిపాలనము జేయుట కుద్భవించెదము."

(పుటము 6. శ్రీ వీరబ్రహ్మముగారి వచనకాలజ్ఞానము, ప్రకాశకులు : కొండా శంకరయ్య సికింద్రాబాద్ (దక్కన్) 1950)

పై సూచనలో కలియుగము 4,992 సంవత్సరములకు శ్రీమన్నారాయణుండు అవతరించునని స్పష్టంగా వ్రాసియున్నప్పుడు, కొందరు కలియుగము 4,32,000 సం॥లు గతించిన పిమ్మట వచ్చునని అభిప్రాయ పడుచున్నారు. వీరికి శాస్త్రజ్ఞానముగాని, పరమాత్మని సంబంధమగు ఓంకారముగాని లేదు.

సకాలములో శ్రీమద్విరాట్ వీరభోగ వసంతరాయులు అవతరించినారు.

"వ॥ వినుమో పార్వతీ, యీప్రకారంబు ననేక విధంబులగు మహావింతలు నాలుగు యుగంబులలో నాయా సంధికాలంబుల గలుగుచుండునవి యట్లంటే :- నికృత యుగంబునను నాల్గవ పాదంబున, త్రేతా యుగంబున మూడవ పాదంబున, ద్వాపర యుగంబునను రెండవ పాదంబున, కలియుగంబునను ప్రథమ పాదంబున, యుగముల ప్రమాణంబుల కొలది యధిక సూక్ష్మంబులుంగలిగియుండు, నీ కలియుగంబున నైదువేల సంవత్సరములకు నన్నియు కలిగి కుల సాంకర్యంబు నొందినమీందట సమస్త ప్రాణరూపంబులును సుఖంబు నొందెదరుగాన."

(సనారీ విశ్వేశ్వర సంవాదము. క్రీ. శ. 1940. దశమాశ్వాసము కాలజ్ఞానము :- పుటము 210)

امام الناس تقدس مآب سید السادات الحسینی حضرت مولانا صدیق دیندار چن بسویشور صاحب قبلہ

 

(یعنی کلکی اوتار سری ویر بھوگ وسنت رائے)

16 కళలుగల శ్రీ వీరభోగవసంతరాయులు [వయస్సు 40 సం॥]




# మక్కా పుణ్యక్షేత్రము

ఇన్న-అవ్వల-బైతిన్-వుజిఅ-లిన్నాసి-లల్లజీ-బిబక్కత-ముబారకన్-వహుదల్-లిల్లాలమీన్_ఫిహి-అయాతుం-బైయ్యనాత్.

(ఖురాన్ సూరా: ఆలెఇమ్రాన్, రుకు 10 ఆయత్ : 96)

**Lo! the first Sanctuary appointed for mankind is that at Mecca, a blessed place, a guidance to the peoples.**

శ్లో॥ అష్టచక్రా నవద్వార దేవానాంపుర అయోధ్య ।
తస్యాం హిరణ్యః కోశః స్వర్గజ్యోతిషావృతః॥

(1 అథర్వణవేదము, కాండం: 10 మంత్రం: 31)

8 చక్రములు తొమ్మిది ద్వారములు, అజేయమైన దేవతులపురము; శాశ్వతజీవ చైతన్య భండారము; సదాజ్యోతితో ప్రకాశించుచున్న క్షేత్రము.

ఈ క్షేత్రముయొక్క విషయములలో రెండుమాత్రం కనపర్చినాను. సంపూర్ణ విషయములు 3వ భాగములో వ్రాయబడును.

కైలాస నివాసుండగు శంకరుడు పార్వతితో నిట్లు చెప్పసాగెను. ముందు కలియుగమున ధర్మము మూడుపాళ్లు నశించును. అప్పుడు కలియుగము 5,000 సంవత్సరములకు అసురకుల క్షయకరుండు, దేవగణ పరిపాలకుండగు శ్రీ వీరభోగవసంతరాయులు అవతరించి ధర్మసంస్థాపన చేయును.

భారతదేశపు అష్టదిశలలో ధర్మప్రచారము అనేక విధములుగా సాగుచున్నది. ఇది అజ్ఞాతవాసము.

"ఆయన (పరమాత్ముడు) వారికన్నుల ప్రతిభాష్ప బిందువును. తుంచివేయును. ఇక మరణముండదు. ... ...అప్పుడు ... ...సింహాసనాసీనుడై యున్నాడు (బైబల్ ప్రకటన 21-4,5)

శ్రీ యేసుక్రీస్తు భక్తులనుకూడ శ్రీ వీరభోగవసంతరాయులు రక్షించును. వారి దుఃఖములను తొలగించును.

"ఆయన గొప్ప బూరతో తన దూతలను పంపును. వారు ఆకాశముయొక్క ఈ చివరనుండి ఆ చివరవరకు నలుదిక్కుల నుండి ఆయన ఏర్పరచుకొనిన వారిని పోగుచేతురు."

(బైబలు, మత్తయి అ: 24 వాక్యము: 31.)

పై సూచననుసరించి రుద్రాంశ యేసు శ్రీ వీరభోగవసంతరాయుల వ్యక్తిత్వములోనే వేంచేసినారు. వారి శిష్యులగు మేము గొప్ప బూరతో (పొంగ) ప్రతిపట్టణమున వీరి రాకను ప్రకటనచేస్తూ, భక్తులను పోగుచేయుచున్నాము. యేసు విశ్వాసులారా! రండి, శ్రీ యేసుని ఇస్లాం ధర్మ ప్రచారములో పాల్గొనండి.

"కలియుగము 5,000 ఏండ్లు అగునప్పటికి, దుష్టనిగ్రహ, శిష్టపరిపాలన చేయుటకువత్తును."

(శ్రీ వీరబ్రహ్మంగారి వచన కాలజ్ఞానము. పుటము 16.,
ప్రకాశకులు: శ్రీ కొండా శంకరయ్య, సికింద్రాబాదు – 1950.)

దుష్టనిగ్రహ, శిష్ట పరిపాలన చేయుటకు శ్రీ వీరభోగ వసంతరాయులు వేంచేసినారు. సంతోషించండి. వీరి అనుగ్రహము పొందండి.

"కావున కల్కి భగవానుండనే వీరభోగవసంతరాయులు ఆదిలక్ష్మీ సమేతుండైన శ్రీ మహావిష్ణువు, అని తెలుసుకొనవలయును."

(శ్రీ వీరబ్రహ్మంగారి తాటాకుల కాలజ్ఞానము. పుటము 4, ప్రకాశకులు: మానేజింగ్ కమిటీ, దేవాలయ యాజమాన్య సంఘము, పందిళ్ళపల్లి, బాపట్ల తా॥ గుంటూరుజిల్లా, ఆంధ్ర ప్రదేశ్.)

శ్రీ మహావిష్ణువు కల్కి యవతారపురుషుడగు శ్రీ ముహమ్మద్‌గారు. (వీరిపై శాంతి, ప్రసన్నత యుండుగాక) శ్రీ మద్విరాట్ వీరభోగవసంతరాయులు వీరి అంశముతో వేంచేసినారు. ఈ విషయమును చక్కగా అర్థము చేసుకోవలయును. గాబట్టి శ్రీ వీరభోగ వసంతరాయులను గుర్తించి, శ్రీ మహావిష్ణువగు శ్రీ ముహమ్మద్‌గారిని (అల్లాః సర్వేశ్వరుని శాంతి, ప్రసన్నత వీరిపై యుండుగాక !) ఆలసించక విశ్వసించండి సుఖపడుదురు.

"కలియుగంబున జరుగు హేతుర్యాతంబుల చేయంగలిగిన పదునొక్కటవ యవ తారంబగు శ్రీ వీరభోగవసంతరాయుల యవతారంబునెత్తి నూటయెనుబది యేండ్లు రాజ్యంబు చేయగలరు. అపుడుకృత, త్రేతా, ద్వాపరయుగంబుల ధర్మంబు వర్ధిల్లును."

(వీరబ్రహ్మంగారి వచన కాలజ్ఞానం పుట 18. ప్రకాశకులు : కొండా శంకరయ్య సికింద్రాబాద్.)

పైవాక్యములలో యుండే రహస్యమేమనగా, పదియవ అవతార పురుషుడగు కల్కి యవతారము శ్రీ ముహమ్మద్‌గారి (వీరిపై పరమాత్ముని శాంతి, ప్రసన్నతయుండుగాక !) ప్రవక్తత్వము (Prophet hood) పూర్తిఅయిన విషయము శ్రీ వీరబ్రహ్మంగారికి చక్కగా తెలియును. వీరు శ్రీ ముహమ్మద్‌గారి తత్వమును మూర్తీభవించి, ఇస్లాంమతసిద్ధాంతముల ప్రచారం సాగించిరి. అయితే ముస్లీంలు తప్ప మరెవ్వరు వీరిని అనుసరించలేదు. వీరి మతస్థులుగాని వీరిని విశ్వశించలేదు. తాను ఆశించిన ప్రచారము ఫలించలేదు, గాబట్టి పునః 5,000 సంవత్సర ములకు శ్రీ వీరభోగవసంతరాయుల రూపములో అవతరింతునని వాక్కిచ్చినారు.

ఆ వాగ్దాన ప్రకారముగా ఇప్పటియుగసంధిలో శ్రీ ముహమ్మద్‌గారి అనుయాయులలో అవతరించినారు. తానుఆశించిన ఇస్లాం మత సిద్ధాంతములు ఇకకొంత అవధిలోనే దిగంతరాల వరకు వ్యాపించిపోవును. సర్వమత గ్రంథములు ఈ విషయమునే వెలుగెత్తి చాటుచున్నవి. మత శాస్త్రములను పరిశీలింపుడు విషయం తేట తెల్లమగును. ఈ విషయమే చిదంబర రహస్య మన బడును. ఈ రహస్యమును తెలుసుకొన్నట్లయితే, ఇస్లాంమతము తెలిసిపోవును. నేటివరకు దాచిన కల్కియవతార పురుషుడగు శ్రీ ముహమ్మద్‌గారి విషయములు బహిరంగలో వచ్చుచున్నవి. దైవానుగ్రహమువలన ఇవన్నియు ఇక కార్యరూపములో వచ్చును. అన్నిచిక్కు సమస్యలు పరిష్కరించబడును. భారతీయులు సర్వదేశ ప్రజలకు మార్గ దర్శకులగుదురు. ఇది దైవాను గ్రహము.

అయిదువేలమీద బహుధాన్యలోపల, అన్నిజాతములొక్కటయ్యీ నిమా,
అవనిలోగల బీదధనవంతు లొకటిగ అయ్యే యోగముకూడ వచ్చేనిమా ॥

(శ్రీ వీరబ్రహ్మంగారి గోవిందవాక్యములు పుట 14. నెంబరు 20. ప్రకాశకులు కీ. శే. జవంగుల నాగభూషణదాసు. 1951)

జనియించు విధమూలు జెప్పశక్యముగాదు, గనుక గురుకృపవల్ల దెల్పేనుమా।
పనుపాటిపల్కేద పరమాత్మ లీలాలు, పంచసహస్రాణిపై దెల్పేనుమా।

( గోవిందవాక్యము నెంబరు 56 పుటము 8 )

కల్లాయుగము అయిదు వేలేండ్లలోపల కలికిరూపుడు తర్లి వచ్చీనిమా।
ఎల్లాలోకమూలు యేలుచు చతర్యుగముల్లో సధర్మములు సలిపేరుమా॥

( గోవిందవాక్యము నెంబరు 99, పుటము 13 )

పైమూడు గోవింద వాక్యములలో కలియుగము 5,000 సం॥ లుకు వచ్చునని శ్రీ వీరబ్రహ్మంగారు సూచించినారు. శ్రీ వీరభోగ వసంతరాయులు కల్కిరూపములో అనగా శ్రీ ముహమ్మద్‌గారి ( వీరిపైశాంతి, ప్రసన్నత యుండుగాక ) అనుయాయులలో అవతరించినారు.

హంపీ విరూపాక్షి రెంటూళ్ళ నడమాను, అరచి బసవడు రంకెవేసేనిమా।
విరూపాక్షివద్ద వీరంగవాద్యము, మారెమ్మ గుళ్ళోను మ్రోగీనిమా॥

( గోవిందవాక్యములు నెంబరు 86, పుటం 11 )

శ్రీ వీరభోగ వసంతరాయులకు చెన్నబసవేశ్వర పేరుకూడ యున్నది.

కేళికాలజ్ఞాన సూచనవా।
ముందాగువంత కాలసూచెనె సారి పేళ్వెనాం॥
హిందె ఆదుదు ముందె ఆగ్వుదు / మందవతిగళు యేనుబల్లరు।
చంద్రశేఖర చెన్నబసవనుబందు జగదుద్ధార మాడువదా॥

( కన్నడ రుద్రముని కాలజ్ఞానం. పుట 1 )

కన్నడప్రాంతమున లింగాయుతుల కాలజ్ఞాన పుస్తకములలో వీరిని శ్రీ చెన్న బసవేశ్వరుడుగా వర్ణించినారు. పై పద్యములో ధర్మముద్ధరించుటకు చంద్రశేఖర చెన్న బసవేశ్వరుడు వచ్చును, అనె సువార్తనిచ్చినారు. అట్టి మహనీయుడు శ్రీ వీరభోగవసంతరాయులే!

ముసల్మానరూపవసుదొళగె తందాను। ఘోసన్యాయ తందాను
బసవప్రభు। మహమ్మద్ నబీసాహేబ, ముసహాఫ్ పిడిదు నింతాను॥

( కన్నడ కాలజ్ఞానం పురాతన ప్రతి పుటములు 17,40,85.86 )

పై పద్యములో బసవప్రభువగు శ్రీ వీరభోగ వసంతరాయులు శ్రీ ముహమ్మద్‌గారి (వీరిపై అల్లాః పరాత్పరుని శాంతి, ప్రసన్నత యుండుగాక!) ముస్‌హాఫ్ అనగా సర్వశ్రేష్ఠ

శాస్త్రముల సారమగు " కుర్ - ఆన్ " వేదమును చేతిలోపట్టుకొని నిలుబడును, అని సూచించి నారు. అట్లనే శ్రీ వీరభోగ వసంతరాయులు సర్వమతభక్తుల ఉద్ధారణకొరకు "కుర్ - ఆన్" వేదమును చేతిలోధరించి వచ్చినారు. ( చేతిలో కుర్-ఆన్ వేదముపట్టుకొని నిలచియున్న ఫోటో చూడుడు) క్రొత్తన్యాయము చేయును, అనగా అంత్యదైవోక్త కుర్-ఆన్ వేదశాసనాన్ననుస రించి భక్తులను నడపించును. సర్వులూ ఆనందింతురు.

" జబ్ సంగ్రామకే దీనహువే । బినముహమ్మద్ పార్నహువే ।
తబ్ హువే సంగలింగ అవతార్ । మహదీ కహెసకలజగ్సారా ॥

( తులసీదాస్ వారి హిందీ సంగ్రామ పురాణము )

జగత్తులో ఇస్లాం : శాంతి ధర్మము వచ్చిన పిమ్మట శ్రీ హజ్రత్ ముహమ్మద్గారి' విశ్వసింపనిచో స్వర్గలోకమునకు పోజాలరు. విగ్రహారాధన తొలగించుటకు ఒకధార్మిక పురుషుడు వచ్చును. అప్పుడుసకల జగత్తులోని వారందరు ఆయనను "మహదీ" అని పిలుతురు.

" నామభజనో నకోరేహేళహే - ఆసిగట్టిలాణి బేళ ।
అహర్నిశోభజో - కళంకిమంతర్ - కంఠకరె జపమాల ।
ప్రభు సంగి సంగి భక్త్రభమణకరే మహీ " ॥

( ఓంఢ్రదేశ అచ్చుతానంద మాలికా అను కాలజ్ఞానము పుటము నెం. 1 )

కలియుగము 5,000 సంవత్సరములకు కల్కిరూపుడు ( శ్రీ వీరభోగ వసంతరాయులు) వచ్చును. కాబట్టి కల్కిమంత్రమును పఠించి దానిని కంఠములో జపమాలగా ధరించండి.

" ఆసీబె - కళంకి యవతార్ । సమస్తోకు కరీబె - ఏకోకార్ ।
వేదోరె - నాతీబోవిచార్ । సబ్ హోవె - ఏకోకార్ ॥

( ఓంఢ్ర భాషకల్కి పురాణం )

కల్కి యవతరించును, అందరినీ ఏకాచారంగా చేయును, చతుర్వేదములను జనులు చదువరు. పంచమ ప్రణవ వేదమగు "కురాన్"ను చదువుదురు. అందరూ ఏకమౌదురు. ఈకార్య నిర్వహణమునకు శ్రీ వీరభోగవసంతరాయులు నిలబడినారు.

శ్లో॥ యద్దోర్దండకరాల సర్పకవల జ్వాలాజ్వల ద్విగ్రహో నేతః సత్కరవాల దండదలితా భూపాః క్షితిక్షోభకాః ।
శశ్వత్ సైంధవవాహనో ద్విజజనిః కల్కిః పరాత్మహరిః పాయాత్ సత్యుగాది కృత్సభగవాన్ ధర్మప్రవృత్తి ప్రియః ॥

قل اللهم مالك الملك تؤتي الملك من تشاء وتنزع الملك ممن تشاء و

تعز من تشاء وتذل من تشاء بيدك الخير انك على كل شيء قدير ۳ س ۴



శ్రీ వీరభోగవసంతరాయులు తన అవతారప్రకటన చేసినప్పుడు, గదగ్ పట్టణములో చూడవచ్చిన భక్తులకు తన హస్తములోయున్న గుర్తులను చూపెట్టుచున్నారు. (వయస్సు 40 సం॥)

( సంస్కృత కల్కి పురాణము. అధ్యాయం 1, శ్లోకము 3, పుటము 3, లక్ష్మీ వెంకటేశ్వర ప్రెస్, కల్యాణ, బొంబె (1937)

పై శ్లోకములోని సద్గుణములమూర్తి శ్రీ ముహమ్మద్‌గారు ( వీరిపై శాంతి, ప్రసన్నత యుండుగాక ) ఇందులోని పూర్ణ వివరములకు హిందూ – ముస్లిం ధార్మిక సమ్మేళనము 3వ భాగము చూడుడు. ప్రచురణ కానున్నది. కలియుగము 5,000 సంవత్సరముల నుంచి పాపము హెచ్చు పెరిగిపోయినది. ఇప్పుడు కలియుగ సంవత్సరము 5060. ఇక అధర్మము నశించును. సత్య యుగము ప్రారంభదశలో యున్నది.

ఇచ్చట గమనించవలసిన విషయమేమంటే ;_ సత్యయుగ ప్రారంభకుడు శ్రీ కల్కియవతార పురుషుడేనని సూచించినారు. కల్కిఅవతార పురుషుడు శ్రీ ముహమ్మద్‌గారే అయినప్పుడు, శ్రీరామ, శ్రీకృష్ణ, శ్రీ యేసుక్రీస్తు, శ్రీ బుద్ధ మొదలగు ప్రవక్తల ద్వారాగాని, వీరిగ్రంథముల ద్వారాగాని సత్యయుగము ప్రారంభము కాదుసుమా. శ్రీ ముహమ్మద్ ప్రవక్తత్వము (అనగా అరబ్బీలో ''నబూవత్'' Prophet hood ) ద్వారా సత్యయుగము భారతదేశములో ప్రారంభమగును. వీరి అనుచరుడగు శ్రీ వీరభోగ వసంతరాయులు కల్కిరూపుడు. శశ్వేత్ సైంధవ వాహనుడు (గుజ్జిము ఫోటో చూడుడు) ఇక అతిస్వల్ప కాలములోనే శ్రీ వీరభోగ వసంతరాయుల ద్వారా సత్యయుగము ప్రారంభమగును. శ్రీ వీరభోగ వసంతరాయుల సత్యయుగ స్థాపన ధర్మ కార్యములో పాల్గొనండి. అష్టైశ్వర్యములు పొందుదురు. జన్మసార్థక మగును. భారతదేశము సర్వరంగాలలో, సర్వతోముఖాభి వృద్ధిచెంది, జగత్ నాయకత్వమును వహించును. భారతీయులు జగత్ ప్రఖ్యాతి గాంచుదురు. శ్రీ మార్కండేయ ఋషులు, ధర్మరాజుతో నిట్లు చెప్పుచున్నారు. ''కలియుగాంతమున పాపము మిక్కిలి యెక్కువగును, ధర్మము నశించును. అప్పుడు ధర్మోద్ధారకుడగు కల్కియవతరించును. ధర్మమును పునః స్థాపించును.''

( భారతము 4వ అశ్వాసం అరణ్యపర్వము )

కలియుగము 5,000 సంవత్సరమున పాపమెక్కువగును. ధర్మముద్ధరించుటకై కల్కియవతరించును.

(భాగవతము, 12స్కంధము అ.2)

కలౌ పంచసహస్రాం, తే జాయతే వర్ణసంకరః
కలౌ పంచసహస్రాంతే విష్ణుస్తత్క్షతి మేధనీం॥

(నారద మహాముని కాలజ్ఞానం)

ఇప్పుడు కలియుగము 5,060 సంవత్సరములైనవి. సర్వత్రా సర్వవిధముల వర్ణ సాంకర్యము ప్రజ్వలించుచున్నదిగదా ? సర్వమతభక్తులను శాస్త్రోక్తంగా సమన్వయ పర్చుటకై

కల్కిరూపుడగు శ్రీ వీరభోగవసంతరాయులు నిల్చినారు. ఈ కార్యము సాగుచున్నది. ఇక స్వల్ప అవధిలో పూర్తియగును.

"ధర్మవిద్వేషులందరిమి ధీరతను। కల్కివై పుడమిని గాపాడు నీవు।
ధర్మమ్ము స్థాపించి దయమమ్మునేలు। విశ్వమూర్తివి నీకు వేయిదండములు॥
(ఆంధ్ర సారస్వత వాచకము 2వతరగతి, గ్రంథకర్త శ్రీరంగాచార్యులు)

పై పద్యములో గ్రంథకర్తయగు శ్రీరంగాచార్యులువారు, శ్రీకల్కిమూర్తి యవతరించి విశ్వమంతట ధర్మంబు స్థాపించి, దయతో మమ్ముపాలించుటకు ప్రార్థించుచున్నారు. ఈకార్యము శ్రీ వీరభోగవసంతరాయుల ద్వారా పూర్తియగును.

"విష్ణుదేవుని పదియవతారములలో కల్కిఅవతారము కడపటిది. ఇది రాబోవు అవతారము. కలియుగము చివర విష్ణుదేవు డీ అవతారము నెత్తును. ఇప్పుడు జరుగుచున్న యుగమే కలియుగము ఇది కలిపురుషుని యుగము. లోకములోని చెడుగునంతయు కలిపురుషుడే కారకుడు"

(తెలుగు వాచకము, 5వతరగతి పుటము 73 ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వపు ప్రచురణము) 1959)

భక్తులారా! పైవాక్యములలోయుండే ఒకేఒక సమస్యను పరిష్కరించితే, హిందువులు ముస్లిములు మతరీత్యా ఏకమగుదురనే విషయములో లేశమాత్రమైన సంశయముండదు. కడపటి యవతారము కల్కియని భారతీయులందరూ విశ్వసించియేయున్నారు. ముస్లిము లందరు శ్రీమహమ్మద్‌గారు 'ఆఖరీనబీ' (అనగా ఆఖరు ప్రవక్తని అర్థము) విశ్వసించియేయున్నారు. అలాటప్పుడు ఇకమతభేదమెక్కడ యున్నదనగా భారతీయ హిందువులందరు శ్రీ మహమ్మద్‌గారిని గుర్తించాలి. అప్పుడు భారతీయ హిందువులు భారతీయ కల్కిఅనుచరులగు ముస్లిమ్ములు (శాంతి దాయకులు) శరవేగముతో ఏకమగుదురు. ఈ కార్యసాధనకు శ్రీ వీరభోగవసంతరాయులు సర్వ భారతీయులను ఆహ్వానించుచున్నారు. రండి వీరి అనుగ్రహముపొంది, సర్వమతస్థులను ఏకముచేయుదము. సర్వఅరిష్టములను అల్లాః సర్వేశ్వరుడు తొలగించును. పరమాత్ముడు మన పక్షంగా యుండును. శత్రువులు మనదేశముమీద వచ్చినట్లైతే సహాయము చేయును.

కల్క్యవతారము:- దశావతారాలలో ఈ కల్కిమూర్తి అవతారం 'ఆఖరు'
అవతారం దుష్టశిక్షణ-శిష్టరక్షణ ఈ అవతార ఆశయాలు... ...

పైవాక్యములు వ్యాసరూపములో ఆంధ్రప్రభ 1-12-1957 వెలువడినవి. వ్యాసకర్తలు శ్రీ M. S. శైవా, నాట్యాచార్యులు Madras 15

—

ఇచ్చట గమనించవలసిన అంశమేమంటే కల్కి-యవతారం ఆఖరు అవతారం. ఆఖరి కల్కి-యవతారమే శ్రీ ముహమ్మద్‌గారు (వీరిపై అల్లాహ్ యొక్క శాంతి, ప్రసన్నతయుండుగాక !) అప్పుడు, వీరిని విశ్వసించకయున్న నామదారి జగద్గురువులు, గురువులు, మఠాధిపతులు, ఆశ్రమ గురువులు, సాధువులు, సన్యాసులు మొదలగు వారి పాదపూజచేయుట మహాపాపము. నమస్కరించుట దోషము, కానుకలు అర్పించితే శనేశ్వరపీడలు చేకూరును. హెచ్చరిక !

సహజభక్తు లుద్ధరించుటకు శ్రీ వీరభోగవసంతరాయలు వేంచేసినారు. వీరి సన్నిధికి రండు. పుణ్యపురుషులగుదురు. దైవ సాక్షాత్కారము లభించును.

An Avatar is literally a "descent and is specially used to describe the descents or incarnations of Vishnu, the Second person of Hindu Trinity In the literal sense of the world Avatar, i. e: entering into flesh, into physical life for the first time.

A further Avatara is promised, though our imaginations can searsc grasp what it is; the books say that kalki will come, riding on a white horse (perhaps the aeroplane) again to establish Righteoness for the sake of men.

( P. 275, First principles of Theosophy: By C. Jina Rajadasa, M. A. president of the Theosophical Society 7th edition 1947, The Theosophical publishing House, Adyar, Madras 20 India ).

I regret very much to notice that even the religiously educated members of the Theosophical Society of India and abroud, have not yet understood the kalki Avatar.

Therefore it is the duty of Sri Veera bhogavasanta Raya and of ourselves (his disciples) to request them to believe in the prophethood of Hazrat Muhammad (May peace and blessings of Allah be upon him) who is in fact, the Kalki Avatar and embrace Islam which is the Occan like religion to unite the followers of different prophets of the world and thus Save themselves and humanity at large.

On behalf of Hazarat Muhammad (may place and blessin[redacted]s b[redacted] upon Him) His follower (the Kalki Rupa) Sri Veerabhoga Vasanta Raya, [redacted]o [redacted] raised by Allah, will establish again Righteousness for the sake of men in[redacted]hi[redacted]Yuga-Sadhi, in a very short coming period in this sacred land of Bharat. .

(Please see the ph[redacted]o [redacted]Horse riding)

—: కల్క్యవతారము :—

సీ॥ కలియుగాంతమున దు । ష్కర ముష్కరతురుష్క చ[redacted]ల[redacted]పా ,
షండమండలీ మండితాఖండ । భూమండలము జూచి [redacted]పర్ణార్ణ
తామ్రపర్ణితటమున బ్రహ్మవి । ద్బ్రహ్మణునకుబ[redacted]త్తమా

శ్వాధిరూఢుడయి జోడుతొడిగి । డాలుకత్తి కమానుపూనికమీర । పూనిక
మీరబుడమిబట్టి

గీ॥ నట్టి దుష్టులంబడమి జెం । డాడనున్న కలికిమూర్తి గుణస్ఫూర్తి ।
కలిత శౌర్యకీర్తి వైకుంఠనాథ ల । క్ష్మీసనాథరక్షణ పరాయణుండ నా ।
రాయణుండ

(పుటము 65 భగవన్నుతి రత్నములు మొదటిభాగము ప్రకాశకులు : కొండపల్లి వీర వెంకయ్య అండ్ సన్సు)

పై పద్యములలో కల్కిగుణములను వర్ణించినారు. అయోనికల్కి రూపుడగు శ్రీ వీరభోగ వసంతరాయులు, పై సద్గుణసంపన్నుడై అవతరించారు.

( గుజ్జము ఫొటో చూడుడు )

వైకుంఠనాథుడగు వీరిని విశ్వసించితే స్వర్గలోక సుఖము పొందుదురని పైపద్యములలో సూచించినారు.

శ్లో॥ అయోని సవరోమతః ప్రాప్తవాన్ దైత్యవర్ధనః
మహమ్మద ఇతిఖ్యాతః పైశాచకృతి తత్పరః ।
ఇతిశ్రుత్వా నృపశ్చైవ స్వదేశాన్ పునరాగతః ।

(భవిష్యపురాణము - ప్రతిస్వర్గ 3 అధ్యాయం 3 శ్లోకం 12)

కలియుగము 5,000 సంవత్సరములగు నప్పటికి శ్రీ హజ్రత్ ముహమ్మద్‌గారు అయోనిగా మనస్వదేశమగు భారతదేశమునకు రాగల్గుదురు. పిశాచములగు నరులను నశింపచేసి ధర్మమును స్థాపించునని సూచించినారు. కాబట్టి సకలభువన రక్షకుండైన అయోని కల్కి యవతార్ శ్రీ మద్విరాట్ వీరభోగ వసంతరాయులద్వారా ధర్మకార్యము పూర్తియగును.

నందామయా గురుడనందామయా । ఆనందదేవికి నందామయా !
స్వరాజ్యయుద్ధాన జయభేరి మ్రోగించి , శాంతిమూర్తులు అవతరించారయా ।
వారువీరవుతారు వీరువారౌతారు । మిట్టపల్లాలేకమౌతాయయా ।
కనకాద్రిశిఖరాన శునకమ్ముసింహాసనమై । ఏడుదీవుల రాజ్యమేలేనయా ।
గొర్రెల్ని దినువాడు గోవిందగొడ్తాడు । బర్రెల్ని దినువాడు వస్తాడయా ।
తిక్కశంకరస్వామి చెప్పిందినమ్మితే । చిక్కులన్నీ తీరిపోతాయయా ।
ఏ కష్టమొచ్చినా ఎవరడ్డుపడిన । దీక్షతో ధర్మమే ఆచరించాలయా ।

[పెద్దమనుష్యులు సినీమాపాటలు, శ్రీ బ్రహ్మంగారి వేదవాక్యములు (కాలజ్ఞానము) రచన: మూచర్ల సీతారామయ్య ఆంధ్రరత్న బుక్ డిపో తెనాలి 1956]

"వీరభోగ వసంతరాయులు వత్తురని ఆకాశవాణి చెప్పను"
(వచన కాలజ్ఞానం పుటము 8 ప్రకాశకులు: కొండా శంకరయ్య సికిందాబాద్ 1950)

ఆనందదాయక, గురువు శాంతమూర్తి అయిన శ్రీవీరభోగవసంతరాయులు సకాలములో అవతరించారు. ఆనంద దేవియగు భారతదేవి స్వతంత్రమయినది. వీరువారౌతారు, వారువీరౌతారు. అనే పదములలోయుండే అర్థమేమనగా అయ్యాలు మియ్యాలవుతారు మియ్యాలు అయ్యాలవుతారు. హిందువులు ముస్లిమ్ములు లవుతారు. ముస్లిమ్ములు హిందువులవుతారు. అందరూ కల్కి అవతారము ద్వార ఏకమతస్థులవుతారు సుమా! ధనవంతులు బీదలు ఒకస్థాయికి రాగలుగుదురు. కనకాద్రి శిఖరమునయున్న శ్రీముహమ్మద్ గారి (వీరిపై శాంతి, ప్రసన్నతయుండుగాక!) ద్వారపాలక శునకమురీతిగాయున్న శ్రీవీరభోగవసంతరాయులు ఏడుదీవులలో శాంతిరాజ్యమును స్థాపింతురు. గొడ్డుల్ని దినువాడు గోవిందగొడ్డాడు, బఱ్ఱుల్ని దినువాడు వస్తాడయా, అనగా శ్రీ వీరభోగవసంత రాయులు మాంసాహారి అని కనపరచినారు. ఈవిషయము యదార్థమే. తిక్కశంకరస్వామిచెప్పిన ప్రకారముగా శ్రీవీరభోగవసంతరాయులను. నమ్మితే ధార్మిక, రాజకీయ, సాంఘిక మొదలగు అన్నిచిక్కులు తీరుతాయి. ఇదికూడ నూటికినూరుపాళ్ళు సత్యము.

అక్షరాస్యులు, నిరక్షరాస్యులందరుకూడ పాపమును నిర్మూలించి, ధర్మమును రక్షించే టందుకు పరమాత్మునినుంచి ఒక అవతార పురుషుడు రాగలడని మొరబెట్టుచున్నారు. ఇదికూడ యదార్థమే. శ్రీ వీరభోగవసంతరాయులు అవతరించారు. సావధానముగా చదవుడు. వీరిని విశ్వ సించుడు.

'నాకు మొదటి స్వప్నములోను, తిరిగి భక్తియోగాభ్యాసములోను శ్రీభగవానుడు తనయొక్క జగన్మంగళరూప సందర్శన భాగ్యము నొసంగెను. నాకెన్నియో మారులు గొప్ప కష్టములలోగూడ సహాయమొసంగెను. ఆప్రభువుయొక్క దివ్యసుందర విగ్రహ సందర్శనమువల్ల నాజన్మసఫలమయ్యెను. విక్రమశకము 1981కి సరియగు క్రీ. శ 1924లో శ్రీభగవానుడు నాకు సాక్షాత్కరించి, 'నేను వైశాఖ శు॥ 2లున గలికి రూపమున నవతరింతును. కలియుగము శీఘ్రమే సమాప్తమై కృతయుగము రానైయున్నది——నాభక్తులు చాలమంది ఇదివరకే జన్మించి యున్నారు.'

(తెలుగు అనువాదము చేతావని **Wellcome Press Guntur 1940)**

చేతావని గ్రంథకర్తయగు పరమహంస శ్రీ 108 స్వామీ పండితరాజ నారాయణజీ షట్‌శాస్త్రీగారికి శ్రీ భగవానుడు దర్శనమిచ్చి వాక్కిచ్చిన సమయములోనే, శ్రీ భగవానుడు కల్కిరూపమున అనగా శ్రీ ముహమ్మద్‌గారి (వీరిపై శాంతి, ప్రసన్నత యుండుగాక!) ప్రవక్త తత్వమౌన శ్రీ వీరభోగవసంతరాయుల (శ్రీ చెన్నబసవేశ్వర్) నామధేయంబుచే క్రీ. శ. 1924లో భక్తులకు ప్రకటన చేసినాడు. వీరి పూర్ణచరిత్ర చదవుడు, విషయములు విస్పష్టంగా అర్థమగును.

—: ముఖ్యగమనిక :—

ఒక బాలికకు తగినవయస్సు 12 సం॥ అయినపిమ్మట, ఒక బాలకునకు (18 సంవత్సరములు) తగినవయస్సు అయినపిమ్మట పుత్రసంతానము గలుగును. అట్లె ఒక అవతారపురుషునకు 40 సంవత్సరము వయస్సు అయినపిమ్మట, తన అవతారప్రకటన చేయును. ఎందుకనగా అంత వయస్సు అయినపిమ్మటనే ఇతనిద్వారా "ఆత్మీక సంతానమగు భక్తజనులు దైవత్వమును ధరించి ద్విజలుగా అవతరింతురు"

తల్లిధర్మము పిల్లలను పోషించుట, తండ్రి ధర్మము రక్షించుట అట్లనే, అవతారపురుషుడు అమృతక్షీరముచే తన ఆత్మీకసంతానమగు భక్తులను పోషించును. అల్లాఃపరమాత్ముడు తనదైవీకసంతానమగు భక్తులను సర్వకాలాల్లో, సర్వావస్థలలో రక్షించి తన ధర్మకర్తవ్యమును ప్రపంచమునకు చాటించును. ఇట్లనే ఎనుకటి యుగములలో జరిగినది. ఇప్పుడు అట్లే జరుగును.

నాలుగు యుగాల్లోని అవతారపురుషుల చరిత్రమును ఆధారము చేసికొని, ఇప్పటి యుగపురుషుడగు శ్రీ వీరభోగవసంతరాయుల చరిత్రమును పరిశీలింపుడు, చక్కగా అర్థమగును. లేనిచో వీరి విషయములు సులభముగా అర్థముకావు సుమా !

Birth of a Great New Leader in 1941. An Astrologer's prediction.
May 1941 (Vide Sunday chronicle 27-1-1935)

"A greet new leader who will deliver the world from chaos is about to arise From a conjunction of 5 planets, Jupitor-Saturn-uranus, Venus and Mercury, I predict that in May 1941, this mighty world figure will appear, writes Mr. Edward Lyndoe, the astologer in the people"

He will speak poetry naturally and there will be music in his gestures. His knowledge will be collossal and his judgments as nearly perfect as we can imagine In everything he does, there will be this uncanny accuracy and it is possible that those who come into contact with him, will feel they have never before met anyone so sweet of temper, so gracious in manner or so good to look upon.

Wherever he goes the common people will love him and follow him. His chief work will be the breaking up of all militarist ideas and institutions. we know today. From the moment he begins his nuisson, the armaments industry will use every ounce of enery and evegry penny at its disposal to smash him. But he will win in a dramatic manner which will put an end to all those who have been building up the ndustry. His chief interests will he entirely public, that is to say he will concern himself continuonsly with the alternation of social conditions and for the first time in modern history. Democrocy will have found its superf leader. There will be no chance whatsoever for other interests to get a look in.

This man will sweep the board with his opponents and his work will succeed because he will be above nationality and above sect, Under his leadership

women will come into her own, not only as the equal of man but as she should be the sweetening influence in man's life and work.

And it appears likely to me that bound up with all these reforms is the accomplishment of a great aim. I refer to the unification of the nations in the league, so as you celedrate Christmas this year, forget the present ills of humanity and lift up your hearts. He, who will deliver us is coming.

(చేతావని తెలుగు అనువాదము Appendix page 1 Well come press, Guntur 1940)

The ability, the nobility, the heroic deeds shown in the above prediction, are being manifested in, not other than the Holy Personality of Sri Veerabhoga Vasanta Raya, the SPIVITUAL REGULATOR of this age.

I do bear witness to this fact of truth, as I am serving him as his disciple since a period of 21 years.

Cheer up! Celebrate the Holy-Day of Jai-Hind The time has come, which you will witness very shortly, in the practical field.

Therefore believe in his 'Guruship' He will pay visit wherever you be.

(please see his photo : standing pose)

క్రీ. శ. 1924, ఫిబ్రవరి మాసములో ఒక పురుషుడు నిలబడును. అతడు ప్రాక్ దేశములను ప్రాకగాను, పశ్చిమ దేశులను పశ్చిమగానుచేయును. అతడు హ్యాట్ బదులు పాగాను ధరించును క్రైస్తవులు "ఏసుక్రీస్తు"గాను, ముస్లిములు "మహదీ"గాను ఇతనిని భావింతురు.

( The book of forty — future wonders )

పై భవిష్యవాణి కాలసమయములోనే శ్రీ మద్విరాట్ వీరభోగ వసంతరాయులు తన రాకను ప్రకటించినారు. (అనగా :- 7-2-1924) వీరి పూర్ణ చరిత్రను చదువుడు.

పాశ్చాత్యులు ప్రాక్ దేశము అనగా ఏషియాఖండ ప్రజలను బానిసలుగాజేసి, పరిపాలించే అవకాశములు ఇకముందు జరుగవు దీనికి కారకులు శ్రీ వీరభోగవసంతరాయులే. ముందు జరుగు కాలమార్పులను గమనింపుడు. మన ఋషులు, మునులు, పౌరాణికులు ముందుగానే ఇవన్నియును సూచించియే యున్నారు.

లోకమాన్య రవీంద్రనాథ ఠాగూర్ గారు తమ జన్మదినోత్సవ సమయమున యిచ్చిన సందేశము :—

"నేను 20వ శతాబ్దములో యూరోపు ఖండమునుంచి మనకు రక్షణమార్గము దొరుకునని ఆశించియుంటిని. అయితే యిది చివరకు తప్పుగా తేలినది. యూరోపునాగరికత వినాశకరముగా

పరిణమించినది. నాభావము మేమనగా మనదేశములోనే ఒకదివ్యఅవతారపురుషుడు అవతరించును. ఇతని వాణి ప్రవాహముగా జగదంతట వ్యాపించును. మానవుల హృదయములలో శాంతినింపును. భారతదేశమునుంచియే ప్రపంచమునకు రక్షణ కల్గును.''

వీరు చెప్పినరీతిగానే యూరోపు నాగరికత యే ఫలితమిచ్చుచున్నదో మీరందరు పరిశీలించుచునేయున్నారు. భూమి సృష్టింపబడినప్పటినుంచి నేటివరకు ఏషియాఖండమే యూరోపు ఖండానికి మార్గదర్శిణి అయియున్నది. ఏసుక్రీస్తులుకూడ ఆశియా వాసస్తులే.

శ్రీ కవీంద్రరవీంద్రనాథఠాకూర్ సూచించిన దివ్యయవతారపురుషులు శ్రీమద్విరాట్ వీరభోగవసంతరాయులే సుమా. వీరు భారతదేశమును రక్షించుదురు. వీరిద్వారా భారతీయులు ప్రపంచ నాయకత్వము వహించి, సమస్త మానవకోటిని రక్షించగలరు. ఇది దైవసంకల్పము బీజాక్షరాలు తప్పవు.

''మొగలరాజు మొదట్లో, పడమటపక్కలో, కానూరు కడన, గుడుదల గుద్దలో, వేప కాయంత తోకతో, వీరభోగ వసంతరాయులు వేంచేయును.''

(శ్రీ అన్నె క్రిష్ణయ్యగారు శ్రీ వీరబ్రహ్మంగారి మఠం,
పెదవడ్లపూడి గ్రామము, గుంటూరు తాలూక, ఆంధ్రప్రదేశ్.)

నేను వీరిని కలుసుకొన్నప్పుడు (అనగా 16-11-1959 తేదీన) పై మాటలు నాకు వినిపించినారు. వానిని పైకనపర్చినాను. ఈ మాటలలో గూఢార్థాలున్నవి. మీరే అర్థముచేసుకొనుడు. నేను ఒకమాటకు మాత్రం అర్థము వ్రాయుచున్నాను.

''వేపకాయంత తోకతో శ్రీ వీరభోగ వసంతరాయులు వేంచేయుదురు''

అనగా : శ్రీ వీరభోగ వసంతరాయులు సర్వసామాన్య సాధువురూపమున తన అవతార ప్రకటన చేసినారు. రానురాను వీరి శక్తి, సామర్థ్యాలను అప్పుడు పరిపాలించుచున్న ఇంగ్లీష్ (అనగా: కలిపురుషుడు) వాళ్ళు గుర్తించిరి. వీరి శక్తి, సామర్థ్యాలకు ఆగలేక వీరిని అండమాన్ దీవులలో కారాగ్రహములో వుంచుటకు ఆదేశించిరి. ఈ ఆర్డర్ మార్పుచేసి, హైదాబ్రాద్ సిటీలోనే యుండవలయును. ఈ పట్టణమువదలి పోకూడదు, బహిరంగములలోగాని, జగద్గురు ఆశ్రమములోగాని ప్రజలను ఆహ్వానించి, నిలబడి ఉపన్యసించకూడదని నిర్బంధించిరి.

శ్రీ వీరభోగ వసంతరాయులు తన ఆత్మికశక్తిచే వాళ్ళను ఈ దేశమునుంచి వెళ్ళగొట్టిరి. తనకు తానే స్వతంత్రులైరి.

ముఖ్యగమనిక :- వీరి చరిత్ర వివరములు చాలాయున్నవి. ఇందులో కేవలము పరిచయమునకు వ్రాసినాను. సవివరముగా హిందూ - ముస్లిం ధార్మిక సమ్మేళనము శివ భాగము చదువుడు, పూర్ణవిషయములు తెలియును.

## ఒక విద్యార్థి కరపత్రము

"మహాశయులారా! మల్లయ్యపల్లెలో, వీరబ్రహ్మంగారి మఠములో నల్లత్రాసు కనబడినదట. గాన వీరభోగ వసంతరాయులు పుట్టియున్నారు. గాన ఈ పత్రికను చదివినవారు 9 పత్రికలుగా వ్రాసి ఇతరులకు ఇవ్వవలయును. ఈ పత్రికను చదివి యెగతాళి చేసినవారికి నోటిలో వజ్రదండ పురుగులుపడును. ఈ పత్రికను వ్రాసినవారికి 21 రోజులలో సుఖము కల్గును.

శ్రీ వీరభోగవసంతరాయులకు జై జై జై జైలు
తేది 24-1-1957 పిడుగురాళ్ళ, గుంటూరుజిల్లా.

**అసలురీతిగా నకలు యున్నది.**

"శ్రీ వీరభోగవసంతరాయులు వస్తారని భూదేవి పలుకుచున్నది."

శ్రీ వీరబ్రహ్మంగారి వచన కాలజ్ఞానము పుటము ప్రకాశకులు నాతా నమ్మయ్యశెట్టి అండ్ సన్ వారు Madras A. D: 1897,

సముద్రములు పొంగుచున్నవి. భూకంపములు జరుగుచున్నవి. నదులు వరదలు వచ్చుచున్నవి, రైళ్ళుపడిపోవు చున్నవి. అతివృష్టి, అనావృష్టి అగుచున్నవి. విమానములు పడిపోవుచున్నవి. సమ్మెలు నడుపుచున్నారు. యుద్ధప్రమాదములు సమీపించుచున్నవి, రాజకీయ పరిస్థితులు తారుమారగుచున్నవి. కరువులు వచ్చుచున్నవి. ఇవన్నియు ఈ అధర్మ కాలప్రభావములు, ఇవన్నియు భూమికి సంబంధించినవి. అందుకనే శ్రీ వీరభోగవసంతరాయులు వచ్చియున్నారు. వీరిని విశ్వసింపుడు, ధర్మమును ఉద్ధరించునని భూదేవి పలుకుచున్నది.

పైకనపర్చిన కరపత్రములోకూడ ఇదే సూచనయున్నది. నల్లత్రాసు వీరబ్రహ్మంగారి మఠములో ప్రవేశించి, శ్రీ వీరభోగవసంతరాయులు అవతరించారని సాక్ష్యము పలికినది. ఇది యదార్థమే సుమా.

అయ్యలు మియ్యలున్ గలసి, అన్నలు దమ్ములటుల్ మెలంగినన్,
కయ్యములుండబోవు, నెయ్యముదప్పి భిన్నమత నిష్ఠులతో
కలహించుచుండినన్. వెయ్యి యుగాల దాస్యము వినిశ్చయ మీ రతనాల భూమికిన్

(ఖండకావ్యము, జాషువాకవి)

శ్రీ జాషువాకవి, తన కావ్యములో వ్రాసిన విషయములు యదార్థమే. ఎన్నియో సంవత్సరములనుంచి అయ్యలు - మియ్యలకు (హిందూ - ముస్లిమ్ముల) కయ్యములు జరుగుచూ యున్నవి గదా ?

సర్వలోక రక్షణకర్తయగు అల్లాః పరమాత్ముడు, తన ప్రతినిధిగా శ్రీ వీరభోగవసంత రాయులను, ధర్మ (దీన్) కార్యనిర్వాహణకు నియమించి యున్నందున. వీరు భారతదేశపు 365 పుణ్యక్షేత్రాలలో పూజలుసల్పే అయ్యలు, అనగా అర్చకులు, పురోహితులు, గురువులు, నామధారి జగద్గురులనూ, మియ్యలు అనగా షరావల్వీ ముల్లాలనూ, దైవప్రోక్తమగు కుర్-ఆన్ (అనగా శ్రీ కల్కియవతార పురుషునకు అవతరణమైన ప్రణవవేదం) యొక్క సూత్రముల ననుసరించి, శ్రీజగద్గురు చరణసన్నిధిలో ఐక్యపరచుదురు. అటనుంచి ఉభయులలో సహజసౌహార్ధ్రాలు పెంపొందును. శాశ్వతముగా మతకలహములు అంతరించి పోవును. ఆ చంద్రార్కముగా రత్నములుగల భారతావని సర్వదా స్వతంత్రముగా యుండును.

The unity of Hindus and Muslims in accordance with the principles of the **Glorious Quran. (the revealed book of Sri Kalki Avatar) will be everlasting, Henceforward** there will be no religious or political quarrels whatsoever. This is a boon **and blessings of Allah-the most merciful of his creation,** bestowed upon the Hindu **and Muslim** people of precious land of 'Bharatavani'

**Hence believe in his Guruship and cooperate with this Holy cause of religious unity.**

ఆ॥ "కలియుగంబునందుఁ గమలాయతాక్షుండు ।
కలికి రూపమున జగంబునందు । వేదశాస్త్రి మార్గవితతులు చెడకుండ ।
నరయు చుండుఁ గరుణ బెరయుచుండ ॥

వ॥ ఇట్లు భూతభవిష్యద్వర్తమాన కాలాత్ముండైన యమ్మహాత్ముని యనీనంబై సమస్తంబు విస్తరిల్లునని చెప్పినవిని మైత్రేయుండిట్లనయె :

(తెలుగు కావ్యరూపమునయున్న శ్రీ విష్ణుపురాణము సటిప్పణము చతుర్వాసము పద్యముల నెం. 64,65)

# అనకాపల్లిలో వింత చెట్టు

అనకాపల్లి జూన్ 5: ఇక్కడ ఒక ఈతచెట్టు బాగా వంగిపోవటం లేవడం, జరుగుతూంది. నెలరోజులనుండి ఈ ప్రాంతం ప్రజలు తండోపతండములుగా వచ్చి చూస్తూ యీ వింత

చెట్టునుగూర్చి అనేకవిధాలుగా చెప్పుకుంటున్నారు. బ్రహ్మంగారి జోశ్యంలో ఇదొక గుర్తు అంటున్నారు. ఈ చెట్టు గవరపాలెం చివరకే. జె. మహాలక్ష్మిగారి వ్యవసాయ నూతిగట్టున ఉన్నది.

పై వ్యాసము, ఆంధ్రపత్రిక జూన్ 9, 1960, 2వ పుటమున వెలువడినది. శ్రీ వీర భోగ వసంతరాయులు అవతరించుకాలమున ఈతచెట్టు పైవిధముగా సాక్షి పలుకునని శ్రీ వీర బ్రహ్మంగారు తమ కాలజ్ఞానములలో వ్రాసినారు.

ధర్మరక్షక• అధర్మ వినాశకుడగు శ్రీ వీరభోగవసంతరాయులు అవతరించినారు. గాబట్టి భూమిపైయున్న వృక్షములలో ఒకటైన ఈతచెట్టు వృక్షముకూడ సాక్షి పలుకుచున్నప్పుడు సద్భక్తులు ఆలసించక శ్రీ వీరభోగవసంతరాయులను విశ్వసించి, ధర్మస్థాపన కార్యములో పాల్గొందురని కోరుచున్నాను.

ఒక యుగపురుషునకు చతుర్విధ అవస్థలుండును. ఒకటవది ఓంకార అవస్థ. ఈ అవస్థలో అతడు తపస్సు నిమగ్నుడై, దైవసందేశమును (Divine Commands) పొందును. రెండవది వనవాస అవస్థ:- తన అవతారప్రకటన చేయును. ప్రకటనచేసిన కొన్ని రోజులలోనే సర్వులు అతనిని విశ్వసించరు. అనుసరించరు. వనవాసకాలములో ఒకరికొకరు అతనిని విశ్వసించి, క్రమేపి శిష్యులగుదురు. వనవాసము అవధి 12 సంవత్సరములనుంచి 36 సంవత్సరముల వరకుండును.

3వది అజ్ఞాతావస్థ;- ఈ అవస్థలో కొందరకు తెలిసియున్నను కొందరకు తెలియదు.

4వది ;- యుద్ధరంగము తమమీాద రానున్న శత్రువులను జయించుట. శత్రువులను జయించినమీాదట సర్వమానవులు ఇతనిని విశ్వసించి, శాసనాన్ని శిరసావహింతురు. అప్పుడుగదా జగత్తులోని సర్వమానవులందరూ ఇతనిని కొనియాడుదురు.

వనవాస కాలములో వచ్చువారే సహజభక్తులు ఎందుకనగా అట్టికాలములో గురువగు అవతార పురుషుడు, శిష్యులు ధర్మసంస్థాపన కొరకు పడురాని కష్టములు పడుచుందురు. ఇట్టి సమయములో గురుసన్నిధిలో ధనరాశులుగాని, ప్రభుత్వపుద్యోగములుగాని, ఆడంబరములుగాని మొదలగు లౌకిక కోరికలుండవు సుమా !

భక్తులారా ! శ్రీ కోదండరామ, శ్రీకృష్ణ, శ్రీబుద్ధ, శ్రీవర్ధమాన మహావీర, శ్రీ యేసుక్రీస్తు, శ్రీమహమ్మద్ (వీరికి శాంతి ప్రసన్నత యుండుగాక !) వీరి వనవాస వివరములు తమకు తెలిసియే యున్నవి. మరొకసారి చదవండి. వనవాస కాలములలో యెందుకు శిష్యులై, గురువుకు అంకదండలై నిలబడి, గురువు, పరమాత్ముని ప్రీతికి పాత్రులగుదురు ?

భక్తజనులారా! అల్లాః పరాత్ముని ప్రీతికిపాత్రులు కావలెనని వనవాస అవస్థలోయున్న శ్రీ వీరభోగవసంతరాయులను విశ్వసించుడు. వీరు దైవప్రతినిధి, వీరుస్థాపించిన సర్వమత సమ్మేళన

మగు ఇస్లాం శాంతిమతమును స్వీకరించండి. మీకు సర్వేశ్వరుడు ఏడులోకములలో ఆత్మపదాంతము లను ప్రసాదించును. ధర్మజయభేరి మ్రోగినప్పుడు వచ్చువారికి పరలోక సౌఖ్యములు ముమ్మాటికి దొరకవు సుమా! అట్టివారిని అల్లాః సర్వేశ్వరుడు లెక్కపెట్టడు. గాబట్టి భక్తులారా! ఇక కొంత అవధియున్నది, రండు, మీగురువుని స్వీకరింపుడు. ఆలసించితే అమృతము విషము అనే సామెత తమకు తెలుసుగా!

మ్లేచ్ఛవ్రాత వినాశకః । కలియుగాశ్వాధిరూఢో మహాన్ ।
మయానీ బహుభానుకోటి । సదృశోభీమ్మాంశు చక్రాయుదాః ।
యస్సాజ్ఞీకృత కల్కిరూప । విభవో భీమ్మా భవిషాన్వయః ।
శ్రీమాన్ సింహగిరీశ్వరః కరుణయాదిత్యాత్ సదామంగళం ॥

(క ల్యా ణ అ క్ష రా లు)

బహుకాలమునుంచి ప్రార్థన చేయుచున్న సదా మంగళప్రదాయక శ్రీ వీరభోగ వసంత రాయులు అవతరించారు. విశ్వసించుడు.

(గుజ్జము ఫొటో చూడుడు)

"అంతా కల్కియవతారంబున నిఖిలజనులు ధన్యులగుదురు."

(భాగవతము స్కంధము 12, అధ్యాయము2)

పై వాక్యములోయున్న రహస్యమేమనగా నాలుగుయుగాలలో అవతరించిన ఋషులు, మునులు, అవతార పురుషులద్వారా స్థిరపరచిన మతశాఖ సర్వమతస్థులందరు కల్కియవతార పురుషులగు శ్రీ ముహమ్మద్‌గారి (వీరిపై అల్లాః సర్వేశ్వరుని శాంతిప్రసన్నత యుండుగాక!) శాంతిసముద్రమగు ఇస్లాంమత సూత్రములనుసరించి, సమావేశమై సుఖంతురు.

గాన కల్కిఅవతార పురుషులగు శ్రీ ముహమ్మద్‌గారి కార్యతత్వమును మూర్తీభవించి యీయుగసంధిలో అవతరించివచ్చియున్న శ్రీ మద్విరాట్ వీరభోగవసంతరాయులద్వారా యీ ఘనకార్యము పూర్తియగును అనందించుడు.

ఈయుగపురుషుని అగమనమును గురించి 12,000 భవిష్యసుభాషితములున్నవి. ఇవి ఇస్లాం, వైదీక, విశ్వకర్మ, క్రైస్తవ, లింగాయత మొదలగు మతముల నానా వేదోపనిషత్ శాస్త్రంబులలో వ్యాపించియున్నవి.

పై నకనపరచిన ధర్మగ్రంథములలో ధర్మము నుద్ధరించుటకు నొకధార్మిక పురుషుడు వచ్చిన ఒకదివ్యసూచన యున్నది. ఇప్పటి యుగమునందు సర్వధర్మముల నుద్ధరించుటకు నొకే

ليهلك من هلك عن بينة ويحيى من حيّ عن بيّنة ٩س ٤٥



శ్లో॥ నారాయణం నమస్కృత్య నరంచైవ నరోత్తమం,
దేవీం సరస్వతీం చైవ తథోజయా ముదరేత్ ॥

శ్రీమన్నారాయణాంశమున మూర్తీభవించిన
శ్రీ మద్విరాట్ వీరభోగవసంతరాయలు [వయస్సు 63 సం॥]

کانّ وجہہٗ کوکبٌ درّیٌّ (کنز الاعمال)



శ్లో॥ మేఘాకారం సోమ
సూర్య ప్రకాశం
సుభ్రూన్నాసం చక్రచా
పైకమానం।
లోకాతీతం పుండరీకా
తాక్షం
విద్యుచ్ఛేలం చాశ్ర
యేఽహం త్వపూర్వం॥

(కల్కి-పురాణం అధ్యా
యం 7 శ్లోకం 26 పుట 79)



శ్రీ మద్విరాట్ వీరభోగవసంతరాయుల లలాటముపై చంద్రునివంక ప్రకాశిస్తున్నది.

పురుషుడు వచ్చును. గాని ఇద్దరు, ముగ్గురు రాజాలరు. కాబట్టి సర్వధర్మసమైక్యత కొరకు, హరిహరరూపైకమూర్తి నరనారాయణమూర్తి, సర్వలోక సుఖప్రదాయక, ఆదిదేవ, మహాదేవ, జగదాదిబీజ, అనాదినిధిన, భక్తవత్సల, విశ్వకర్మ, సర్వజ్ఞ సుబ్రహ్మణ్య, సర్వలక్షణసంపన్న, సర్వమంగళకర, ప్రమతాధిప, ఆదిత్యహృదయ, సకలశక్తిసమన్విత, అఖిలాండకోటి బ్రహ్మాండ నాయక, ఆదినారాయణ, దివ్యకళాపరిపూర్ణ. సంభవులైన, సకలభువన పాపసంహారణార్థంబవ తారముచేసిన శ్రీమత్ విరాట్ వీరభోగవసంతరాయులు, జగద్గురువుల చరణసన్నిధిలో నిలిచి. పరమాత్మునిలో ఐక్యమై, ఆయననుండి ఆజ్ఞపొంది, క్రీ॥ శ॥ 1924సం ఫిబ్రవరి మాసము 7వ తేదీన కన్నడ ప్రాంతము ''గదగ్'' పట్టణములో వీరు తన కర్తవ్యమును ప్రకటించినారు.

# అధ్యాయము 2.

## కలియుగ ఆయోనికల్కి అవతార్ వీరభోగవసంతరాయుల శారీరక దైవికచిహ్నములు :-

జన అభయప్రదానుండు, నీలమేఘనిభ శరీర కాంతియుతుండు. ఆజానుబాహుండు, చాపల్యరహిత సౌదామనీలతా, సమానకిరీట శోభాయమానుండు, ఉదిత దినకర సదృశ, మణిమయ కుండలద్వయ దీప్యమానుండు, మందస్మిత వికసిత వదనారవిందుడు. శంఖుచక్రగదా దేశార్ఙ పీతాంబరాద్యాలం కృతుండు, కృపకటాక్షనిక్షేప, నిర్ధూత, నిఖిల భక్తబృంద తాపత్రయుండు, తారానికర భాసుర ముక్తాహార విరాజితవక్షః స్థలవిగ్రహుండు, సంపూర్ణానంద సందోహ స్వరూపుండు, అత్యాశ్చర్య లీలారూప విలాసయుక్తుండు, తేజోనిధి స్వరూపుండు పుండరీక దళవిశాలలోచనుండగు ఈ దివ్యమహాపురుషుని విశ్వసించు శుభయోగము యిప్పటి యుగసంధిలో భారతీయులందరకును ప్రాప్తించినది.

సువర్ణ ఛాయశరీరుండు, కాషాయవస్త్రములు ధరించువారు. యోగదండము చేబూని నారు.

(వీరు నిలబడియున్న ఫోటో చూడుడు)

ఖడ్గ, త్రిశూల, లింగ, కరుణచేత, మీరియుండిన వీరరాఘువుండితడు.

(వీరబ్రహ్మంగారి కాలజ్ఞాన తత్వములు పుట 6)

పై వాక్యములోయున్న భావమేమనగా శ్రీ వీరభోగవసంతరాయులు తనచేతిలో ఖడ్గము, త్రిసూలము, లింగము, ముద్రలు ధరించియున్నారు.

''కామన కణ్ణుకళెదు సుమ్మనాగిరి ॥హు॥
నమ్మ శూలధరను శుళివునుడిరి ॥హు॥ ''

(కన్నడ కాలజ్ఞానం - మానేశ్వరవచనము పుట 41)

అర్థము :- శ్రీ చెన్నబసవేశ్వరుడు చేతిలో త్రిశూలమును పట్టి వచ్చును.

"శిరదల్లి మంత్రావు కరదల్లి శివలింగ ।
ఉరుదొళు గురుద్యాన నెనసలు ॥సు॥"

(కన్నడ కాలజ్ఞానం–నీలమ్మ వచనము పుట 69)

అర్థము:- శ్రీ చెన్నబసవేశ్వరుడు చేతిలో శివలింగముద్రను ధరించివచ్చును.

"బణ్ణ బణ్ణగళబెలె నీడుత పన్నగాధరను ,

(కన్నడ కాలజ్ఞానము – రుద్రముని పుట 27)

అర్థము :- శ్రీ వీరభోగవసంతరాయులు నాగసర్పమును ధరించివచ్చును.

"వరగల్లు చరమచ్చర కలింగ జపమాలె।"

(కన్నడ కాలజ్ఞానము – రుద్రముని పుట 27)

అర్థము :- శ్రీ వీరభోగవసంతరాయులు చేతిలో లింగము, జపమాలను ధరించివచ్చును

"శంభు ననుమతిచేత శంఖుచక్రాధరుడు ,
శాంభవీపట్నాన్ని యేలేనిమా ॥హరిగో॥

(వీరబ్రహ్మంగారి గోవిందవాక్యము నెం 68)

"...అరచి బసవడు రంకె వేశీనిమా ।"

(శ్రీ వీరబ్రహ్మంగారి గోవిందవాక్యములు నెం 86)

"శత్రుసంహారుల వెంటబెట్టుకొని శేషాద్రివాసుడు వచ్చీనిమా।"

(గోవిందవాక్యములు నెం 87)

"హంపిలో యుండేటి హనుమంతరాయుడు
అరచి వీధులకేక వేశీనిమా।"

(గోవిందవాక్యములు నెం 90)

"శ్రీరామ ధర్మజులు సృష్టి భారముదాల్ప
శృంగారమూర్తులై వచ్చేరుమా"

గోవిందవాక్యములు నెం 95)

శ్రీ వీరభోగవసంతరాయుల రూపములో శ్రీరామ ధర్మజులు వచ్చినారు. కాబట్టి వీరిచేతిలోయున్న ధనుర్బాణములు సాక్షిబలుకుచున్నవి.

"చెంగారించి పాలగుండము లోపల, చెన్నబసవడు వేగబుట్టేనిమా"

(గోవిందవాక్యములు నెం 182)

చెన్నబసవేశ్వర రూపమే శ్రీవీరభోగవసంతరాయుల రూపము కన్నడ కాలజ్ఞానములలో వీరశైవలింగాయత మతశాస్త్రములలో వీరినే శ్రీ చెన్నబసవేశ్వరులుగా సూచించినారు. వీరిహస్తములోయున్న బసవముద్రయే దీనికి సాక్షిపల్కుచున్నది.

"పాశుపతాస్త్రము చేతపట్టుకొని, భానుమండలపతి వచ్చీనిమా"

(గోవిందవాక్యములు 184)

శ్రీ వీరభోగవసంతరాయులే భానుమండలపతియై హస్తములో పాశుపతాస్త్రముబూని వచ్చును.

"ఫణిరాజు బాగడాగ త్రిశూల డమరాము భగవంతుడూ బుట్టివచ్చేనిమా"

(గోవిందవాక్యములు నెం 302)

"పంచవక్రం చంద్రమౌళిం త్రిశూల డమరూధరం"

(శివగీతము అధ్యాయము శ్లోకము 9)

శ్రీ వీరభోగవసంతరాయులే భగవంతుడై, ఫణిరాజును ధరించుకొని, ఈశ్వరుని త్రిశూలమును డమరమునుబట్టి వచ్చును.

"ఏనూరుకోట్లు భూమండలమంతయు ఏకచక్రముగా వేలీనిమా"

(గోవిందవాక్యములు 309)

అనుప్రమాణముకొరకు శ్రీ వీరభోగవసంతరాయుల హస్తమందున్న ధ్వజపతాక చిహ్నమే సాక్షిపలుకుచున్నది. (వీరి హస్తము ఫోటో చూడుడు)

శ్లో॥ ధనుర్బాణ ధరం చారువిభూషణ పరాజ్ఞకం,
పాప తాప వినాశనార్థముద్యతం జగతాంపరం ॥

(కల్కిపురాణం - అధ్యాయం 9 శ్లో 2)

అర్థము:- జగత్ పాలకుడగు అయోని కల్కి-ధనుర్బాణములను ధరించి, సర్వాంగ భూషనుడై పాప తాపములను నశింపజేయుటకు అవతరించినారు.

"పీతామ్బరోఽచ్యుతశ్శార్ఙ్గీవిష్వక్సేనో జనార్ధనః"

(అమరకోశం - విష్ణునామములు)

శ్రీ విష్ణుమూర్తి కాషాయవస్త్రములను ధరించి, చేతిలో ధనుర్బాణములను పూని శ్రీ అయోనికల్కి- అవతార్ శ్రీ మద్విరాట్ శ్రీ వీరభోగవసంతరాయుల రూపములో అవతరించి నాడు.

పైకనపర్చిన కాలజ్ఞానసూచనల ననుసరించి ఈ కలియుగ అయోనికల్కి- అవతార పురుషులగు శ్రీ వీరభోగవసంతరాయుల హస్తములలోయున్న చిహ్నములు ఈదిగువ యిచ్చు చున్నాను.

# LEFT HAND

ఈకలియుగ పురుషుని ఎడమహస్తములలోగల చిహ్నములు;—

(1) మూడు చక్రములు (2) ఈశ్వరుని త్రిశూలము (3) శ్రీ పరశురాముని గొడ్డలి (4) శ్రీ విష్ణుమూర్తియొక్క- ధనుర్బాణములు (5) ఈశ్వరవాహనమైన బసవముద్ర (6) పతాక ముద్ర యున్నవి.

# RIGHT HAND

ఈమహాయుగపురుషుని కుడిహస్తములోగల చిహ్నములు ;—

(1) ఈశ్వరుని శివలింగము (2) ఈశ్వరుని డమరుగ (3) శ్రీ వీరాంజనేయుని శరీర ముద్రము (4) జపమాలము (5) పంచశంఖులు (6) మత్స్యరేఖ యున్నవి.

ఈ మహాయుగ పురుషుని రెండుహస్తములలోయున్న సాముద్రికలే వీరి విష్ణు, ఈశ్వర ఉభయాత్మక అవతారమును ధృవపరచు చున్నవి. ఈఅవతార ధృవీకరణకు యింకాకొన్ని చిహ్నములను ఈ దిగువ తెలుపుచున్నాను.

" ఫణిరాజు జాగడాగ త్రిశూలదమరాము భగవంతుడుబట్టి వచ్చీనిమా "

(వీరబ్రహ్మముగారి గోవింద వాక్యములు నెం 302)




కుడి చెయ్యి




ఎడమ చెయ్యి

ఫణిరాజు అనగా నాగసర్పమును తనవీపున ధరించి, త్రిశూలమును, డమరమునుచేత పూని భగవంతుని తత్వమును మూర్తీభవించిన శ్రీ వీరభోగవసంతరాయులు వచ్చినారు.

"శత్రుసంహారుల వెంటపెట్టుకొని, శేషాద్రివాసుడు వచ్చీనిమా"

(గోవింద వాక్యములు నెం 87)

పై వాక్యముల కాలజ్ఞానసూచన ప్రకారము, శేషాద్రివాసుడు అనగా అదినారాయనుండు రూపమనియు, ఈశ్వరుని రూపమనియు శాస్త్రిములు పలుకుచున్నవి.

(వీరి ఫొటోలు చూడుడు)

మరికొన్ని నిదర్శనములు:—

"అల్‌మహదీ - మిన్‌వలదీ - వజ్‌హుహు - కల్‌ఖమరుద్ - దరీ"

(హదీస్-అల్ బురహాభాగం 3)

హదీస్ అనగా శ్రీ ముహమ్మద్‌గారు (వీరిపై అల్లాః సర్వేశ్వరుని శాంతి, ప్రసన్నత యుండుగాక!) స్వబుద్ధితో చెప్పిన విషయములు హదీసులు అనబడును. అల్లాః సర్వేశ్వరుడు ఆదేశించిన ఆజ్ఞలను శ్రీ ముహమ్మద్‌గారు అలాగుననే పఠించి వినిపించినారు. వీనిని 'వహీ' అనబడును. వహీయుల సంపుటయే ప్రణవవేదమగు ఖురాన్.

పై హదీస్ అర్థమేమనగా, మహదీ నా వంశీయుడు, అతని ముఖము చంద్రకాంతి ప్రకాశముగా యుండును.

(వీరి చంద్రశేఖరఫొటో చూడుడు)

శ్లో॥ చతుర్భుజం త్రినయనం విద్యుత్పింగం జటాధరం।
కోటిసూర్య ప్రతీకాశం చంద్రకోటి సుశీతలం॥
సర్వాభరణ సంయుక్తం నాగయజ్ఞోపవీతినం।
వ్యాఘ్రచర్మాంబరధరం వరదా భయదారిణం॥
వ్యాఘ్రచర్మోత్తరీయంచ సురాసుర నమస్కృతం।
పంచవక్త్రం చంద్రమౌళిం త్రిశూల డమరూధరం॥
నిత్యంచ శాశ్వతం శుద్ధం ధ్రువమక్షర మవ్యయం॥

(శివగీతము అధ్యాయము 4, శ్లోకం 7. 8, 9, 10)

పై నకనపరిచిన శ్లోకములలోని సద్గుణమూర్తి ఈశ్వర అవతార ప్రసన్న శ్రీ వీరభోగవసంతరాయులే. ఈశ్వరుని లక్షణములన్నియు వీరిలో మూర్తీభవించి యున్నవి. జ్ఞాన త్రినేత్రము

సువర్ణపోలిన జడలను ధరించియు, కోటిసూర్య ప్రకాశమయుడు, లలాటమున చంద్రవంక కలిగియు సర్వాభరణ సంయుక్త శరీరము కలిగియు, పెపుసైన నాగసర్ప ముద్రకలిగియు, శత్రువులను కంగారు పరచు భయంకర ఘింకారశబ్దము కలిగియు, సురాసురలును వశపరచుకొనగల పరాత్పరుని శక్తి కలిగియు, త్రిశూలడమరులను హస్తములో పట్టుకొనియున్న, సదాశాశ్విత శుద్ధ శరీరము కలిగియున్న ఈశ్వర అవతార ప్రశన్నమూర్తిని మన భూమియగు భారతదేశములో, అల్లాః సర్వేశ్వరుడు అవతరింపజేసినందుకు మనము ఆయనని సర్వదా కొనియాడినను అది స్వల్పమే కదా ?

శ్లో॥ వందే శంభు ముమాపతిం సురగురుం వందే జగత్ కారణ
వందే పన్నగభూషణం మృగధరం వందే పశూనాంపతిం ॥
వందే సూర్యశశాంక వహ్నినయనం వందే ముకుంద ప్రియం,
వందే భక్తజనాశ్రయంచ వరదం వందే శివం శంకరం ॥

(శివసహస్ర నామావళి స్తోత్రం పేజీ 1)

పైశ్లోకములోని సర్వసద్గుణ సంపన్నుడు శ్రీ వీరభోగవసంతరాయులే. ఇందులోని కొన్ని శరీరలక్షణములు కలిగియున్నారు. వీరి ఫోటోలు చూడుడు. ఈశ్వరతత్వములను మూర్తీభవించి అవతరించియున్న అయోనికల్కి అవతార్ శ్రీమద్విరాట్ వీరభోగవసంతరాయులను విశ్వశించి, అనుసరించువారు మహాపుణ్యపురుషులగుదురని అంశమును వెలెగెత్తి చాటుచున్నాను. కుశలశ్య శీఘ్రం అను సామెత ననుసరించి జాగ్రత్తగా విశ్వశించుడు. ఆలశించిన ఆశాభంగమగును.

శ్లో॥ సజలజదదేహో వాతవైగ్రైక వాహః ।
కరధృత కరవాలః సర్వలోకైక పాలః ।
కలికుల వనహంతా సత్యధర్మప్రణేతా ।
కలయతు కుశలంనః కల్కిరూపః సభూపః ॥

(సంస్కృత కల్కిపురాణం, అధ్యాయము 21, శ్లోకం 39)

పవనవేగ సమానవాహనము గలవాడు శ్రీ కల్కిరూపుడని శ్రీ వేదవ్యాసులు సూచించిన ప్రకారము శ్రీ వీరభోగవసంతరాయులు కామధేను వాహనము గలిగియున్నారు.

(కామధేను అభయహస్తము ఫొటో చూడుడు)

సజలజల దేహుడు అనగా శ్రీ ముహమ్మద్‌గారి (వీరిపై అల్లాః పరమాత్మని శాంతి, ప్రసన్నత యుండుగాక !) స్క్రమ అనుచరుడై, అల్లాః సర్వేశ్వరునిలో ఐక్యమై, దైవసన్నిధినుంచి సకలభక్తుల హృత్కమలములను పోషించు అమృత గంగను (అనగా కలామె-ఇలాహి) పొందు వారు అయోనికల్కి యవతార్ శ్రీ వీరభోగవసంతరాయులని యదార్థమైన అర్థము

ఇప్పటి యుగసంధిలో వీరి సన్నిధితప్ప మరెక్కడను ఆత్మాభివృద్ధి పరచు అమృత గంగలేదు సుమా !

రండు, వీరి సన్నిధిలో అమృతము పానముచేసి, జన్మపావనమొనర్చుకొనండి.

సర్వదా ధర్మమును ప్రేమించు శ్రీ వీరభోగవసంతరాయులను విశ్వసించుడు. ధర్మ సంస్థాపన వుద్యమములో పాల్గొనుడు. జన్మసార్ధక మవును.

సర్వలోక భక్తపాలకులు వీరే. రక్షించుదురని అభయహస్తము ఇచ్చుచున్నారు.
(అభయహస్తము ఫోటో చూడుడు)

పై శ్లోకములో "కలికులవనహంతా" అని కనపరచినారు. కలికులము అనగా కలి పురుషుడు ఇతనినే సంధ్యావందన మంత్రములో "శ్వేతవరహా కల్పె" అని సూచించినారు. వీరే ఇంగ్లీషు వాళ్ళు. వీరు ప్రపంచము ఒకమూలనుంచి చాలాదూరమువచ్చి, ఏసియా ఖండము నాక్రమించుకొని, భారతావని ప్రజలను భేదించ పరిపాలించు అనురాజకీయ ఎత్తుగళ్ళజేత హిందూముస్లిములను భేదించి రాజ్యము పరిపాలించుచుండిరి.

వీరు తమ రాజ్యకాంక్షచేత హిందువులను ముస్లిములను బానిసలుగా జేసియుండిరి.

యథా రాజా తథా ప్రజాః సూక్తుల ననుసరించి ప్రజలు ధర్మమునుంచి దూరమై పోవు చుండిరి. ప్రజలు వీరి నవనాగరికత ననుసరించ సాగిరి. ఆటపాటములు సర్వోత్ర పెరిగిపోయెను. సినిమాలు. నాటకములు పల్లెపట్టణములలోకూడ విజృంభించెను రానురాను ధర్మానురాగము సన్నగిల్లెను. ధర్మము మూడుపాళ్ళు పడిపోయి, పాపము హెచ్చుపెరిగి పోయెను.

ఇట్టి సమయమున కలికిరూపుడు భారతదేశములో నవతరించి భారతీయులను స్వతం త్రులుగాజేయును. ధర్మముద్ధరించునని సర్వశాస్త్రిలలో సూచించిన ప్రకారముగా శ్రీ వీరభోగ వసంతరాయులు వేంచేసినారు.

శ్రీ వీరబ్రహ్మంగారు తమ వచన కాలజ్ఞానములో అనగా 21వ పుటలో అబద్ధపు వీర భోగవసంతరాయులని వర్ణించినారు వీరి లక్షణములివి.

నాలుగు నిలువుల ప్రమాణంబుగల యాజానుబాహులు అనగా అతిశక్తివంతులు, ప్రపంచ వ్యాపిత రాజ్య స్థాపకులు.

వీపున వింజామరలు, అరికాలున తామరకమలములు వారు అనగా సర్వదా రక్షక భటులు గలవారు. (Body guards) పాదములకు మెత్తని విలువగల బూటులు తొడుగువారు.
(Wearing fine precious boots)

చేతిలో నేత్రముగలవారు. అనగా టెలిఫోను, టెలిగ్రాఫ్ మొదలగు యంత్రములు గలవారు.

దూరశ్రవణ దూరదృష్టి, ఖడ్గస్తంభన, వయః స్తంభన, వాయు స్తంభన, అగ్ని స్తంభన వాణి స్తంభన, యివన్నియును అనగా టెలిస్కోపు (Telescope) రాకెట్ బాంబులు (Racket Bombs) వయః స్తంభన అనగానటించిన మానవుల శరీరచలనములను ఫిలిములద్వారాగా సేకరించి సినిమా (Cinema) రూపేణ ప్రదర్శించినవారు. వాయు స్తంభన అనగా సైకిలు, మోటారుసైకిలు, కారులు, మోటారులారీలు మొదలగువానిలోగాలిని స్తంభించి వాహనములనునడిపించువారు. అగ్ని స్తంభన అనగా ఎలెక్ట్రిసిటి (Electricity) వాణి స్తంభన అనగా గ్రామ్‌ఫోను, రేడియో (Radio) మొదలగు నవీన యంత్రములను కనిపెట్టినవారు కలిపురుషులు (English people)

పై గుణములుగల ఇంగ్లీషువారు మన దేశమున తిష్టవేసుకొని పరిపాలించుచుండిరి. ఇట్టిప్రమాదావస్థలో నలిగియున్న భారతప్రజల నుద్ధరించుటకు, అల్లాఃసర్వేశ్వరుండు తన కరుణా సముద్రప్రేమచే, అయోనికల్కి అవతార్ శ్రీ మద్విరాట్ వీరభోగవసంతరాయులును A. D. 1924 సంవత్సరమున నియమించెను.

వీరు తమ ఆత్మశక్తి ప్రభావముచేత ఈదేశమునుంచి ది 14-8-1947 అర్ధరాత్రి సమయమున, కలిపురుషుడు అనగా ఆంగ్లేయులను వెళ్ళగొట్టెను. భారతావని స్వతంత్రమునకు వీరే కారకులు. శ్రీ వీరబ్రహ్మేంద్రస్వాములవారు ముందుగానే తమ కాలజ్ఞానములో సూచించినారు.

"వీరేశ్వరస్వాములకు వీరభోజులు జంబూద్వీపము ఆధీనము చేసీని, ఇది పరమార్థం"

(వచన కాలజ్ఞానము పుట 27, ప్రకాశకులు నాతా-నమ్మయ్యశెట్టి అండ్ సన్ Madras 1897)

వీరేశ్వరస్వాములు అనగా శ్రీమత్ కల్యాణ స్వరూపులగు శ్రీ ముహమ్మద్‌గారే. (ఈవిషయమున హిందూముస్లిం ధార్మిక సమ్మేళన (మొదటి భాగముచూడుడు)

సర్వేశ్వరుని దైవోక్త గ్రంథమగు ఖురానువేదశాసనాన్ని అనుసరించి, అలాఃసర్వేశ్వరుడు, ప్రజలుబానిసలుగా ఉన్నసమయమున శ్రీ మొహమ్మద్‌గారిని (వీరిపై శాంతి, ప్రసన్నత యుండు గాక !) విశ్వసించుడని ఆదేసించడు.

కనుకనే, నేటికి దాదాపు 1400లు సంవత్సరముల క్రితము శాల్మల దీపవాసులు అనగా అరబ్బులు సర్వస్వతంత్రులుగా యుండిరి. అట్టి సమయమున సర్వేశ్వరుడు తన ప్రియప్రవక్తయగు శ్రీ ముహమ్మద్ (వీరిపై శాంతి, ప్రసన్నత యుండుగాక !) గారిని అచ్చట ప్రజలు విశ్వసించుటకు నియమించెను.

అటులనే శ్రీ వీరభోగవసంతరాయులద్వారా భారతీయులందరు సర్వవిధములుగా స్వతంత్రులైరి. ఇప్పుడు శ్రీ ముహమ్మద్‌గారిని (వీరిపై అల్లాః శాంతి, ప్రసన్నత యుండుగాక!) శ్రీ వీరభోగవసంతరాయులద్వారా విశ్వసించుడని, సర్వభారతీయులకు ఆదేశించుచున్నాడు. దైవాజ్ఞను సిరసావహించుడు.

శ్లో॥ సజలజల దేహో వాతవేగైక వాహః।
కరధృత కరవాలః సర్వలోకైక పాలః।
కలికుల వనహంతా సత్యధర్మప్రణేతా।
కలయుతు కుశల వః కల్కిరూపః సభూపః॥

"వ్యాసోనారాయణః" అను ప్రసిద్ధిగాంచిన వేదవ్యాసులుకూడ నేటికి 5060 సంవత్సరముల క్రితమే, కలికిరూపుడగు శ్రీ వీరభోగవసంతరాయులు, ఇచ్చటనుండి ఆంగ్లేయులను వెళ్ళగొట్టుదురని సూచించియున్నారు. మీరుకూడ కల్కిపురాణము స్వతఃచూచి విషయమును తెలిసికొని సంతృప్తి చెందుడు. ప్రపంచములోకెల్ల అశాంతి ప్రశ్చన్న యుద్ధభయభ్రాంతులు కలుగుజేయుచున్న కలిపురుషులు ఇక అతిస్వల్పకాలములోనే అన్యోన్యముగా కలహించుకొని సర్వవినాశము పొందుదురని సర్వమతస్థుల శాస్త్రములు ఘంటాపదముగా ఘోషించుచున్నవి.

పాశ్చ్యమాత్యులు ఎప్పుడైనను ఇక ఏషియా ఖండముపైన ఆధిపత్యమును వహించరు.

శ్రీ వీరభోగవసంతరాయులద్వారా శ్రీ ముహమ్మద్‌గారిని (వీరిపై శాంతి, ప్రసన్నత యుండుగాక!) విశ్వసించి ఇస్లాం, శాంతి మతప్రచారమును భారతీయులు ముమ్మరముగ కొనసాగించి, ఏడుదీవులలోని ప్రజలను రక్షించ గలుగుదురు.

ఈ విషయమునే సర్వపురాణ ఇతిహాసములు ఘోషించుచున్నవి.

ఇది స్వకల్పితము కాదు, ఊహాజనితముకాదు సుమా, పూర్వీక అవతారపురుషులు, ఋషులు, మునులు, పౌరాణికులు, శాస్త్రజ్ఞులు, సాధువులు, సంతులు, అవులియా అల్లాలు (Saints Predictions) చెప్పినమాటలను, వారి కార్యభారము వహించియున్న శ్రీ వీరభోగవసంతరాయుల శిష్యుల జిహ్వాములలో పునఃఉచ్చరించ బడుచున్నవి సుమా!

శ్లో॥ యద్దోర్ దండకరాళ సర్ప కవళజ్వాల జ్వాలద్విగ్రహః।
నేతుః సత్కరవాల దండదళితా భూపాఃక్షితి క్షోభకాః।
శశ్వత్ సైంధవ వాహనో ద్విజనిఃకల్కిః పరాత్మా హరిః।
పాయాత్ సత్యయుగాది కృత్స భగవాన్ ధర్మప్రవృత్తి ప్రియః॥

(సంస్కృత కల్కిపురాణము, అధ్యాయము 1 శ్లోకము 1)

పై శ్లోకములో సూచించిన ప్రకారముగా కల్కిరూపుడగు శ్రీ వీరభోగవసంతరాయులు మన భారతదేశములో అవతరించియున్నందున, వంశపరంపరగా వచ్చుచున్న రాజాధిరాజులు, రాజులు, దేశముఖులు, జాగీరుదారులు, జమీందారులు. సుల్తానులు, నవాబులందరు అంతరించి పోయినారు.

రాజాధిరాజులు దేశమువిడిచి భ్రష్టులై పోయెదరు. అదే మీకు నిదానము, వీరభోగ వసంతరాయులు చెప్పిన వాక్యాలు తప్పవని నానావర్ణాలు వారును తెలుసుకొనేది, యిటా సద్భక్తి పూర్వకంబుగా ఉన్నవారికి గ్రహపీడలు ఏమిన్ని తగలనేరదు. వారు సుఖముగా యుందురు. వీరభోగవసంతరాయులు రక్షించి మోక్షమిచ్చును"

(శ్రీ వీరబ్రహ్మముగారి రచన కాలజ్ఞానము పుట 23 ప్రకాశకులు, నాతా-నమ్మయ్య శెట్టి అండ్ సన్, మద్రాసు 1897)

వీరబ్రహ్మంగారుకూడా తన కాలజ్ఞానములో స్పష్టముగా, వీరభోగవసంతరాయులు అవతరించిన పిమ్మట భారతదేశమును పరిపాలించుచున్న చప్పన్నారు రాజులు, అనగా 56 రాజులు పదభ్రష్టులగుదురని సూచించినారు.

వంశపరంపరముగా పరిపాలించు రాజులందరు, కృత, త్రేత, ద్వాపర, కలియుగము లలో అంతరించి పోలేదు. ఏకైక ప్రజాస్వామిక పరిపాలన స్థాపింపబడియుండలేదు. ఏ యుగములో లేని మార్పులు యిప్పటి యుగసంధిలో జరిగియుండుటకు ముఖ్యకారణముండవలయును. ఈ కార్యమునకు కారకులు అయోనికల్కి అవతార (Saint hood) పురుషులేనని శ్రీ వేదవ్యాసుల వారు సూచించియున్నారు. శ్రీ వీరబ్రహ్మముగారు వీరభోగవసంతరాయులేనని వక్కాణించి యున్నారు. శ్రీ వీరభోగవసంతరాయుల అవతార కాలములో ప్రజాస్వామిక ప్రభుత్వము యేర్పడినది. రానురాను యికముందు ప్రజాస్వామిక ధర్మరాజ్యమౌను. ఈ ధర్మరాజ్యస్థాపనము ఆచంద్రార్కముగా నిలబడి యుండును. తదుపరి మార్పులుండబోవు. దాదాపు 1394సం॥ ల క్రితము శాపగ్రస్తుడై పాతాళ గంగలోపడియున్న చంద్రగుప్తరాజునకు అయోనికల్కి అవతార్ శ్రీ వీరభోగవసంతరాయుల పాదస్పర్శముచేత శాపవిముక్తుడై పునఃరాజ్యపరిపాలన చేయుననే రహస్యమిదియే. ఇది విజ్ఞానశాస్త్రియుగము.

**(This is highly advanced scientific age, There is no scope or place for blind belief, Real religion invites scientific people who belive in the existance of the creator. Relegion epually brims materialism and spiritualism. Such religion is 'Santi' i. e, to say religion of Islam)**

కాబట్టి శాపగ్రస్థుడైయున్న చంద్రగుప్తరాజుయొక్క పంచభూత దేహము పునః రాజాలదు, ఆ రోజున అతడు పరిపాలించుచున్న ధర్మబుద్ధి ప్రసన్నత, వీరభోగవసంతరాయులను భారతీయులు గుర్తించినప్పుడు సర్వప్రజలచే ఎన్నుకోబడిన ధర్మరాజు మనలో ఎవరైన రాగలరు

ఇది యిక జరుగును. పరిశీలించి అర్థము చేసికొనుడు. మూఢవిశ్వాసులకు యిప్పటి యుగములో స్థానములేదు. స్వభావసిద్ధమైన మతము మానవుల శారీరక, మానసిక, దైవికశక్తులను పోషించును పరమాత్మునిసన్నిధికి కొనిపోవును. సర్వమానవుల సంరక్షణ చేయునట్టి సమర్థతగల మతమును అల్లాః సర్వేశ్వరుడు తన ప్రియప్రవక్తయగు (Prophet hood) శ్రీ ముహమ్మదుగారి (వీరిపై అల్లాః సర్వేశ్వరుని ప్రసన్నత యుండుగాక !) ద్వారా స్థాపించినాడు, ఆ మతమే కల్కి-మతము అనగా యిస్లాము మతము.

గురుర్బ్రహ్మ గురువిష్ణు। గురుర్దేవో మహేశ్వరః।
గురుస్సాక్షాత్పర బ్రహ్మ। తస్మై శ్రీగురువేనమః।

(గురుబోధగ్రంథం)

పైన కనపరచిన గురుప్రార్థనలో వుండే హంశములునూ పరిశీలింపుడు. నిజగురువు బ్రహ్మతత్వమును, విష్ణుతత్వమును, యీశ్వరతత్వమును, మూర్తీభవించి, పరబ్రహ్మను సాక్షి పలుకువాడే సహజదైవికగురువు. యీగురుతత్వమును నాలుగు యుగములలో, సర్వజనాంగము లలో, అల్లాః సర్వేశ్వరుడు నియమించియున్నాడు. వీరిసంఖ్య 1,24,000 వైదికశాస్త్రము లనుసరించి వీరిని ఋషులు, మునులు, అవతారపురుషులు అనబడుదురు. ఇస్లాం శాస్త్రము నను సరించి వీరిని నబి, రసూల్ అనబడుదురు. సర్వమానవుల సృష్టికర్త, పోషణకర్త ఒకడైయున్నాడు యిట్టివారు 27 ముఖ్యఅవతార పురుషులని శాస్త్రములు నిరూపించుచున్నవి. వుదాహరణముగా కొందరిపేర్లు, శ్రీవేదవ్యాసుడు, శ్రీరామ, శ్రీకృష్ణ, శ్రీబుద్ధ, శ్రీవర్ధమాన మహావీర్, శ్రీ ఆదము, శ్రీమూసా, శ్రీ యేసుక్రీస్తు మొదలగు ప్రవక్తలు (Prophets) మానవకల్యాణముకొరకు "అల్లాః సర్వేశ్వరుడు నియమించినాడు. వీరు తమ తమ శక్తిసామర్థ్యములకొలది గురుతత్వమును ప్రదర్శించినారు.

పూర్ణగురుతత్వము శ్రీకల్కి-యవతారమున పరిపూర్ణమైనది. యీ కల్కి-యవతార పురుషులు శ్రీ ముహమ్మద్ (వీరిపై శాంతి, ప్రసన్నత యుండుగాక !) గారు. గాబట్టి వీరే అంత్య ప్రవక్తలు. (Final Prophet hood)

వీరు బ్రహ్మలో ఐక్యమయి, సర్వేశ్వరునిచే 1,24,000 ప్రవక్తల ఓంకారమును పొందియున్నారు. 1,24,000 ప్రవక్తల ఓంకార సంపుటియే ప్రణవవేదమగు, ఖురానువేదము. యీఖురానువేద పరిపూర్ణజ్ఞానమును 1,24 000 తమ శిష్యులకు ప్రబోధించినారు. శిష్యులుకూడా వీరిననుసరించి ఖురాను వేదశాసనాన్ని అమలుపరచినారు. ఖురానువేదము జగత్తులో అవతరణ మైన పిమ్మట యికక్రొత్త ఆదేశమగు ఓంకారగ్రంథమురాదు. యెందుకనగా శ్రీ ముహమ్మద్ గారిలో గురుని బ్రహ్మతత్వము పరిపూర్ణమైనది.

విష్ణుతత్వము అనగా గురుశిష్యులు ఒకేస్థానమునకు రావలయును. అనగా గురువు, శిష్యులు, దైవికంగా, సాంఘికముగా, రాజకీయముగా ఒకేస్థానములో వ్యవహరించవలయును. శ్రీ మహమ్మద్ (వీరిపై శాంతి, ప్రసన్నత యుండుగాక!) గారు రాజకీయ సింహాసనాన్ని అలంకరించలేదు. ఆడంబరమైన రాజులదుస్తులను ధరించలేదు. కాబట్టి వీరిద్వారా విష్ణుతత్వము పరిపూర్ణదశ పొందియున్నది.

ఈశ్వరతత్వముకూడా వీరి ప్రవక్తతత్వములో పూర్తియైనది. వీరు రణరంగభీములై శత్రువులను యెదిరించి సంపూర్ణజయమును పొందియున్నారు. కాబట్టి శిష్యులను పరిపూర్ణముగా సంరక్షించ గలిగినారు.

గాన శ్రీముహమ్మద్‌గారిలో (వీరిపై శాంతి, ప్రసన్నత యుండుగాక!) బ్రహ్మతత్వము, విష్ణుతత్వము, ఈశ్వరతత్వము సంపూర్ణ దశను పొందియున్నది. ఇక యే యవతార పురుషుడు (Saint hood) వచ్చినను వీరినే అనుసరించును. గాబట్టి అయోనికల్కి యవతార్ శ్రీ వీరభోగవసంతరాయులు వీరిని అనుసరించియే వచ్చినారు. వీరి ధర్మసంస్థాపనము విశ్వవ్యాపకమైనది. వీరిని దేవతా సార్వభౌముండని వర్ణించినారు. (Head of Saints)

శ్లో॥ గురుర్బ్రహ్మ గురువిష్ణు। గురుర్దేవో మహేశ్వరః ।
గురుస్సాక్షాత్పరబ్రహ్మ, తస్మైశ్రీ గురువేనమః ॥

పైశ్లోకములో పరబ్రహ్మ అనగా బ్రహ్మతత్వముపై సర్వేశ్వరుని నిర్గుణ పేరు:- అల్లాః ఈ సర్వేశ్వరుడగు అల్లాఃసాక్షి పలుకువారని అర్థము "తస్మై" అనగా అట్టి తత్వమును పలుకువానినే నేను నమస్కరించు చున్నానని అర్థము. పరమాత్మ అల్లాఃసాక్షి పలుకు యిచ్చువారు శ్రీ వీరభోగవసంతరాయులు వచ్చియున్నందున ఆసేతుహిమాచల యావత్ భారతదేశములో ఆరాధన పొందుచున్న విగ్రహములన్నియు తొలగింపబడును. అన్నిశాస్త్రములు కాలజ్ఞానములు ఈ విషయమునే ఈ యుగసంధిలో జరుగునని చెప్పుచున్నవి.

"విష్ణువు అవతారం కలియుగానకువచ్చి స్వస్వరూపము జూపును"

(వచనకాలజ్ఞానము నాతా నమ్ముయ్యశెట్టి అండ్ సన్ మద్రాస్ 1897 పుట 20)

శ్రీ వీరభోగవసంతరాయులు దేవతా సార్వభౌముడై వచ్చియున్నారు. వీరిరూపము విష్ణుయొక్క స్వస్వరూపము ప్రత్యక్షగురువే దైవస్వరూపము. గాన వీరిని ఈరీతిగా 18 ఉప పురాణములు, 18 మహాపురాణములలోను వర్ణించినారు.

శ్లో॥ నారాయణం నమస్కృత్య వరంచైవ నరోత్తమం ।
దేవీం సరస్వతీం చైవతతోజయా ముదరేత్ ॥



ఫణిభట్లుగారికి పౌరోహితమిచ్చి, బహుమానములు నెల్ల నిచ్చేరుమా ।

ఫణిరాజు బాగడాగ త్రిశూల ధమరాము భగవంతుఁడుబట్టి వచ్చినిమా॥ (గో॥వా॥ నెం. 302)

ఫణిరాజు నాగసర్ప చిహ్నమును తన వీపుపై ధరించి ఈశ్వరావతారము శ్రీ వీరభోగవసంతరాయులు. (వయస్సు 40 సం॥)



''ఓం స్వరూపుడు'' శ్రీ ముహమ్మద్‌గారు (వీరిపై శాంతి ప్రసన్నత స్థిరమగుగాక!) శ్రీ ముహమ్మద్‌గారి ద్వారపాలక గణపతి యగు శ్రీ ''అలీ'' గారి అరబ్బీ అక్షరములపేరు (వివరం 6వ భాగం)



క్షత్రి జట్టివాడు శ్రీ వీరభోగవసంత
రాయుడు ఖుర్నూల చెండాడవచ్చి
నిమా॥ (గోవిందవాక్యములు నెం 67)
(వయస్సు 63 సం॥)

శ్లో॥ జయసత్యయుగ స్థాపన్ కరన్
నాశన్ మేచ్ఛఅపార్ ।
శ్వేతనఘార తల్వార్ కర్ కృష్ణ కల్కి
యవతార్॥ కల్కి-పురాణం॥




ఉమాపుర గణేశ్ విగ్రహము తీయబడును

ఇట్టి దైవత్వముగల వారిని విశ్వసించి అనుసరించు వారందరూ అల్లాః పరమాత్ముని సన్నిధిని చేరగలుగుతారు. భక్తులారా ఈసుసమయమును జారవిడువకుడు.

"చెప్పలేదంటను కొబూయ్యేరు, నరులారగురుని జేరిమ్రొక్కితే బ్రతుక నేర్చేరు ॥
చెప్పలేదంటను కోబూయ్యేరు, తప్పదిది గురుని వాక్యము, తప్పదోవల
బూయ్యేవారిని చప్పరించుక మ్రింగు శక్తులు ॥ చె

ఆకాశము యట్టనేను ఆరు మతములు ఒక్కటౌను,
జోకతో నా జగములన్ని సీరుకట్టె ఇట్టిఇనికివి నీవును
వేడుకాతో పోతులూరి వీరభోగవసంతరాయులు,
వేడుకార్థము యేడుజగము యేకచక్రముసేల్తూ వస్తుడు ॥ చె!

పై కాలజ్ఞానములోని భోధననుసరించి రక్షించుటకు వచ్చిన శ్రీ వీరభోగవసంతరాయులను నమస్కరించి విశ్వసించుడు. మోక్షపదవిని పొందగలరు,

## దేవతా సార్వభౌముఁడు

శ్రీ వీరభోగవసంతరాయాం దర్శనం పుణ్యం।
స్పర్శనం పాపనాశనం। సంభాషణం।
కోటియజ్ఞ ఫలం। వందనం మోక్షసాధనం॥

# అధ్యాయము 3.

శ్రీమత్ విరాట్ దేవతా సార్వభౌముఁడు

## శ్రీ వీరభోగవసంతరాయుల శిష్య బృందము

**వ-ఆఖరీన-మిన్‌హుం-లమ్మా-యల్‌హఖూబిహిం-వ-హు-వల్-అజీజుల్-హకీం**

(ప్రణయవేదము:- సూర 62,జుమ్మా-రుకు

అర్థము:- అంత్యకాలములో అల్లాఃసర్వేశ్వరుడు తన భక్తులను నిలబెట్టి ధర్మకార్యలను చేయించును. అతడు తనకిష్టము వచ్చినవారిని అనుగ్రహించును. ఈ సూత్రము ననుసరి శ్రీమత్ విరాట్ వీరభోగవసంతరాయులును, వారి శిష్యులగు మమ్ములను పరమాత్ముడు నిల నాడు.

"యా-అయ్యుహల్లజీన-ఆమను-మైయ్యా-యర్-తద్దా-మిన్-కుం-ఆన్-దీనిహి - ఫసౌఫ-యాతిల్లాహు-బిఖౌమి-యుహిబ్బుహుుం-వ-యు-హిబ్బూనహు"

(ప్రణయవేదము:- మాయిద, 5 రుకు 8)

అర్థము;- అధర్మము ఎక్కువైనప్పుడు తన ధర్మకార్యమునకై తన భక్తులను నియమించును. అల్లాఃసర్వేశ్వరుడు మిక్కిలి ప్రేమించెను. భక్తులుగూడ అల్లాఃను ప్రేమింతురు.

ఈ సూత్రము ననుసరించి పరమాత్ముని ప్రేమకొరకు మేము మాసర్వాశ్యమును అతనికి అర్పించినాము. కాబట్టి అతడు మమ్ములను ప్రేమించి రక్షించుచున్నాడు.

"వమా-అన-అలైహి-వ-అస్‌హాబిహి"

(హదీస్-తిరుమజీ)

అర్థము:- శ్రీ జగదేక గురువగు ముహమ్మదుగారు ఆనతి యిచ్చినది ఏమనగా నా తరువాత నా నలుగురు ప్రముఖశిష్యులు సక్రమముగా రాజ్యం పరిపాలింతురు. తదుపరి 300సంవత్సరములవరకు సక్రమముగా రాజ్యపరిపాలనము జరుగును. సర్వులు ధర్మసూత్రము ననుసరించి ప్రవర్తించుచుందురు. మరియు ఒక్క 1,000 (వెయ్యి) సంవత్సరములు అంధకారముగా నుండును. నా అనుయాయులలో అనేకశాఖలు, అనగా 72 శాఖలుగా చీలిపోవుదురు. అప్పటికి హిజరి పద్నాలుగు శతాబ్ధం అంత్యదశలో యుండును. ఉర్దుభాషలో "చౌదమీసద్దీ" అందురు. అప్పుడు అల్లాఃసర్వేశ్వరుడు ఇస్లాంమతపునరుద్ధరణకు, ఆ శతాబ్ధములో మతనాయకునను, నా యితర అనుయాయులను నిలబెట్టును.

వారు నా ప్రేమ పరమావధి గావించుకొని ఈధర్మకార్యమునకు నిలబడుదురు. వారిలో నేనుందును. వారు నాలో యుందురు. కార్యము సక్రమముగా నెరవేర్చుదురు. అప్పుడు నా అనుయాయులందరూ మహోన్నతస్థితిని పొందిసుఖింతురు.

శ్లో॥ సాధూనాం దర్శనం పుణ్యం।
స్పర్శనం పాపనాశనం।
సంభాషణం కోటియజ్ఞఫలం।
వందనం మోక్షసాధనం॥

(ఇతిహాస సుభాషితము)

అర్థం:- ఈ యుగసంధిలో అవతరించియున్న శ్రీ వీరభోగవసంతరాయుల శిష్యులగు సాధువులను దర్శించుటచేత పుణ్యము ప్రాప్తించును. స్పర్శించుటచేత పాపపరిహారమగును.

సంభాషించుటచే కోటియజ్ఞముల ఫలప్రదము పొందుదురు. వారికి వందనముచేసి వారుచెప్పు ఇస్లాం శాంతిధర్మమును స్వీకరించినట్లైన మోక్షపదవి తప్పక చేకూరును.

శ్లో॥ సత్సఙ్గత్వే నిస్సఙ్గత్వం ।
నిస్సఙ్గత్వే నిర్మోహత్వమ్ ।
నిర్మోహత్వే నిశ్చలచిత్తం ।
నిశ్చలచిత్తే జీవన్ముక్తిః ॥

(భజగోవింద శ్లోకములు నెం 9 పుట 14 కొండా శంకరయ్య సికింద్రాబాద్ 1951)

అర్థం:- పై శ్లోకములోయున్న సత్సంగమేమనగా పరమాత్మరూపమగు యుగపురుషుని సంగమే సత్సంగము ఇతని ద్వారానే ముక్తిలభించును. కాబట్టి యుగపురుషుడగు దేవతా సార్వభౌముడు శ్రీ వీరభోగవసంతరాయుల శిష్యుల సంగమే ముక్తిదాయకము. వీరుతప్ప మరెవ్వరును మోక్షదాయకులు కాజాలరని పై శ్లోకము రుజువుచేయుచున్నది. గాన యుగయుగములలో దైవత్వమునుపొంది మానవులలోనే మానవుడు పరమాత్ముని సాక్షి పలుకును. ఇట్టి దైవత్వముగల యుగపురుషుని సాంగత్యమే ముక్తిదాయకము. వీరి శిష్యుల సాంగత్యముచే లౌకిక ఆశపాశలు నశించును. భక్తులలో యిట్టి లౌకిక ఆశలు నశించినప్పుడే దైవత్వమును పొందగలుగుదురు. చతుర్విధ పురుషార్థములను పొందినవారై జన్మపావనమొనర్చి మోక్షపదవిని పొందగలుగుదురు. ఇట్టి సత్ భక్తుల హృదయములపై ఆశీనుడై, తన ఉనికికి తానే సాక్షినిచ్చును. అప్పుడు నాస్తికులందరు ఇట్టి భక్తుల నశింపుకు విశ్వప్రయత్నములను కొనసాగించినప్పటికిని నశింపుచేయజాలరు. వారిపై రాజ్యాధికారము చలాయించజాలరు. ఇట్టి భక్తులను నశింపచేయుటకు ప్రయత్నించువారే రాక్షసులు. ఇప్పటి యుగసంధిలో విచ్చలవిడిగా భూమ్యాకాశములను ఆక్రమించుకొనియున్న, ఆటంబాంబ్ (Atom bomb) హైడ్రోజన్ బాంబ్ Hydrogen bomb) రాకెట్ బాంబ్ Rocket bomb) మొదలగు మారణయంత్రములశక్తి ప్రసన్నులందరు ఒకే ముహూర్తమున అగణిత సంఖ్యలుగా నశింతురు ఈ విషయమును శ్రీ వీరబ్రహ్మేంద్రస్వాములవారు తన వచన కాలజ్ఞానములో నొక్కివక్కాణించియున్నారు. "ఒకే ముహూర్తమున ఏడువేలపుట్ల నల్లలు రాలును" నల్లలు అనగా నల్లపూసలు అని అర్థము. ఏడువేల పుట్ల నల్లపూసలు రాలవలెనన్న కోటానుకోట్ల రాక్షసపురుషులు (మారణయంత్రములశక్తి సంపన్నులు) నశింతురో వూహించవలెను. ఈరాక్షసులు సప్తసముద్రములలోను గగనమండలములలోను కలహించుకొని నశింపుకాగలకాలము సమీపించుచున్నది. పట్టణములయందును, పల్లెలందును, వనములయందును నెత్తురు వానలు కురియు సమయము రానున్న సూచనలు కానవచ్చుచున్నవి.

శ్లో॥ హరి రూపాః క్షేత్రతీర్థ తీర్థపావనా ధర్మమత్ తత్పరాః ।
సారాసార విదః సేవ్యసేవకాద్వైత విగ్రహాః ॥

(సంస్కృత కల్కిపురాణము: అ॥ 12 శ్లో॥ 24)

అర్థమేమనగా ధర్మకార్యమునకై నిలబడు భక్తజనులు శ్రీనారాయణ రూపులై యున్నారు. వారు సర్వక్షేత్రములను పవిత్రము చేయుదురు. సర్వకాలములోకూడా ధర్మ ప్రచారతత్పరులై యుందురు, వారు సారాసార విషయములను తెలిసినవారై యుందురు. వీరు సేవ్యాసేవక ద్వమూర్తులై యుందురు. అయోనికల్కి అవతార్ పురుషుని శిష్యులై యీధర్మ కార్యమునకు మేము నిలబడియున్నాము. ఈగుణములన్నియు మాయందు మూర్తీభవించినవి. మా సాంగత్యమువలన నై విషయములు విశదమగును.

శ్లో॥ యత్ పూజాయాం భవేత్ పూజ్యో విష్ణుర్ యన్ మమదర్శనం
పాపసంగం స్పర్శనాచ్చ కిమహోసాధు సంగమః ॥

(సంస్కృత కల్కిః పురాణము: అ॥ 16 శ్లో॥ 20)

దీని అర్థము:- కల్కి యవతారపురుషుని శిష్యుల దర్శనమే విష్ణుదర్శనము వీరిని దర్శించుటచేత పునర్జన్మము కలుగదు. వీరిని స్పర్శించుటచేత సర్వపాపములు హరించిపోవును. ఇట్టి అవతారపురుషుని సాధువుల ఆగమనము, సాంగత్యము యంతటిమహాత్మో! సమస్తసద్గుణ నిలయ అయోనికల్కిః అవతార్ శ్రీమద్విరాట్ వీరభోగవసంతరాయుల శిష్యులగు మమ్ములను దర్శించి భూతభవిషద్వర్తమానకాలముల ధర్మపరివర్తనములను వ్యక్తిగతముగా తెలిసికొనుటచే సర్వవిషయములు సవివరముగా తెలియును, అన్నివిషయములను యీచిన్నగ్రంధములో వివరించుటకు సాధ్యముకాదు. గాన సంగ్రహించి వ్రాసినాను.

శ్లో॥ సాధూనాం హృదయం ధర్మోవాచోదేవాః సనాతనాః ।
కర్మక్షయాణి కర్మాణి యతః సాధుః హరిః స్వయం ॥

(సంస్కృత కల్కిపురాణం: అ॥ 16 శ్లో 21)

దేవతాసార్వభౌముండైన కల్కియవతార పురుషుని శిష్యులహృదయములలో ధర్మమే యుండును. వీరి వాక్యములే పరమాత్ముని పలుకులు. వారుచేయు దైవకార్యమే అల్లాః పరమాత్ముని కార్యము. కాబట్టి వీరి శిష్యులబృందమే స్వయంనారాయణమూర్తియై యున్నాడు. పోతులూరి హరిభక్తులు జ్యోతిస్వరూపులై వత్తురు.

(వీరబ్రహ్మంగారి వచనకాలజ్ఞానము పుటము 22)

అర్థము:- హరిభక్తులనగా యీయుగసంధిలో సర్వమతసంస్కర్త అయోనికల్కి యవతార్ శ్రీవీరభోగవసంతరాయుల శిష్యులు జ్యోతిస్వరూపులై వత్తురని సూచించినారు. కాబట్టి వారి శిష్యులైన మాద్వారానే హృదయములలో ప్రకాశించుజ్యోతి సముపార్జన సాధనములను తెలిసికోవలయును. మమ్ములను విడిచి మరెవ్వరిద్వారా యీజ్యోతివిషయములు తెలియ

జాలవని నిర్ధిష్టముగా వీరబ్రహ్మేంద్రస్వాములవారు 600 సం॥ ల నుండి కాలజ్ఞానపుస్తకముల ద్వారా హెచ్చరించుచున్నారు. గుర్తించుడు.

"నాభక్తులైనవారు ధర్మంబు భూమిపై నెగజల్లుదురు"

(శ్రీ వీరబ్రహ్మంగారి వచనకాలజ్ఞానము పుట 25)

శ్రీ పోతులూరి వీరబ్రహ్మంగారు, శ్రీ వీరభోగవసంతరాయుల రూపములో అవతరించి నారు. ఇది మీకు ఒకదివ్యసందేశము. యావదాంధ్రభక్తులందరు ఉవ్విళ్ళూరుచు వెయ్యికళ్ళతో ఎదురుజూచు సమయమున యీదివ్యసందేశ మందించుచున్నాము. ఇక మోసగురువులకు స్థాన ముండదు. ధర్మముసుగుతో ప్రజలను మోసపుచ్చు మోసగురువులందరు నశించు కాల మాసన్న మైనది

"పుల్లిగడ్డ కుపదేశమిచ్చేటి కల్లగురువులు కలిలో యుండేరుమా!
"కల్లగురువుల నెల్ల కాల తన్నును యముడు కల్లలేని నరుల కరుణించేరుమా"

అందుకనే ముందుగానే శ్రీ వీరబ్రహ్మంగారు ప్రజలను హెచ్చరించినారు. భక్తజను లారా! మేము వారిభక్తులై యావత్భారత దేశమంతటను పర్యటించుచు ధర్మరహస్యములను ఫలాపేక్షలేక సద్భక్తులెల్లరకును ప్రబోధించుచున్నాము. కన్నడ ప్రాంతమున కన్నడభాషల ఉప న్యాసకులు, మహారాష్ట్రము, మరాఠిభాష ఉపన్యాసకులు, సింధు, గుజరాతున గుజరాతీభాష ఉప న్యాసకులు, పంజాబురాష్ట్రమున పంజాబిభాష ఉపన్యాసకులు, మదరాసుప్రాంతమున అరవభాష ఉపన్యాసకులు, ఆంధ్రప్రాంతమున తెలుగుభాష ఉపన్యాసకులు, పర్యటించుచున్నాము. మాలో ఉర్దు, అరబ్బీ, ఇంగ్లీషు ఉపన్యాసకులుకూడా గలరు.

వారిచ్చిన ఆదేశముల ప్రకారము, అక్షయపాత్ర చేతబట్టి భారతదేశమునయుండే సర్వ మతశాఖల భక్తులెల్లరకును, సర్వ వ్యాపకశాంతి, ఇస్లాం ధర్మమును వేదోక్తముగా ప్రచారము ముమ్మరముగా సాగించుచున్నాము.

కాబట్టి మాద్వారానే ధర్మరహస్యములను తెలిసికొనగలందులకు మనఃపూర్వకముగ ప్రార్థించుచున్నాము. మేముతప్ప మరెవ్వరును యీ చిదంబరరహస్యములను తెలుపజాలరని శ్రీ వీరబ్రహ్మంగారే ఖచ్చితముగా మీకు ఆజ్ఞాపించియేయున్నారు. వారి ఆజ్ఞను సిరసావహించి ధర్మ ముద్ధరించవలెనని ప్రార్థించుచున్నాము ఈ సుసమయము గతించినపిమ్మట తిరిగి దొరకుట దుర్లభము. ధర్మ జయభేరి మ్రోగినపిమ్మట కోట్లకొలది ధనము ధర్మముపేరట ధారబోసినన గణ్యంతపుణ్యమైనను పొందజాలరు మరియు సాధు సత్పురుషులకు షడ్రసోపేతమైన విందులొ రించినను యిప్పుడు సాధువులకు (శ్రీ వీరభోగవసంతరాయుల శిష్యులగు మాకు) పెట్టు పిడికిలున ఫలముకూడా దొరకదుసుమా॥)

"శ్మశానమున భక్తులు జనింతురు"

(శ్రీ వీరబ్రహ్మంగారి వచనకాలజ్ఞానము పుట 25)

దీని భావమేమనగా మానవులు మరణించినపిమ్మట శ్మశానమునకు కొనిపోబడుదురు. అచ్చట మట్టిచేయబడుదురు, లేక దహనము చేయబడుదురు. అట్టి చనిపోయినవారికి ఆశపాశలు గాని లోకసంబంధములుగాని యుండబోవు. ఇట్టి లక్షణములుకలవారు శ్రీ వీరభోగవసంతరాయుల శిష్యవర్గములో యున్నారు. ప్రచారముచేయు మమ్ములను దర్శించినచో దీనిభావము తేటతెల్లముగా స్ఫురించును.

'భూత భవిషత్తులమహిమ నా భక్తులకే యిచ్చితిమి"

(శ్రీ వీరబ్రహ్మంగారి వచనకాలజ్ఞానము పుట 27)

భూతకాలమహిమ అనగా కృత, త్రేతా, ద్వాపర కలియుగములలో వచ్చిన సర్వ అవతారపురుషుల రహస్యమును, వారి ధర్మరహస్యములను, త్రికాలజ్ఞాన సంపన్నులైన శ్రీ వీర భోగవసంతరాయులు మాకు ప్రబోధించినారు. భవిషత్కాలమహిమ అనగా యికముందు జరుగబోవు ధర్మపరివర్తన విషయములను, యికముందు చేయబోవు కార్యక్రమములును మాగురువరేణ్యులు మాకు విశదపర్చియున్నారు. వీటి నన్నిటిని పుస్తకములో వ్రాయుట చాలా కష్టము గాన వ్యక్తిగతముగా తెలిసికొనగోరుచున్నాను.

భూత భవిషత్తులమహిమ శిష్యులైన మాకే యిచ్చుదురని శ్రీ వీరబ్రహ్మంగారు తెలిపియున్నారు. కాబట్టి మా ధర్మబోధన పెడచెవినిపెట్టిన ధర్మముతప్పి పెడమార్గములో పడి చాలా దుఃఖము లనుభవింతురు. పడరాని కష్టముల పాలగుదురు.

"గుణముగల వారందరు బనగానిపల్లెను జేరుదురు"

(శ్రీ వీరబ్రహ్మంగారి వచనకాలజ్ఞానము పుట 20)

ఒకేపేరుగల 2-3 పట్టణము లుండవచ్చును. ఉ॥ (1) పెనుగొండ అనంతపూరు జిల్లాలోను, వెస్టుగోదావరి జిల్లాలోను ఉన్నది.

(2) గుడివాడ కృష్ణాజిల్లాలోను, గుంటూారు జిల్లాలోను ఉన్నది. యింకను అనేకము గలవు. ఇటులనే బనగానపల్లె అనునది ఒకటి కడప జిల్లాలోను మరొకటి గోలుకొండ ప్రక్కన బనగానపల్లె పేరుతో యిప్పటి హైదరాబాద్‌లో వుండెను. పై కాలజ్ఞానము కనపర్చిన బనగానపల్లె యిప్పుడు హైదరాబాద్ అనే పేరుగాంచియున్నది. పట్టణమిప్పుడు చాలా పెరిగిపోయినది. ఆంధ్రప్రదేశ రాష్ట్రమునకు రాజధానిగా యున్నది. అప్పటి బనగానపల్లె యిప్పటికిన్నీ బేగంబజారుగా వాడుకలో యున్నది.

పురాణ యితిహాసములలో కల్కిరూపుడు శంభల గ్రామమున వచ్చునని సూచించి యున్నారు.

(కల్కిః పురాణము అ॥ 1 శ్లోకము 4)

శంభల=శం - భల=శంభల=శంభల శం=మిక్కిలి, (సుఖము) భల=బలము అనగా మిక్కిలి బలముగల పట్టణము అని అర్థము.

నరదేవతా సార్వభౌముండైన శ్రీ కల్కియవతార పురుషుడు శంభలగ్రామమున అవతరించును. వీరి ఆత్మబలముచేత కలిపురుషుడు దేశము విడనాడిపోవును. కలిపురుషుడు తనవెంట తెచ్చిన వాహనము గాడిదను (గర్ధభ) అచ్చట వదలి వెళ్ళిపోవునని వ్రాసియున్నారు.

(సంస్కృత కల్కిపురాణము అ॥ 7 శ్లో॥ 2 చూడుడు)

కలిపురుషుడనగా యింగ్లీషువారు. ఇతని వాహనము గాడిద రైలుబండి అనునది.

భవిషత్ సూచనల ప్రకారము అయోనికల్కి అవతార్ శ్రీ వీరభోగవసంతరాయులు 14-8-1947న అర్ధరాత్రివేళ కలిపురుషులగు యింగ్లీషువారిని వెళ్ళగొట్టిరి

అయోనికల్కి అవతారపురుషులు శంభలగ్రామములోనె తన అవతార (Saint hood) తిష్టవేసినారు ఇచ్చటనే జగద్గురు ఆశ్రమమును స్థాపించినారు. శంభలగ్రామమనగా మిక్కిలి బలముగల పట్టణము. కనుకనే సులువుగా కాంగ్రేసు పరిపాలనకు లొంగలేదు. సామ, దాన, భేద దండోపాయ ముపయోగించబడినది. దీనిని పోలీసుయాక్షను (Police Action) అనుదురు. శంభల గ్రామమునకు నలునైపులనుండి సైనికదళాలు ఒకేధాటిగావచ్చి ఆక్రమించుకొన్నవి. శంభలం అనగా మిక్కిలి బలముగల పట్టణమై యున్నందున బలప్రయోగించబడినది. ఈశంభల పట్టణమే హైదరాబాద్ నగరము. శం+భల=శం=భాగ్యము, భల=బలము, శంభలము అనగా బలముతో కూడిన భాగ్యము అని అర్థము. ఇప్పుడు శంభల అనగా హైదరాబాద్ పట్టణము. దీనికి భాగ్యానగరమను పేరు వాడుకలో యున్నది. శంభల మనగా మిక్కిలి బలముగల పట్టణము, భాగ్యానగరము. ఈ రెండుపేర్లున్ను సార్థకనామములు.

కాబట్టి బ్రహ్మంగారి కాలజ్ఞానములో బనగానపల్లె అనగా భాగ్యానగరమనియు, పురాణ యితిహాసములలో శంభల గ్రామమనియు కసపర్చినారు, అచ్చటనే వీరభోగవసంత రాయుల వారి ఆశ్రమమున్నది. దీనికి 'బలద్' అను ఉర్దూపేరు యున్నది.

శ్లో॥ సత్యంమాతా, పితాజ్ఞానం, ధర్మో భ్రాత దయస్సఖాః !
శాంతిః పత్నిః క్షమాపుత్రః షడ్తైతే మమభాంధవాః ॥

(భారతము శ్రీ ధర్మరాజుల వారి సుభాషితము)

**అర్థము:-** సత్యంమాత- ఒక శిశువు తల్లిగర్భములో నవమాసకాలము వరకు అభివృద్ధి చెంది జన్మించును. జన్మించిన మొదటి రోజునుండి తల్లియొక్క స్థనక్షీరమును త్రాగి పోషింప బడును. యవ్వనుడైన తరువాత తల్లి సేవ తప్పక చేయుట ధర్మమైయున్నది.

అటులనే శాంతి యిస్లాం ధర్మగర్భములో 9 అవస్థలుపొంది ధర్మపుత్రుడుగా జన్మించును. జన్మించిన మొదటిరోజునుండి ధర్మక్షీరమగు "ఆబె కౌసరు" అనగా అమృత క్షీరముతో 12 సంవత్సరముల పర్యంతము పోషింపబడి ధర్మయవ్వనస్థుడగును. తల్లికి ప్రతిసేవ చేయురీతిగా తన జీవితపర్యంతమువరకు శాంతి ధర్మప్రచారముచేసి కీర్తి గాంచును.

**పితాజ్ఞానం:-** తండ్రి తన కుమారునకు విద్యాభ్యాసము చేయించి, తగిన జ్ఞానామృత మును ప్రసాదించును. పుత్రుడు తన విద్యుక్తధర్మముగా పితునకు జీవాంతమువరకు సేవజేసి తండ్రిని సంతృప్తిపరచును.

అటులనే తండ్రివంటివాడు గురువు. గురువు తన ధర్మపుత్రుడగు శిష్యునకు ధర్మ విద్యాభ్యాసముచేయించి, తాను సంపాదించిన బ్రహ్మజ్ఞానమును (ఇర్ఫానుల్లాహి) ఫలాపేక్షలేక ప్రసాదించును. ధర్మపుత్రుడగు శిష్యుడు, తన గురుపాదసేవ దురంధరుడై తన జీవితాంతము వరకు, గురుమహిమలను, గురుప్రసాదించిన జ్ఞానదానమును, వర్షము సర్వత్రా కురియునట్లు మానవుల హృదయ క్షేత్రములలో అమృతగంగను (ఇల్మెఖురాన్) వర్షించును.

**ధర్మభ్రాత:-** అన్నదమ్ములలో పరస్పర అనురాగముండును. సుఖదుఃఖములలో ఆస్తిపాస్తులలో భాగస్వాములుగా యుందురు.

అటులనే శాంతి ధర్మమును స్వీకరించిన వారందరు పరస్పరముగా శాశ్వితమైన ప్రేమానురాగములు కలిగి యుందురు. ఒక సద్భక్తుడు తన శారీరక భ్రాతృనికన్న ధర్మసోదరుని మిక్కిలిగా ప్రేమించును. అరబ్బీలో (ఇన్నముల్-మూామినీన-యిఖ్-వతున్) తన ధర్మభ్రాతృని కొరకు తనప్రాణము లర్పించ వలసిన సమయము వచ్చినప్పుడు అర్పించుటకు వెనుదీయడు.

**దయాసఖా:-** శారీరక సోదరునకు ప్రతిఫలము అపేక్షించక దయచూపును. అటులనే స్వధర్మ సోదరునకు రెట్టింపు ప్రేమను చూపును.

**శాంతిపత్ని:-** ఒక భర్త తనలో జనకమైన అనురాగములను పత్నిద్వారా పూర్తిచేసుకొని శాంతించును. పత్నికొరకు వివిధమైన కృషులుసల్పి పత్నియొక్క అవసరములను పూర్తిజేయును. పత్నిద్వారానే శాంతిపొంది సుఖించును. అటులనే భక్తుడు తన ధర్మప్రచార ములో ఎన్నెన్నో కష్టము లనుభవించి శాంతి సముద్రములోనే (ఇస్లాం శాంతి ధర్మము) శాంతి పొందును. కష్టములన్నిటిని ఓర్పుతో ఎదుర్కొనును.

**క్షమాపుత్రః** :- తండ్రి పుత్రుడుచేయు తప్పులను క్షమించును. అటులనే శాంతి ఇస్లాం ధర్మప్రచారములో ప్రజలుచేయు అవమాన, తిరస్కారములను యితర తప్పులనుకూడ ధర్మప్రచారకుడు క్షమించును

**షడైతే మమబాంధవాః** :- శరీర సంబంధమైన బాంధవులు నా బంధువులుకారు. ధార్మికబంధువులే నా నిజమైన బంధువులని శ్రీకృష్ణుని శిష్యుడగు ధర్మరాజు ఉద్ఘాటించినారు.

పై కనపరచిన ధర్మగుణ సంపన్నులైన సాధుపుంగవులు శ్రీ వీరభోగవసంతరాయుల సన్నిధిలో చేరుతారని శ్రీ పోతులూరి వీరబ్రహ్మంగారు వచించినారు గుర్తించుడు. బనగానపల్లి అనగా యిప్పటి పేరుగల హైదరాబాద్ పట్టణము. ఇచ్చట వారు జగద్గురు ఆశ్రమమును స్థాపించినారు. వీరిని వీరి శిష్యబృందమును సందర్శించి వీరి, ఆశీర్వాదములు పొందుడు.

"వీరాధివీరులను వెంటబెట్టుకొని
వీరధర్మజ స్వామి వచ్చేను గురువరా ॥శివ॥
(కాలజ్ఞాన మహిమలు: కూర్పు శ్రీ పులికొండ పరబ్రహ్మకవిగారు పుట 8)

పై వాక్యప్రమాణముగా, సర్వ జగదండ మండలంబునకు ఒడియడగు శ్రీ వీరభోగ వసంతరాయుల శిష్యులు ధర్మప్రచారముచేయు వీరాధివీరులై యున్నారు. వీరితో సంభాషించుడు విషయములు ప్రత్యక్షమగును.

"యోగిపుంగవులు పుట్టి వత్తురు"
(కాలజ్ఞానమహిమలు శ్రీ పులికొండ వీరబ్రహ్మంగారు పుట 25)

శ్రీ వీరభోగవసంతరాయుల వెంటనుండు వారందరు యోగిపుంగవులే వీరెవరికిని జీత భత్యములుగాని, ఆస్తిపాస్థులుగాని లేవు "తవక్కల్ జిందగీ" అనగా అక్షయపాత్ర చేతిలో యున్నది వీరివెంట కొంతకాలము వున్నయడల యీ విషయములు ప్రత్యక్షముగా గోచరించును.

"రాగ, సిద్ధ, విద్యాధరులు"

(కాలజ్ఞాన తత్వములు పుట 5)

శ్రీ వీరభోగవసంతరాయుల శిష్యులు విరాగులు, సిద్ధపురుషులు. వీరిలో అనేకులు ఉర్దు, ఫారశీ, పష్తు, అరబ్బీ మౌల్వీలున్నారు. కొందరు S. S. L C, ఇంటర్మీడియెట్, B. A., M A., ఇట్టి నవీన విద్యాప్రవీణులుకూడా ఉన్నారు. భారత సర్వప్రాంతీయ భాషా ఉపన్యాసకులు ఉన్నారు. పండితోత్తములుకూడా యున్నారు సాంకేతిక నిపుణులుకూడా యున్నారు. ఇట్టి శిష్యబృందమును దర్శించుట మహాభాగ్యకరము, అల్లాః పరమాత్ముడుకూడా సంతోషించును.

పరమాత్ముడు మీ కోరికలను పూర్తిచేయును. శ్రీ వీరబ్రహ్మంగారు చెప్పిన కాలజ్ఞానము అక్షరస్య కార్యరూపములో వచ్చినది.

"రావించి భక్తుల రామధర్మజస్వామి రక్షించి అభయములిచ్చేనిమా"
(వీరబ్రహ్మంగారి గోవిందవాక్యములు నెం 89 కీ. శే జవంగుల నాగభూషణదాసు)

శ్రీ వీరభోగవసంతరాయులు మమ్ములను రక్షించి అనేక అభయములు యిచ్చియున్నారు. మమ్ములను కలసికొనుడు. అభయములేవో వివరించగలము.

"శ్రీశైలనాథుండు సాక్షాత్కారముగాను దాసుజనులతో మాటలాడీనిమా"
(గోవిందవాక్యములు నెం 16)

ఆధినారాయణ, దివ్యకళా పరిపూర్ణ సంభవులైన శ్రీ మద్విరాట్ వీరభోగవసంత రాయులు శ్రీశైలనాథుని స్వరూపమును మాకు సాక్షాత్కరించారు. వారి దాసులైన మాకు అవతారమహిమలను తెలిపినారు. వీరి పూర్ణమహిమలను మాద్వారా తెలిసికొనవలెనని మా అభ్యర్థన.
(వీరి శిష్యుల ఫొటో చూడుడు మధ్యలో శ్రీ వీరగభోగవసంతరాయులు ఆశీనులైయున్నారు)

"అంత శ్రీ లక్ష్మీదేవి నారాయణస్వామికి సాష్టాంగనమస్కారములు చేసి, స్వామీ పరమపురుషా! ఆది మధ్యాంతరహితా! అఖిలాండకోటి బ్రహ్మాండనాయకా! జగదీశ్వరా! యీ కలియుగ ప్రమాణంబు నాల్గులక్షల ముప్పదిరెండువేల సంవత్సరములు, (4,32,000 సం॥లు) అందు నిదివరకు గతమైనది 4,992 సంవత్సరములు. ఇంతలో పాపము మూడుపాళ్లును పుణ్యము ఒకపాలును అయినది. ఇంక నేను నిర్వహించలేననియె నంత నారాయణుడు బ్రహ్మాదులనుజూచి, మనము యీ లోకమందు భూమిపరిపాలనము జేయుటకుద్భవించెదము. ఈ కలియుగము మహాపాపయుగము గనుక దేవరూపములు దాల్పక నరరూపంబులు ధరియించి, పుణ్యస్థలములందు నిలిచి దుష్టప్రజ నిగ్రహశిష్ట పరిపాలనము చేయవలయును. గనుక నేను భూలోకములో కాశ్మీరదేశము నేలెడు జయసింగు మహారాజుకును అతనిభార్య తిలకమాంబ అనెడి పతివ్రతకును పుత్రుండనై యుద్భవించెదను. ఓయీ బ్రహ్మ నీవు రామనగరమందు రామయోగివై పుట్టుము అని యాజ్ఞాపించి ఇంద్రుండును, సముద్రుడును యముండును, కుబేరుడును, చంద్రుడును, సూర్యుడును, వాయువును, అగ్నియు, బృహస్పతియు, శుక్రుండును, వింద్యదేవతలు, రుద్రులు, అశ్వినులు, సాధ్యులు, యక్షులు, గంధర్వులు, భుజగులు, కిన్నరులు మొదలయినవారిని జూచి మీరు మీమీ అంశంబున భూలోకంబున నాకు భక్తులై యుద్భవించుడని యాజ్ఞాపించి దుష్టనిగ్రహశిష్ట పరిపాలనచేయు నిమిత్తమై కనకదుర్గాంబను పుట్టించి, వారివారిని తమ తమ నిజస్థానములకు పొండని శెలవిచ్చెను."

పై వాక్యములలో గమనించివలసిన విషయములు యేమనగా :- కలియుగ ప్రమాణము, 4,32,000 వేలు సంవత్సరములు. 4,992 వేల సంవత్సరములకు ధర్మము మూడు

పాదములు పడిపోవును. అప్పటికి శ్రీ వీరభోగవసంతరాయుల నామధేయంబుచే శ్రీమన్నారాయణుండు అవతరించునని సూచించారు. ఇప్పటికి కలియుగము గతమైనది. 5,060 సంవత్సరములు 5000వేల సంవత్సరములు సరికాలములో శ్రీ వీరభోగవసంతరాయులు మనభారతదేశమున అవతరించారు. వీరి తండ్రిపేరు జయసింగ్ మహారాజు అని కాలజ్ఞానములోను, విష్ణుయశస్సు, విష్ణుభక్తుడు, విష్ణువర్మ యితిహాసపురాణములలోను కనపరచినారు. జయసింగు=విష్ణుయశస్సు=విష్ణుభక్త=విష్ణువర్మ = అమీన్‌హుస్సేన్ (ఇస్లాం శాస్త్రములలో) యివన్నిటికి ఒకేభావము, ఒకే అర్థము వున్నది. భారతదేశములోయున్న ఆయాభాషలలో ఇదే అర్థమిచ్చే వీరి తండ్రిపేరు యున్నది. వీరి రాక సర్వభారతీయులకు వున్నది గాబట్టి, వారివారి అభిమాన భాషలలో పేర్లు కనపరచినారు. అయినప్పటికిని ఆపేరుగల తండ్రి గర్భములోనే జన్మించినారు. భాషల అభిమానమును వదలి అర్థము చేసుకొనిన యెడల విషయములు మీకు విశదముగాగలవు.

వీరి మాతాపేరు:- తెనుగు కాలజ్ఞానములో ,,తిలకమాంబ'' అనియు, పురాణ యితిహాసములలో ,,సుమతి'' అనియు హదీస్‌లలో ,,ఆమినా'' అనియు కనపరచినారు.

తిలకమాంబ = సుమతి= ఆమినా, ఈమూడుపేర్ల అర్థము ఒకటే, ఈపేరుగల మాతా గర్భములోనే శ్రీ వీరభోగవసంతరాయులు వారు జన్మించినారు.

ప్రవక్తల అవతార మహిమలను తెలుసుకొననివారు, అట్టి అవతారపురుషుడు తల్లి గర్భమునుండి జన్మించుతానే బాల్యావస్థలోనే అవతారప్రకటన చేయునని భావించుచున్నారు. వీళ్ళకు అవతారపురుషుని జీవితచరిత్ర సరిగా తెలియదు.

శ్రీరాములు, శ్రీకృష్ణులు, శ్రీబుద్ధభగవానులు, శ్రీవర్ధమాన మహావీరులు, శ్రీముహమ్మద్‌గారు (వీరిపై శాంతి ప్రసన్నత యుండుగాక) బాల్యావస్థలో తమ అవతార ప్రకటనచేయలేదు. వీరి బాల్యావస్థలో అనేక సద్గుణములు వున్నప్పటికిని అవతారప్రకటన, ప్రత్యేకత కలిగియుండును. అల్లాఃసర్వేశ్వరుడు వారిని, సంభోధించి ఓంకారద్వారముగా ఆదేశమిచ్చిన తదుపరి, ప్రజలకు ప్రకటనలుచేసి దైవకార్యమునే జీవాంతమువరకు కొనసాగించుదురు.

ప్రౌఢవయస్సు అనగా 40 సంవత్సరములు అయినప్పుడు సర్వప్రవక్తలు తమ కర్తవ్య ప్రకట చేసినారు.

శ్రీ ముహమ్మద్‌గారితో (వీరిపై శాంతి ప్రసన్నత యుండుగాక!) ప్రవక్తతత్వము (Finality of prophet hood) పూర్తి అయినందున క్రొత్త ప్రవక్తలురారు. దైవకార్యసాధనకు ఆధ్యాత్మిక అవతారము (Saint hood) గల పురుషులు రాగలరు. శ్రీ వీరభోగవసంతరాయులు ఇట్టి ఆధ్యాత్మిక అవతారప్రకటన చేసినారు. అప్పటికి వీరి వయస్సు 40 సంవత్సరములు. ఈ వయస్సుకు ముందుగా వీరికి తానెవ్వరైంది తనకే తెలిసియుండలేదు. యిటులనే సర్వప్రవక్తల జీవితములు యిలాగుననే జరిగినవి.

పై కాలజ్ఞానము వాక్యములలో కనపర్చిన, ఇంద్రుండును, సముద్రుండును, యముండును, కుబేరుండును, చంద్రుండును, సూర్యుండును, వాయువు, అగ్నియు, బృహస్పతియు, శుక్రుండును వింద్య దేవతలు, రుద్రులు, అశ్వనిలు మొదలగు దేవతల శక్తులు, శ్రీ వీరభోగవసంతరాయునకు కార్యసాధన సమయమున సహకరించునని అర్ధము.

సాధ్యులు, యక్షులు, గంధర్వులు, భుజగులు, కిన్నరులు మొదలగువారు శరీరధారులై వీరి శిష్యవర్గములో యిప్పటికి చేరియున్నారు. వారివారి శక్తులకొలది వీరి అవతార ప్రకటన విషయములను ప్రచారము చేయుచున్నారు.

శ్రీరామునకు వానరులు (కోయివారు, చెంచులు, భిల్లులు మొదలగు నరమనుష్యులే కోతులుగాదు సుమా!) శిష్యులుగా జన్మించి శ్రీరాములవారి కార్యమును పూర్తిచేసి యున్నారు.

శ్రీకృష్ణునకు పంచపాండవులేగాక 16,000 వేలమంది గోపకలుకూడ యున్నారు. గోపకలు అనగా పురుషులే సుమా! స్త్రీలు కారు వీరందరునూ శ్రీకృష్ణపరమాత్ముని పురుష శిష్యులే!) ద్వాపరియుగమున ధర్మసంస్థాపన కార్యము సాధించుటకొరకు వీరందరూ శ్రీకృష్ణభగవానుని శిష్యులైరి.

బ్రహ్మవేత్తలాను వెంటబెట్టుకొని బ్రహ్మాస్త్రిముబూని వచ్చేరుమా!<br>
బ్రాహ్మలు దేశాలు బుడబుడా మాడ్చేరు బ్రాహ్మకుల ముద్ధరించేరుమా హరి ॥ గో॥

(గోవిందవాక్యములు నెం 60)

పై గోవిందవాక్యములు కనపర్చినరీతిగా, శ్రీ వీరభోగవసంతరాయులు శత్రువుల సంహరించుటకు బ్రహ్మాస్త్రిముబూని వచ్చినారు. భారతదేశమునకు ఏశత్రువులు రాజాలరు. ఈభారతదేశమునుంచి శాంతి యిస్లాం ధర్మము స్థాపింపబడి ఇతరదేశములకు వ్యాపించి పోవును. ఈ కార్య సాధనకు తమ శిష్యవర్గములో మూడువందల శిష్యులకు బ్రహ్మతత్వమును (పర్వాఓంకారోక్తి శాస్త్రిముల సారము) ప్రబోధించినారు. బ్రాహ్మణకుల ముద్ధరించేరుమా అనగా వర్ణ, వర్గకుల, జాతి మొదలగు భేధములు లేక సర్వమానవులు యికముందు ఇస్లాం మతమునొక్క ఖురాను వేదమును ననుసరించువారు సద్భక్తులు, బ్రాహ్మణ కులమనగా బ్రహ్మజ్ఞానములో పరిపూర్ణమైన వారు ఇట్టి వారందరూ ఉద్ధరింపబడుదురు. యికముందు భారతదేశములో ఒకేవర్గమువారు యితరులమీద మతాధికారము చేయుటకు అవకాశములు అంతరించిపోవును.

సనక సానందాన సనత్కుమారులు సర్వోత్తములు వెంబడొచ్చేరుమా హరి ॥ గో॥

(గోవిందవాక్యములు నెం 185)

పై గోవింద వాక్యములో సనకసనందాన సనత్కుమారులు మొదలగు సర్వోత్తములు వీరి శిష్యవర్గములో చేరియున్నారు.

## NOTE MEHER BABA'S VERSION

ఇక కొంతకాలములోనే సూర్యుడుదయించుననే సూచన తెల్లవారుజాము చుక్క తెలియజేసి, తన కర్తవ్యమును పూర్తి జేయును. కోడిరాజుకూడ తెల్లవారుజామున "కొక్కరకో" అని కూతకూసి ఇక కొంతకాలములోనే సూర్యుడుదయించుననే సూచనచేసి తన కర్తవ్యమును నెరవేర్చుకొనును.

సూర్యుడుదయించిన పిమ్మట చుక్క ప్రకాశించదు. కోడికూత కూయదు. అటులనే శ్రీమెహర్ బాబాగారు యిచ్చిన సందేశమేమనగా :-

**'I have not come to teach but awaken'**

నేను బోధించుటకు రాలేదు. మేలుకొలుపుటకు వచ్చితిని. **'These who Teach you will come'** అనగా బోధించువారు వత్తురని శెలవిచ్చినారు.

గాన భక్తులారా ! శ్రీ వీరభోగవసంతరాయులను, వారి శిష్యులను శ్రీ మెహర్ బాబా గారు చక్కని సమయములో చాటినారు, బోధించుటకు వీరికి దైవాజ్ఞ లేదు. గనుకనే మౌనము వహించినారు. మెహర్ బాబా భక్తులారా! శ్రీ వీరభోగవసంతరాయులను విశ్వసించి, వారిప్రబోధ నల ననుసరించి జన్మసార్థకము చేసుకోవలయునని వారి సందేశములోని అంతరార్థము.

కురుకొండలోయున్న హనుమంతరాయుడు
కోపముతోడాను పెరిగీనిమా ।
ధరణికి నాలుగు తాటిమ్రాకుల పొడవు
నరుల కంటికి గానుపించీనిమా ॥

(వీరబ్రహ్మంగారి గోవిందవాక్యములు నెం 174)

హంపిలో యుండేటి హనుమంతరాయుడు అరచి
వీధుల కేక వేసీనిమా ।
ఆ కేక తగ్గేటి మహానందిమూలంతా ఆకురాలినట్లు
రాలేరుమా ॥

(శ్రీ వీరబ్రహ్మంగారి గోవింద వాక్యములు నెం 90)

పై గోవిందవాక్యములో, "హంపిలో యుండేటి హనుమంతరాయుడు" "కురుకొండలో యున్న హనుమంతరాయుడు"

పై రెండు స్థానములలోనే గాకా యావద్భారత దేశమున అనేక స్థలములలో, శ్రీ వీరాంజనేయరాతి ప్రతిమలను ప్రతిష్ట చేయించి పూజలు సలుపుచున్నారు గదా! త్రేతాయుగమున శ్రీ కోదండరాములను విశ్వసించి, వారి ధర్మసంస్థాపన కార్యమునకు అండదండలుగా నిలబడి శ్రీరాముని ప్రీతికి పాత్రులైనారు. వీరి ద్వారా అల్లాఃసర్వేశ్వరుడు "చిరంజీవి" ఆత్మపదాంతమును ప్రసాదించినాడు. ద్వాపరమున పంచపాండవులు శ్రీకృష్ణుని శిష్యులై ధర్మము నిలబెట్టి, పరమాత్మని స్థితిని స్థాపించినారు. బలభీముని రూపములో వీరాంజనేయుడు ధర్మరక్షాణ్యమును సాధించినాడు. కలియుగమున శ్రీ మధ్వాచార్యుని రూపములో ద్వైతసిద్ధాంతమును స్థిరపరచినాడు. శ్రీ వీరాంజనేయుడు యీయుగసంధిలో ఇస్లాం మత స్థాపనకై నా, (గ్రంధ రచయిత) రూపమున శ్రీ వీరభోగవసంతరాయుల శిష్యులైనాడు, శ్రీ దయాసాగరుండగు శ్రీ మహమ్మదు గారి అనగా దేవతాసార్వభౌముండు (The Head of the prophets) కల్కి-అవతార, సర్వశాస్త్రములలోని రహస్యముగ వుంచబడిన విషయములను స్వధైర్యముతో బహిరంగపరచుచున్నాడు.

"కోపముతో పెరిగేనిమా" అనగా శ్రీ హనుమంతరాయుడు కోపముతో ఎందుకు పెరుగుతాడు? దీని భావమేమనగా శ్రీ వీరభోగవసంతరాయుల శిష్యుడైనాడు. గురువు చేతిలో చేయియుంచి, యావజ్జీవ పర్యంతము వరకు ధర్మప్రచారముచేసి మానవుల పొగడ్తలను అనగా వంశపరంపరముగా వచ్చువ్యక్తిగత రాజ్యాధికారము లంతరింపజేసి, సాక్షాత్ అల్లాఃసర్వేశ్వరుని స్థితిని (ఉర్దూలో అల్లాఃకిహాంద్) స్థాపించుటకు సర్వదా సంసిద్ధుడై యున్నాడని దీక్ష వహించి యున్నాడు. (ఉర్దూలో బయ్యత్) దీక్షపొందిన మరుసంవత్సరమే శ్రీ వీరభోగవసంతరాయుల ప్రచారము నిమిత్తము పర్యటించుచూ శ్రీ వీరబ్రహ్మంగారి మఠమునకు 1940 సం॥ మార్చినెలలో పోయెను. మఠాధిపతులగు శ్రీ శ్రీనివాసాచార్యులకు "అయ్యగారు, శ్రీ వీరభోగవసంతరాయుల నామధేయంబుచే శంఖు చక్ర గదాధర, పీతాంబరధర త్రిశూలలింగ డమరుగధర మొదలగు శారీరచిహ్నములతో అవతరించి, శంభల హైదరాబాద్ నగరములో జగద్గురు ఆశ్రమముస్థాపించినారు. మీరు అయ్యగారి సన్నిధికి రండు. దర్శించుడు అని ప్రార్థించినాను. అయ్యగారు మూడు గంటలసేపు విన్నారు. మంచిది అని ప్రత్యుత్తరమిచ్చినారు. అయ్యగారు మాత్రం గురు సన్నిధికి రాలేదు. 1943 సం॥ ఫిబ్రవరి నెలలో అబుల్ బరకాత్ సయ్యద్ నాజీర్ హుస్సేన్ సాహెబ్ నాతోటి మిత్రునితో, పునః శ్రీ శ్రీనివాసాచార్యుల సన్నిధికిపోయి, గురువుగారి విషయములను పునః విశదపర్చినాను. అప్పుడు మఠాధిపతులగు స్వాములవారు విని గురుసన్నిధికి రాలేదు.

1957లో శ్రీ వీరభోగవసంతరాయుల 16 కళల 10 ఫోటోలు కర్నూలుజిల్లా నంద్యాల పట్టణములో వారి కందించినాను. మఠాధిపతులు శ్రీ వీరభోగవసంతరాయులవతరించినారనే వార్త, వీరబ్రహ్మేంద్రస్వాముల వారి భక్తులకు వినిపించినారో లేదో నాకు మాత్రము తెలియదు. మూడవ పర్యాయము 1958 సం॥లో శివరాత్రి ఉత్సవసమయమున మఠమునకు పోయినాను. విషయములు పునఃపునః వినిపించినాను. ఉత్సవసమయమున ఉపన్యాస ప్రోగ్రాములుండెను. నాకు కూడ యీ ఉపన్యాసముల ప్రోగ్రాములలో అవకాశమివ్వండి, శ్రీ వీరభోగవసంతరాయుల

అవతార విషయములు భక్తులకు వినుపించుతానని ప్రార్థించినాను. అవకాశము నాకు మాత్ర మివ్వలేదు.

యావదాంధ్ర పెద్దపెద్ద పట్టణములలోయున్న విశ్వబ్రాహ్మణులకు 1940 సం॥ నుండి 1960 సం॥ వరకు శ్రీ వీరభోగవసంతరాయుల అవతార వార్తను వారికి సంబంధించిన విషయములను తెలిపియున్నారు. ఉదాహరణము: హైదరాబాద్. శికిందరాబాద్, కర్నూలు, అనంతపూరు, పెనుగొండ, జమ్మలమడుగు, ప్రొద్దుటూరు. చిత్తూరు, నెల్లూరు, బాపట్ల, రేపల్లె, బెజవాడ, గుడివాడ, భీమవరం, కొవ్వూరు, పోలవరం, రాజమండ్రి, కాకినాడ, విశాఖపట్టణము, జగ్గయ్యపేట, నందిగామ, ఖమ్మంమెట్, వరంగల్, మచిలీపట్టణము, జనగాం, నల్లగొండా మొదలగునవి.

దాదాపు 20॥ల నుండి విశ్వబ్రాహ్మణులకు పునఃపునః వినిపించుతూ ప్రకటించుతూ వచ్చినప్పటికిన్ని గురుసన్నిధికి వచ్చినవారు నాకు కనపడలేదు.

వైదీక బ్రాహ్మణులకు అయోనికల్కి అవతార విషయములను వ్యక్తిగతముగా, ప్రకటనద్వారా, బహిరంగ సభలద్వారా గురుసన్నిధికి ఆహ్వానించినాను. అందరువిని ఆనందించినారు. స్వాగతపత్రము లిచ్చినారు. అతిధిసత్కారములు చేసినారు. సంభావనలు యిచ్చినారు, కొందరు శ్రీ వీరభోగవసంతరాయుల అవతారమును గుర్తించి శ్రీ మహమ్మద్‌గారిని విశ్వసించిరి. (వీరిపై అల్లాః సర్వేశ్వరుని శాంతి ప్రసన్నత యుండుగాక) నేను 20 సంవత్సరములనుండి ప్రచారము సాగించినప్పటికిన్ని భక్తులు ముందంజ వేయడములేదు.

పై కారణముచేత హనుమంతరాయుడు కోపముతో పెరిగినీమా అర్ధమిదియే.

ధరణికి నాలుగు తాటిమ్రాకుల పొడవు నరులకంటికి గానిపించీనిమా. అనగా వీరి ప్రచారము చేయుచున్నందుకు అల్లాఃసర్వేశ్వరుడు వారికి ఆత్మపదాంతముల పదవులను ప్రసాదించినాడు. నా ఉపన్యాసములువిని వారు మహదాశ్చర్యమును పొంది నన్ను గొప్పవానిగ భావించుచున్నారు. నాకొసంగబడిన సన్మానపత్రములు యీ పుస్తకంచివర భాగములో వ్రాయబడినవి చూడుడు.

కార్యనిర్వాహక ఉద్యోగస్తులకు, వారు సాధించిన ఘనకార్యములకు ప్రభుత్వముచే (Titles) బిరుదులు నొసంగబడును. ఇటులనే యుగసంధిలో దైవకార్యమగు ధర్మసంస్థాపనములో ప్రచారముచేయు సద్భక్తులకు ఆత్మపదాంతములగు బిరుదులు (ఉర్దూలో వలియల్లా, ఖుతుబ్, గౌస్, అవుతాద్) అల్లాః సర్వేశ్వరుడు ప్రసాదించును. ఇట్టి 16 బిరుదులు నాకు అల్లాఃసర్వేశ్వరుడు యీ ధర్మకార్యముకొరకు ప్రసాదించినాడు. ఇదియంతయు గురుకటాక్షము, దైవానుగ్రహము. నాజీవిత చరిత్రములో యీ 16 బిరుదుల వివరములు కలవు చూడుడు.

"హంపీలో యుండేటి హనుమంతరాయుడు అరచి వీధులకేక వేసీనిమా"

హనుమంతుని శక్తులు నాద్వారా (Godly powers of Sree Veeranjaneya) ప్రచారము చేయుచున్నవి. శ్రీ వీరభోగవసంతరాయులకు నేను 1939 సం॥ శిష్యుడైనాను. అప్పటినుండి భక్తులారా! ధర్మగురువులగు శ్రీవీరభోగవసంతరాయులవతరించినారనేవార్తబాక (Mogha phone) చేతబూని యావదాంధ్రదేశ పట్టణవీధులలో, ఓండ్రప్రాంత పట్టణవీధులలో, వెష్టుబెంగాల్ పట్టణవీధులగుండా 20 సంవత్సరములనుండి ప్రచారము చేయుచున్నాను. ఆయా దేశస్తులు నాకొసంగిన సన్మానపత్రములు రుజువు చేయుచున్నవి. పైవాక్యములలోయుండే అర్థమిదియే.

"ఆ కేక తగ్గట్టే మహనంది మూలంతా ఆకురాలినట్లు రాలేరుమా"

దీనిభావమేమనగా:- ఇచ్చట మహానంది అనగా సర్వేశ్వరుని అంత్యప్రవక్తయగు శ్రీ ముహమ్మద్‌గారు (వీరిపై అల్లాః సర్వేశ్వరుని శాంతి ప్రసన్నత యుండుగాక) మహానంది అనగా ఈశ్వరుని బసవ ఈశ్వర=అల్లాః, బసవ=అబ్ద. బసవ+యీశ్వర=బసవేశ్వర బసవేశ్వర= అబ్దుల్లాః (అల్లాకాబందా) పురాణములలో శివుడు ఎద్దువాహనుడై వచ్చునని శివరాత్రి పండుగ జరుపుచున్నారు. అనగా అల్లాఃసర్వేశ్వరుని ఆదేశము అతని అనగా శ్రీ ముహమ్మద్‌గారి (వీరిపై శాంతి ప్రసన్నత యుండుగాక!) అవతరణమైనది. అవతరణమైన గ్రంధమే తేజోమయా ఖురానువేదము.

శ్రీ ముహమ్మద్‌గారిని విశ్వసింపకపోవువారు నిస్సారమగు మనుజులగులరని దీని యర్థము

శ్రీ మదఖిలాండ కోటిబ్రహ్మాండ నాయక, ఆదినారాయణ, దివ్యకళాపరిపూర్ణ సంభవులైన శ్రీమద్విరాట్ వీరభోగవసంతరాయుల శిష్యులైన మేము వారి మహిమలను విషయములను తెలిసికోవలెనని మనఃపూర్వకమైన విజ్ఞప్తి చేయుచున్నాను.

మాగురువుగారి శిష్యులలో తెలుగులో శ్రీ వీరభోగవసంతరాయుల వారి విషయములు తెలుపువాడ నేనొక్కడనే. ఆంధ్రదేశమంతటను తెలుగులో ప్రచారము చేయువారు మరెవ్వరును లేరుసుమా. కాబట్టి విప్లవకాలము సమీపించు చున్నది. తదుపరి నేను యింత విరామముగా తిరుగుట కవకాశము లుండబోవేమో! నా కార్యభారము ఆంధ్రదేశములోనే గాక ఓండ్ర ప్రాంతము, బెంగాలు దేశము, వుత్తరప్రదేశ్ ప్రాంతములలోకూడా నేనే పర్యటించి ప్రచారము చేయవలసిన అవసరమెంతయో కలదు. ఇక 6 మాసముల తదుపరి ఆ ప్రాంతాలలో ప్రచారము సాగించుదును. భక్తులారా మీరెవ్వరైనను నా ప్రచారమును చేయవచ్చును. దీనికి జీతభత్యా లుండవు. అలా ప్రచారము చేయబూను వారు నన్ను కలుసికొనవలెను. ప్రచారము చేయు విధానములను సూత్రములను ప్రభోధించుదును. కొందరు మేముకూడా ప్రచారము చేసెదమని

నాకు జాబులు వ్రాయుచున్నారు. అట్టివారికి యీ పైపలుకులే జవాబుగా భావించ కోరు చున్నాను.

# అధ్యాయము 4.

## అయోనికల్కి అవతారపురుషుని విశ్వసించిన ప్రాప్తమగు పుణ్యఫలములు :-

"ఫ-జాలిక-ఫజ్ లుల్లాహి-యు - తీహి - మైయుషావు - వల్లాహు - జుల్ - ఫజలుల్లజీం" (ప్రణమువేదము-సూర జుమ రుకు 1)

దీని భావము:- పరమాత్ముడు తన శాంతి ధర్మస్థాపనార్థమై నిలబెట్టిన పురుషునకు తన, మన, ధనములతో ప్రోత్సాహమొసంగినచో అల్లాఃసర్వేశ్వరుడు ఆత్మపదాంతములగు వరములను ప్రసాదించును.

శ్లో॥ తమేవ శరణం గచ్ఛసర్వభావేన భారత।
తత్ప్రసాదాత్ పరాం శాంతిం స్థానంప్రాప్స్యసి శాశ్వతం॥
(భగవద్గీత అధ్యాయం 18, శ్లో॥ 16)

శ్రీకృష్ణుడు అర్జునునకు నిట్లుపదేశించు చున్నాడు. " అర్జునా! కలియుగము 5000 సంవత్సరముల యుగసంధిలో భారతదేశమందు ఈశ్వర అవతార అయోనికల్కి రూపులుద్భవించును. అతని నొక్కనినే విశ్వసించిన వారి కరుణచేత నీకు శాంతిధర్మము కలుగును."

కాబట్టి భారతీయవైదిక బ్రాహ్మణోత్తములారా! ఇట్టి మహత్తుగల యవతార పురుషులగు శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయక, ఆదినారాయణ దివ్యకళాపరిపూర్ణసంభవులైన శ్రీమద్విరాట్ వీరభోగవసంతరాయులను విశ్వసించినవారు తెచ్చిన శాంతి ఇస్లాం ధర్మాన్ని స్వీకరించి, ధర్మకార్యములలో భాగము వహించి భారతదేశముద్ధరించి, పరమాత్మనుండి చతుర్విధ పురుషార్థములనుపొంది, ఆచంద్రార్కముగ జీవన్ముక్తిని పొందగలరని వారి శిష్యవర్గమైన మేము ప్రార్థించుచున్నాము.

శ్లో॥ ఇత్యేతత్కలితం కల్కేరవతారం మహోదయం।
ధన్యం యశస్యం ఆయుష్యం స్వర్గం స్వస్త్యయనంపరం॥
(కల్కిపురాణం అధ్యాయం 19 శ్లో 35)

దీని భావమేమనగా మహోదయాళుడగు కల్కియవతార పురుషుని విశ్వసించిన ధన్యులగుదురు. మీకు కీర్తి కలుగును. ఆయుష్యము వృద్ధి చెందును. మీరు సూర్యచంద్రాదులున్నంత

కాలము శాశ్వితమగు స్వర్గసుఖముల ననుభవింతురని శ్రీ వేదవ్యాసమహర్షులు భారతీయు లందరికి ప్రబోధించినారు

కాబట్టి భారతీయ భక్తులారా ! ఇట్టి యుగపురుషుడు పుట్టియున్నాడు. వేదవ్యాసుల సందేశమును పాటించి సుఖింతురని మేము కోరుచున్నాము.

వస్తాడయ్యా వీరబ్రహ్మం వస్తాడయ్యా వస్తాడు వీరయ్య।
తెస్తాడు అమృతము యిస్తాడు భక్తులకు యిది సిద్ధమనుకోండి॥
(వీరబ్రహ్మంగారి కాలజ్ఞానతత్వములు పుట 14)

భారతీయ విశ్వకర్మ బ్రాహ్మణోత్తములారా ! మీగురువు శ్రీమద్విరాట్ వీరభోగ వసంతరాయు లవతరించి శంభళ హైదరాబాద్ నగరములో జగద్గురు ఆశ్రమమును స్థాపించి, తమ శిష్యబృందమును నలుదిశలకు ప్రచారనిమిత్తము పంపినారు. కాలచక్రమును గుర్తించి. మీగురువరేణ్యులు తెచ్చిన అమృతమగు "ఆబెకౌసర్" - "అబెహయాత్" ప్రణయవేదామృతమైన ఖురాను జ్ఞానాన్ని పొందవలయునని కోరుచున్నాను. శుభమస్తు !

చెప్పలేదంటనక బయ్యేరు, నరులార గురునిచేరి మ్రొక్కితె బ్రతుక నేర్చేరు।
చెప్పలేదంటనక పొయ్యేరు తప్పదిది గురుని వాకకిము ॥
(వీరబ్రహ్మంగారి కాలజ్ఞాన తత్వములు పుట 8)

భారతీయ విశ్వకర్మ బ్రాహ్మణోత్తములారా ! మీ గురుని మనవి వినండి పరిశీలించండి వారు సూచించిన కాలవ్యవధిలో అవతరించినారు. కాబట్టి ధరిత్రీదేవ స్వరూప శ్రీమద్విరాట్ వీరభోగవసంతరాయులే మీకు గురువుగా యున్నారు. వీరిని మ్రొక్కి వీరి అనుగ్రహమునుపొంది సుఖింపుడు. దుష్టశక్తులకులోను కాకండి సుమా ! మేము మనవి చేయవలసినదంతా చేసినాము. ఇక మీ యిష్టము. మీ భాగ్యము.

॥నందామయా గురుడ నందామయా ఆనందగురువులు వస్తారయా।
బ్రహ్మము చెప్పినమాటలు దప్పవు। పద్ధతెరిగి మీరు నడవండయా॥"

(శ్రీ వీరబ్రహ్మముగారి వాక్యామృతము పుట 2 కూర్పరి శ్రీ వంకాయలపాటి నాగ భూషణాచార్యులు, గుంటూరు)

శ్రీ వీరబ్రహ్మముగారి భక్తులారా ! పై వాక్యములను గమనింపుడు. చిద్విలాస స్వరూపుండగు శ్రీమన్నారాయణుండగు మీ ఆనందగురువులు వచ్చేసినారు. మేము వారి శిష్యులము. మీకు సర్వవిధాలుగా మీగురువుని మీకు గుర్తు తెలుపుచున్నాము. వీరిని వదలితే మీకు యెప్పటికైనను లేశమాత్రమగు ఆనందము దొరకదు సుమా !

"ఆర్భాటముతోను ప్రధానదూత శబ్దముతోను దేవుని బూరతోను పరలోకమునుండి శ్రీ యేసుప్రభువు దిగివచ్చును. క్రీస్తునందుండి మృతులైనవారు మొదట లేతురు. ఆమీదట సజీవులమై నిలిచియుండు మనము వారితోకూడ యేకముగా ప్రభువును యెదుర్కొనుటకు ఆకాశ మండలమునకు మేఘములమీద కొనిపోబడుదుము. కాన మనము సదా కాలము ప్రభువుతోకూడ యుందుము"

(1 థెసలొనీకైయులకు 4:16)

ఓయి! యేసుప్రభువు పరమభక్తులారా! పైవాక్యప్రమాణముగా రుద్రాంశ యేసు ప్రభువులు తన తండ్రియైన శ్రీమత్ కళ్యాణకర హజరత్ ముహమ్మద్‌గారి అనుయాయువులలో శ్రీ వీరభోగవసంతరాయుల రూపములో వచ్చి, హైదరాబాద్ పట్టణములో జగద్గురు ఆశ్రమ మును స్థాపించి, 300 మంది శిష్యులను ప్రభువు సన్నిధికి, మీరు రాగలందులకు మమ్ము ను పంపి నారు. కాబట్టి నిజరూపమును గుర్తించి శ్రీ గురువరేణ్యులను విశ్వసించి, వారిని అనుసరించి, ప్రవర్తించవలయును. ఇదియే దేవుని బూరలో ప్రకటించు పరమరహస్యము.

"అప్పుడు మనుష్యకుమారుడు ప్రభావముతోను, మహామహిమతోను ఆకాశ, మేఘ రూఢులై వచ్చుటచూచి భూమిమీదవున్న సకలగోత్రములవారు రొమ్ము కొట్టుకొందురు. మరియు ఆయన గొప్పబూరతో తన దూతలను పంపును. వారు ఆకాశముయొక్క ఈచివరనుండి ఆచివ వరకు నలుదిక్కులనుండి ఆయన యేర్పర్చుకొనిన వారిని పోగుచేతురు"

(మత్తై 24: 30, 31)

"ఓయీ! యేసుప్రభుభక్త పుంగవులారా॥ పైవాక్యములందలి రహస్యములను గుర్తింపుడు. ఆకాశమేఘమనగా మానవులకు ఆత్మికజలమైన పవిత్రమగు ఖురానుబోధామృతాన్ని తనవెంట తీసుకొని రుద్రాంశ యేసుప్రభువులు శ్రీ వీరభోగవసంతరాయులు అవతరించి హైదరా బాద్ నగరములో వున్నారు. కాబట్టి మేము ఆయన శిష్యులము, ఈ రహస్యమును ప్రకటనల ద్వారా గ్రంధములద్వారా ఉపన్యాసములద్వారా మీకు మేము తెలుపుచున్నాము. బూరలతో సర్వత్ర ఊదుచున్నాము.

మేలుకొనండి, కాలాతీతమైనది! హెచ్చరిక !! హెచ్చరిక !!!

## అధ్యాయము 5

అల్లాఃసర్వేశ్వరుడు తన ధర్మకార్యమునకై నియమించిన ధార్మికపురుషుని గమనింపని వారికి సంభవించు బాధదుఃఖములు

శ్లో॥ తానహం ద్విషతః క్రూరాన్ సంసారేషునరాధమాన్।
క్షిపమజస్రమ శుభానా సురీష్వేవయోనిషు ॥

(భగవత్‌గీత అధ్యాయము 16 శ్లో 19)

శ్లో॥ అసురింమోని మాపన్నా మూఢజన్మ జన్మని।
మామ ప్రాప్యైవ కౌంతేయ తతోయా న్త్యధమాంగతిం ॥

(భగవత్‌గీత-అధ్యాయము 16 శ్లోకము 20)

భారతీయ, శ్రీకృష్ణభక్త బ్రాహ్మణోత్తములారా ! పై రెండు శ్లోకములులలో శ్రీకృష్ణ భగవానుడు తన శిష్యుడైన అర్జునునితో ఇట్లు చెప్పినారు:- "ఓ అర్జునా ! నేను ప్రవక్తనని విశ్వసించకపోయిన వారందరు అసురయోనులలో అనగా క్రూరమగు వ్యాఘ్ర, సూకరసర్పముల జన్మములను పొందుదురు.

సర్వశాస్త్రోక్తముగా అవతరించిన శ్రీమత్ విరాట్ వీరభోగవసంతరాయులు. విశ్వసించక నిర్లక్ష్యము చేసినచో పైనుదహరించిన అధమగతిని పొందుదురు. హెచ్చరిక! హెచ్చరిక !!

ఇన్నద్-దావ్వాబి-ఇందల్లా-హిల్లజీన-కఫరూ-ఫ-హమ్-లాయుమినూన్-(ఖురాను-సూర అన్‌ఫాల్‌రుకు అ॥ 6 అయత్ 55)

పై ఖురాను వాక్యమందలి అల్లాః సర్వేశ్వరుడు, మానవులకు హెచ్చరించినదేమనగా శారీరక, భూమిక, (Earthly) దైవీక ప్రమాణములనుండియు సర్వవేదోక్త గ్రంథ ప్రమాణముల నుండియు, అల్లాఃసర్వేశ్వరుడు నియమించిన లోకకళ్యాణకరమగు అవతారపురుషుని తిరస్కరించినచో అట్టి వారు అల్లాఃపరమాత్మని సన్నిధిలో క్రూరాతిక్రూరమగు సింహములు, పెద్దపులులు, చిరుతపులులు, తోడేళ్ళు, సర్పములు మొదలగు మృగములు, కాకి, గ్రద్ద, డేగ, రాబందు మొదలగు నీచాతినీచమగు పక్షులవంటి వారని ఉద్ఘాటించినాడు. ఈ విషయమును ఖురానునందు పరిశీలింపుడు!

శాస్త్రోక్తముగా నియమించిన అవతారపురుషుని విశ్వసించుటయే పరమాత్మని యొక్క విశ్వాసము. ఇతనిని తిరస్కరించిన వారే పరమాత్మని శత్రువులు. ఇట్టి శత్రువులను, దుష్టులను వెనుకటి యుగములలో పరమాత్ముడు నశింపుజేసి యున్నాడు. కాబట్టి అట్టి నేరస్థులు కాబోకండి సుమా. హెచ్చరిక !

కపటకిరాతుల ఖండించివేయును. కల్కియవతార పురుషుడు వచ్చెనిమా !

(గోవిందవాక్యములు నెం 7).

కల్లగురువులనెల్ల గాలతన్నును యముడు కల్లలేని నరుల కరుణించునుమా !

(గోవిందవాక్యములు నెం 12)

"పెక్కులు బల్కేటి పామరజనులను, అక్కిచ్చి, పంపొచ్చు, అణచీనిమా।
యేనూరుకోట్ల భూమండాలములోన, పొట్టుబోయిగట్టి నిలచీనిమా॥

(గోవిందవాక్యములు నెం 41)

"గర్వాంధులనెల్ల ఖండించివేయును కలికవతారుడు వచ్చీనిమా ॥ హరి॥
గుండెల్లదేవీనీ బెండ్లెల్ల మునిగీని కుంభిణిభారాము లణగీనిమా ॥హరి॥ గో॥

(హరి గోవిందవాక్యములు నెం 250)

అర్థము:- శ్రీ వీరభోగవసంతరాయులు విశ్వసించినవారు గుండ్లవంటివారు, వీరు రక్షింపబడుదురు. తిరస్కరించిన వారందరు బెండ్లువంటివారు. వీరు వినాశులగుదురు.

"గురులింగ జంగాలు గురుతుదెలియలేక, గుడ్డికుక్కలవలె మొరిగేరుమా !
మొరిగి, మొరిగి వారు వాదూకు రాకుంటె వరగబెట్టి వారిని తరిగేరుమా ॥హరి॥ గో॥

(గోవిందవాక్యములు నెం 260)

అర్థము:- శ్రీమద్విరాట్ వీరభోగవసంతరాయులు, లింగాయతులలో రానున్న చెన్న బశ్వేశ్వరులు వీరే. వీరవతరించిన పిమ్మట, లింగాయతులను గురుసన్నిధికి పిలుతురు. రానిచో వరగబెట్టి తరుగుతారని వ్రాసినారు. మేము ప్రస్తుతము వారికి విషయాలను విశదపర్చుచున్నాము. గురుసన్నిధికి రాని జంగములను వరగబెట్టి తరిగే కాలముగూడా ముందువచ్చును సుమా హెచ్చరిక !

"శీలవంతులబట్టి సిగలెల్ల ముడివేసి చింతకొమ్మల కేలదీసేరుమా,
శీలాము పుట్టిన తావుదెల్పమని చింతమొల్లల పాలుచేసేరుమా హరి॥ గో॥

(గోవిందవాక్యము నెం 611)

"కావరించిన నరుల ఖండించివేసేరు కర్మానిష్ఠ గారవించేరుమా ॥హరి॥ గో॥

(గోవిందవాక్యములు నెం 282)

"కల్లలాడే వారిని కిట్టుగానుగలలో పొర్లించి పొర్లించి కూల్చేరు గురువరా ॥శివ॥

(కాలజ్ఞానమహిమలు-కూర్పు-శ్రీపులికొండ పరబ్రహ్మకవిగారు)

"ఇది (కాలజ్ఞానము) యబద్ధమని ఎగతాళీ చేయువారందరును నశింతురు. ఇది వీర గురుని వాక్యము తప్పదు.

(వచన కాలజ్ఞానము పుట 28)

"ఈపత్రికా నాక్షేపణ చేయువారిని కనకదుర్గాంబ ముక్కలు ముక్కలుగా చేయును. మమ్ముల (అనగా అవతరించి వచ్చిన వీరభోగవసంతరాయులను, వారి శిష్యులను అని భావము) పరిహసించిన వారిని బెజవాడ శక్తి తుత్తునీయలు చేయును.

(వచన కాలజ్ఞానము పుట 11)

శ్లో॥ జపస్తపం, వ్రతం తీర్థం, దానోయజ్ఞో తదేవచ।
గురు తత్వమజ్ఞానం సర్వం వ్యర్థం భవేత్ ప్రియే॥

(గురుభోద తత్వామృతం)

అర్థం:- సర్వవేదోక్త శాస్త్రముల ననుసరించి అవతరించి వచ్చిన శ్రీ వీరభోగవసంత రాయులను తిరస్కరించిన మహాపాపము సంభవించును. వీరిని నిర్లక్ష్యముచేసి యెంతటి తపస్సు చేసినకూడ వ్యర్థమగును తపము వ్యర్థముచేయక యెల్లప్పుడుచేసిన జపముకూడ సారహీనమగును. అమిత శ్రద్ధాశక్తులతో సాధ్యమైనంత యెక్కువ ధనవ్యయముచేసి పూనుకొనిన సత్యనారాయణ గౌరి, లక్ష్మి మొదలగు వ్రతములను అల్లాఃసర్వేశ్వరుడు మెచ్చడు. పుణ్యసంపార్జనకై తిరుపతి వేంకటేశ్వర, శ్రీశైల, రామేశ్వర, భద్రాచలం, సింహాచలం, జగన్నాధ, సోమనాధ, బదరీనాధ కేదారనాథ, కాశీవిశ్వనాధ, గయ, శ్రావణబెళగొళ, రాజస్థానములో ఆరావళి పర్వతమునగల ఆబూశిఖర, జరుసలేము మొదలగు పుణ్యతీర్థముల యాత్రసాగించి నప్పటికిని లేశమాత్రమైన పుణ్యముకూడ దొరకదు. పుణ్యసంపాదనకై కనక, వస్త్ర, వాహన మొదలగువన్నియు దానము చేసినకూడ వ్యర్థమగును వివిధమైన యాజ్ఞములను లక్షలకొద్ది ధనము వ్యయముచేసి నప్పటికిని యీషణ్ మాత్రమైన పుణ్యము ప్రాప్తించదు. కాబట్టి అవతార పురుషుని గురుతత్వమే ప్రత్యక్ష దైవము. ఇతనిని విశ్వసించుటచేత ఆయురారోగ్య అభివృద్ధి చెందుటయేకాక, అణిమ, మహిమ, లఘిమ మొదలగు అష్టైశ్వర్యములు ఆత్మపదాంతములు ప్రాప్తించును.

ఈ అవతార పురుషుని విశ్వసించిన, ప్రాప్తించు పుణ్యఫలము పుత్రి, పౌత్రి, కళత్రాదులలో ఆచంద్రార్కముగా, చిరస్థాయిగా యుండును.

## ఈ యుగపురుషుని ప్రభావము

"శ్రీకలికి భగవానుడనే వీరభోగవసంతరాయులు పరిపూర్ణమైన ప్రకాసితం అయ్యెని. ఇతండే దేవుడని నమ్మేది. ఇది తప్పితే బ్రహ్మహత్యా పాపంబు అనుభవింతురు"

శ్రీ వీరబ్రహ్మముగారి వాక్యాలు:- తాటాకుగ్రంథము

"వీరప్పయ్య జగత్తునెల్ల రక్షించీని" యిది బీజాక్షరములు, తప్పవు
(శ్రీ వీరబ్రహ్మము వాక్యాలు:- తాటాకు గ్రంథము కూర్పు:- ఏకాబత్తుని వద్ద రంగయ్యదాసు)

"మంచిబెల్లము చేదగును. వేపచెట్టున కమృతము పుట్టును."
(శ్రీవీరబ్రహ్మముగారి వచన కాలజ్ఞానము-పుట 23)

భక్తవరేణ్యులారా! దీని భావము తెలుసుకోనండి!! మంచిబెల్లముగా యుండిన బ్రాహ్మణోత్తములలో కొందరు నేటికాలమునకు ప్రజలకు చేదుగా తోచుచున్నారు. వేపచెట్టున కమృతము బుట్టుననే దాని భావమేమనగా మ్లేచ్ఛులు, అంటరాదు, దర్శించరాదు సుమా! అని ప్రజలలో అసహ్యము, నీచభావము కల్పించినందువలన యిప్పుడు చేదుగా తోచు ముస్లిముల లోనే అమృత తుల్యమైనట్టి మహాపురుషులగు శ్రీ వీరభోగవసంతరాయులు ముస్లింరూపము ధరించి వచ్చినారు. ఈముస్లింరూపమే యావద్భారత దేశమంతటాయుండే భారతీయులందరికిని అమృత తుల్యముగా పరిణమించును. ఇది ముమ్మాటికి సత్యము.

"......వీరేశ్వర స్వాములను వీరభోజులు జంబూద్వీపమును స్వాధీనంబు చేతురు."
(శ్రీ వీరబ్రహ్మముగారి వచనకాలజ్ఞానం పుట 27)

పై సూచన ప్రకారముగా శ్రీవీరేశ్వర స్వాములైన వీరభోజులు అనగా శ్రీమద్విరాట్ వీరభోగవసంతరాయులు మన జన్మభూమియైన జంబూద్వీపమున అవతరించి శ్వేతవర్ణులగు బ్రిటిష్ వారిని దేశమునుండి తన బ్రహ్మశక్తిచేత వెళ్ళగొట్టినారు. బ్రిటిషువారు వీరి ప్రభావమునకు తాళలేక 12:సంవత్సరములు హైదరాబాదు పట్నములో నిర్బధించి యుండిరి. వీరభోగవసంత రాయులు తన ఆత్మశక్తిచేత వీరిని వెళ్ళగొట్టి తాను స్వతంత్రులగుటయేగాక భారతదేశమును బానిసత్వమునుండి విముక్తిగావించిరి. స్వాతంత్ర్యసముపార్జన కార్యములో బహిరంగముగ మనలో అనేకులు కనబడినప్పటికిని దీనికి కర్తలు శ్రీ వీరభోగవసంతరాయులే అని పూర్వీకులందరు ముందుగానే గుర్తించి చెప్పినారు. దీనికి ఆధారములు, హదీసులలో, పురాణములలో, ఇతి హాసములలో యున్నవి. పరిశీలింపుడు. వీరబ్రహ్మంగారు ఆజ్ఞయిచ్చిన ప్రకారముగా వారే అవతరించి యీ కార్యమును పూర్తిచేసినారు. ఇదియే పై వాక్యమందున్న యదార్థము.

వ-యిజ్- అఖజల్లాహు-మీసాఖన్-నబీయీన-లమా-ఆతైతుకుం-మిన్-కితాబిన్-వ-వాఖ్మతిన్-సుమ్మా-జాఆకుం-రసూలుం-ముసద్దిఖుల్-లిమా-మఅకుం- లతుమినున్నబిహి-వ-లతన్ సురున్నహు.

(ప్రణయవేదఖురాన్-సూరా-ఆలెయింబ్రాన్ 8-రుకుకి)

అర్థము:- షైఖురాను వాక్యమున అల్లాఃపరమేశ్వరుడు ప్రవక్తలనుండి వాగ్దానము పుచ్చుకొనినదేమనగా మీకు ఒక్కొక్క గ్రంథమును, ఒక్కొక్క శక్తిని ప్రసాదించినాను. మీ అందరి అంత్యములో మిమ్ములను ధృఢపరచు ఒకప్రవక్త వచ్చును. అప్పుడు మీరు అతనిని తప్పక విశ్వసించి అతనికి సహాయము చేయవలయును.

పై భవిష్యోక్తి ననుసరించి మక్కాపట్నమందు నేటికి 1380సం॥ క్రితము సర్వ ప్రవక్తలను ధృవపరచు శ్రీమత్ ముహమ్మద్‌గారు అవతరించిరి. కృతా, త్రేత, ద్వాపర, ప్రారంభకలి యుగములలో అవతరించిన శ్రీ ఇబ్రాహీం, శ్రీ నూహు, శ్రీ ఎహియా, శ్రీఇదరిస్, శ్రీ ఏసుక్రీస్తు మొదలగు (వారి ఆత్మలపై పరమాత్ముని శాంతి యుండుగాక) సర్వప్రవక్తల ఆత్మీకశక్తులు వీరి శిష్యవర్గములో మూర్తీభవించి, వీరిని విశ్వసించి, జీవపర్యంతము వరకు గురుసేవచేసి పరమాత్ముని వాగ్దానమును పూర్తిజేసినారు.

పై సత్యము ననుసరించి శ్రీ ముహమ్మద్‌గారి సుభాషితములు ఈవిధముగా నున్నవి.

వ-మన్-అహబ్బ-ఐ-య్యన్‌జుర్-ఇలాయిబ్రాహీం-ఫల్‌యన్‌జుర్-ఇలా అబూ బకర్.

అర్థము:- శ్రీమత్ కళ్యాణస్వరూపులగు ముహమ్మదుగారు ఈవిధముగా సూచించినారు. ఇబ్రహీం ప్రవక్తను ఎవరైనను చూడవలెననిన, ఇదిగో అబూ బకరను చూడండి.

వమన్-అహబ్బ-ఐయ్యన్‌జుర్-ఇలానూహిన్-ఫల్‌యన్‌జుర్-ఇలాఉమర్.

అర్థము:- శ్రీ నూహుప్రవక్తను ఎవరైనను చూడవలెననిన ఇదిగో ఉమర్‌ను చూడండి

వమన్-అహబ్బ-ఐయన్‌జుర్-ఇలాఇదరీస్-ఫల్‌యన్‌జురు-ఇలాఉస్మాన్.

అర్థము :- ఇదరీసుప్రవక్తను ఎవరైనను చూడవలెననిన ఇదిగో ఉస్మానును చూడండి.

వమన్-అహబ్బ-ఐయ్యన్‌జుర్-ఇలాయహియా-ఫల్‌యన్‌జుర్-ఇలాఅలి.

అర్థము:- యహియా ప్రవక్తను చూడవలెననిన ఇదిగో అలీని చూడుడు.

వమన్-అహబ్బ-ఐయ్యన్‌జురు-ఇలాయీసబ్‌ను - మరియమ - ఫల్ - యన్‌జుర్ - ఇలా అబీజర్-గప్ఫారి.

అర్థము:- మరియమ కుమారుడగు ఈసాప్రవక్తను ఎవరైనను చూడవలెననిన ఇదిగో నాఅనుచరుడైన అబీజర్ గప్ఫారును చూడుడు.

పై తెలిపిన 5 వాక్యములనుండి అర్థమగునదేమనగా శ్రీమత్ ముహమ్మద్‌గారి అనుచరులలో వెనుకటి కాలములో అవతరించిన సర్వప్రవక్తల అంశములు ప్రతిబింబించబడినవి.

ఇంతేగాక:- వమా-మిన్-నబీయిన్-ఇల్లాలహు-నజీరున్-మిన్-ఉమ్మతి.

అర్థము:- శ్రీగురువరేణ్యులు సూచించినదేమనగా వెనుకటి కాలములో నవతరించిన సర్వప్రవక్తలు, ప్రవాదులు, ఋషులు, మునులు అవతార పురుషులందరూగూడ నాశిష్యవర్గములో నుందురు.

ప్రణవవేదమగు ఖురాను,హదీసు సూత్రముల ననుసరించిన శ్రీమత్ ముహమ్మద్‌గారి ప్రథమ రాకడలో సర్వప్రవక్తల అంశములు వారిశిష్యత్వముపొంది వారిసేవచేసి పరమాత్ముని వాగ్దానము పూర్తిచేసినారు.

కలియుగము 5000 సంవత్సరములకు శ్రీమత్ ముహమ్మద్‌గారి రెండవరాక భారత దేశమున వీరభోగవసంతరాయుల రూపములో పూర్తికానున్నది.

శ్రీమత్ విరాట్ వీరభోగవసంతరాయులు శ్రీ ముహమ్మద్‌గారిలో ఐక్యమై. వారి అనుగ్రహమునుపొంది, వారి శాంతి ఇస్లాము ధర్మమును పునఃవిజృంభింప జేయుటకై నిలబడినారు వీరు శ్రీ ముహమ్మద్‌గారి కార్యము నిలబెట్టుటకై నిలబడియున్నారు.

పైపరమాత్ముని వాగ్దానమును పూర్తిజేయుటకై శ్రీమత్ విరాట్ వీరభోగవసంతరాయుల శిష్యవర్గములో అవతరించిన శ్రీనూహు, శ్రీఇబ్రాహీం, శ్రీరామ, శ్రీకృష్ణ, శ్రీవర్ధమాన మహావీర మొదలగు ప్రవక్తల, ఆత్మిక అంశములు మూర్తీభవించి శ్రీముహమ్మద్‌గారిని విశ్వసించి, సదావారి సేవాదురంధరులై యున్నారు. కాబట్టి భారతదేశములో నుండిన సర్వప్రవక్తల ఆత్మిక శక్తులు. దక్కను, హైదరాబాదు జగద్గురు ఆశ్రమములో యుండెడి శ్రీమత్ ముహమ్మద్‌గారి అనుచరుడుగా శ్రీవిరాట్ వీరభోగవసంతరాయుల సన్నిధిలో సమావేశమైనవి. కాబట్టి శ్రీమత్ వీరభోగవసంతరాయుల శిష్యులపేర్లు ఈప్రవక్తల అంశములను సూచించుచున్నవి.

ఉదా:- 1. సమాజాధ్యక్షుడగు శ్రీ అబుల్ బురహాన్ మౌలానమౌల్వీ సయద్ ఖాసిం సాహెబుగారు, శ్రీగణంగళు.

2. సమాజ సెక్రటరీ, శ్రీమౌలానమౌల్వీ సయ్యద్ రసూల్‌సాహెబుగారు, శ్రీ కేశవ యవతారము.

3. సమాజ జనరల్ సెక్రటరీ, గాజీమహమూదుల్ ఖురేషిసాహెబుగారు,శ్రీవీరభద్రావతారము.

4. శ్రీమౌలాన మౌల్వీ, సయ్యద్ ఖాసిం అలిసాహెబుగారు. శ్రీనుహు అవతారము (మసీలెనూహు)

5. శ్రీఅబుల్ కలామ్‌గాజి అబ్దుల్‌గనీ సాహెబుగారు. శ్రీ పోతురాజు అవతారము

6. ఈగ్రంధరచయిత శ్రీపండిత్ దివాకర్ ముహమ్మద్ అబ్దుస్ సత్తార్, వర్ధమాన్ మహావీర్‌గారు, శ్రీ హయగ్రీవయవతారము.

ఇట్లు వీరి శిష్యులనేకులలో ప్రవక్తల యంశములు మూర్తీభవించి శ్రీమత్ మహమ్మద్ గారి శాంతి:ఇస్లాం ధర్మప్రచారములో నిమగ్నులై యున్నవి.

ఈసూత్రములను బంధముగా ఇప్పటి యుగసంధిలో అనతికాలములోనే యావద్భారత దేశమంతట శాంతి ఇస్లాం ధర్మము వ్యాప్తించి బోవును. ఇవి బీజాంకురములు. ముమ్మాటికి తప్పవుసుమా !

సైఖురాను, హదీసు ననుసరించి సర్వప్రవక్తలుగూడా అనగా, శ్రీఏసుక్రీస్తు. శ్రీరామ, శ్రీ బుద్ధ, శ్రీకన్ఫ్యూషియస్ మొదలగు ప్రవక్తలు శ్రీముహమ్మద్‌గారిని విశ్వసించి వారిసేవ చేయునంతవరకు వారికి ముక్తి కలగదు. అలాంటప్పుడు శ్రీఏసుక్రీస్తు. శ్రీరామ, శ్రీకృష్ణ, శ్రీబుద్ధ శ్రీవర్ధమాన మహావీరుడు, శ్రీకన్ఫ్యూషియస్, శ్రీజురాష్టర్ మొదలగు ప్రవక్తలను విశ్వసించిన శిష్యులందరుగూడ శ్రీమత్ కళ్యాణస్వరూపమగు ముహమ్మద్‌గారిని విశ్వసించి, వారి సేవచేసె టంతటి వరకు వీరికి ముక్తి కలుగదు, అను అంశమును జ్ఞప్తిలో యుంచుకొనవలెను. దీనికి నేను సాక్ష్యమిచ్చుచున్నాను.

శ్రీమదిఖలాండకోటి బ్రహ్మాండనాయక ఆదినారాయణ దివ్యకళాపరిపూర్ణ సంభవులైన వీరభోగవసంతరాయులు రాజవంశములో జన్మించినారు.

వీరి పిత జయసింగ్‌మహారాజు=విష్ణుయశసః=అమీర్‌హుస్సేన్‌గారు, మాత తిలక మాంబ: అమీనాగారు. వీరి జననము:- క్రీ॥శ॥ 1886 జూన్ 7 సోమవారమునాడు, బాలంపేట గుల్బర్గాజిల్లా హైదరాబాద్ రాష్ట్రములో జరిగినది.

బాల్యావస్థనుండియు వీరు విద్యాశక్తి పారాయణులై యుండిరి. తన 32వ యేట విరాగులై దక్షిణభారతదేశములో బాలబ్రహ్మచారిగా. దేశాటనము చేయుచు, వివిధ పుణ్యక్షేత్ర, మఠ, దేవస్థానములలో నివసించుచు సకలశాస్త్రములలోగల రహస్యములను తెలుసుకొని సర్వవిద్యాపరాయణులైరి. అరబ్బీ, ఉర్దు, పారశీ, పష్తు, పాళి, సంస్కృతము, హిందీ, మరాఠి, ఇంగ్లీషు, కన్నడ మొదలగు భాషలలో అద్వితీయ పండితులైరి.'' 11 భాషలలిపి చదువగలరు.

యుద్ధశాస్త్రము Science of war in Asia and Europe అను రెండు పుస్తకములను వ్రాసిరి. పుస్తకములను అచ్చువేయుటకు అప్పటి బ్రిటిష్‌ప్రభుత్వము అనుమతించలేదు.

వీరి వజ్రశరీరులై, సర్వవేదశాస్త్ర పారాంగతులగుటయేగాక, సాము, మల్లవిద్య మొదలగు సాహసకార్యములలో సాటిలేని మేటివీరులైరి.

పరమాత్మని ప్రేమ అనురాగములలో నిమగ్నులై, తన అగ్రజుడైన జనాబ్ డాక్టర్ హాజరత్ మహబూబ్ హుస్సేన్‌సాహెబ్ గారితో తపస్సును సాగించిరి. పరమాత్ముడు వీరి తపస్సును మెచ్చుకొని అనేక వరములను ప్రసాదించి తన ప్రతినిధిగా నియమించెను.

అల్లాఃసర్వేశ్వరునుండి ధర్మసమైక్యత కొరకు ఆజ్ఞ పొందిరి. కాబట్టి కాలజ్ఞానములలో సూచించిన కాల అవధిలో వీరు తమ అవతారమును 40వ ఏండ్లవయస్సున జగత్తునకు ప్రకటించిరి. కన్నడ ప్రాంతములో వీరి రాకడకు నిరీక్షించుచు, బహుకుతూహలముతో లింగాయత మత గురువులు, " ఇదిగో మనలను రక్షించే శ్రీ చెన్నబసవేశ్వరస్వాముల రాకడ కాలము సమీపించి నది" అని మఠములలో పతాకములను ఆవిష్కరించి ప్రకటనలు చేయుచుండిరి. అట్టి సమయమున లింగాయత మతస్థుల కేంద్రమగు గదగ్ పట్నములో క్రీ. శ. 1924. ఫిబ్రవరి మాసము 7వ తేదీన తన చెన్నబసవేశ్వర అవతార ప్రకటనచేసి ప్రచారముకొరకు నిలబడిరి. అనేకచోట్ల వీరి ప్రమాణము కొరకు అల్లాసర్వేశ్వరుడు మహిమలను నిరూపించి తనదూతయొక్క సాక్షాత్కారమును ప్రజలకు చూపించినాడు.

వీరి మహిమకొరకు ఆకాశగంగ సాక్షి పల్కుచున్నది.

"వ-యౌామ-తషక్కకుస్-సమావు-బిల్‌గమామి-వా-నుజ్జిలల్-మలాయకతు - తంజీల"

(ప్రణయవేదము సూర 25, రుకు 3)

దీని భావము:- మేఘములకొరకు ఆకాశము తెరువబడును. మరియు అనేక దేవ దూతలు నిలబెట్టబడుదురు.

"యనజ్జిలుల్లాహు-ఇజ్జివ-జల్-లహుల్-ఖత్‌రా-మినస్సమాయి" (హదీసెషరీఫ్)

అర్థము:- అల్లాసర్వేశ్వరుడు తన ప్రతినిధి పురుషసాక్షికొరకు ఆకాశమునుండి వర్షమును కురిపించును.

"... ... గంగాధరో ఽ న్ధకరిపుః ... ..."

(ఈశ్వరనామములు-అమరకోశము)

"కరుదాను మళె గళను కై లాసదింద బసవణ్ణా ॥"

(కన్నడ కాలజ్ఞానము పుట 29 మహానేశ్వర)

పై శి 4 వాక్యముల సారాంశము:- ఈశ్వరుడు గంగధరించినాడనే సాక్షిగా ఈశ్వర అవతారుడైన అయోనికల్కి అవతార్ కొఱకు ప్రార్థన లేకనే వర్షములు కురియును.

కన్నడ కాలజ్ఞానములో మహానేశ్వరస్వాములు సూచించునదేమనగా ఈశ్వర అవతారుడగు చెన్నబసవేశ్వరుడు వచ్చినప్పుడు తనరాకడ సాక్షిగా వర్షములు కురిపించును.

వీరి అనేక మహిమలలో యిదియొక పెద్దమహిమ. వీరి ఒక ఊరినుండి మరొకయూరికి పోయిన 24 గంటలలోనే పుష్కలముగా వర్షములు కురియును. అనేకమంది భక్తులు ఈ మహిమను కండ్లారచూచి వీరి శిష్యులైనారు. కన్నడ ప్రాంతలో లింగాయత మతగురువులు, మఠాధిపతులు వీరి శిష్యులైరి.

వీరు కన్నడదేశము గదగ్‌పట్నమునుండి పరిసరప్రాంతములకు తన ప్రచారమును విస్తరింపజేయ సాగిరి. అనేక భక్తులకు భగవంతుని మహిమలను చూపెట్టిరి. ఈ మహాపురుషుని తూర్యావస్తలో దర్శించి, అసుండి పటేల్‌సాహెబ్‌గారు వీరికి మొదటి శిష్యులైరి.

మైసూరు దేశములో తన ప్రచారమును విస్తరింపజేయుటకు ప్రారంభించెను. మైసూరు దేశములో వీరికి అనేకులు శిష్యులైరి. ప్రకటనలద్వారా, గ్రంథములద్వారా ప్రచారమును ఇనుమడింపజేసిరి.

తదనంతరము హైదరాబాద్ పట్నమునకువచ్చి జగద్గురు ఆశ్రమమును స్థాపించిరి. క్రమముగా అనేకులు వీరిని ఆశ్రయించి శిష్యులైరి.

1. వీరి మొదటి వివాహము కన్నడ ప్రాంతము తాళికోట గ్రామములో (బిజాపుర జిల్లా) జరిగెను. భార్యపేరు శ్రీమతి జైనబ్బీ, గౌరిదేవి:- పురాణములలో కనపర్చిన ప్రకారముగా శ్రీమతి గౌరీదేవి. ఈ మహాపుణ్యవతికి ఒక కుమార్తె కలిగెను. కుమార్తె పేరు జనాబా తాహెరా బేగం. మొదటిభార్య 5 సంవత్సరముల తరువాత స్వర్గస్తులైరి. (ఆమె ఆత్మపై పరమాత్ముని అనుగ్రహముండుగాక)

2. వీరి రెండవభార్య:- వీరి వివాహము బసవనగుడి బెంగుళూరు పట్నములో జరిగెను. ఈమె పేరు శ్రీమతి తాజ్‌దార్ బేగం (గంగేశ్వరి కాలజ్ఞాన శాస్త్రప్రకారముగా) వీరికి నలుగురు పుత్రులు, నలుగురు కుమార్తెలున్నారు.

3. మూడవభార్య:- వీరుకూడ రామదుర్గ గ్రామము (బెల్‌గామ్) వాస్తవులే. వీరి నామధేయము శ్రీమతి హాజరాబేగం (పార్వతీదేవి-కాలజ్ఞాన ప్రకారముగా) వీరికి ఒక కుమారుడు ఒక కుమార్తె యున్నారు. కుమారుని పేరు శ్రీమాన్ సైయ్యద్ అమానత్ హుస్సేన్ సాహెబుగారు! కుమార్తెపేరు శ్రీమతి జాహిదాబేగం.

4. నాల్గవభార్య:- వీరు బెంగళూరు వాస్తవ్యులు. పేరు శ్రీమతి ఫాతిమాబేగం. (శ్రీ కాళికాదేవి-కాలజ్ఞాన ప్రకారము) వీరికి ఒక కుమార్తెయున్నది.

ఈయుగపురుషుడగు అయోనికల్కి అవతార్ శ్రీ వీరభోగవసంతరాయుల కుటుంబమును దర్శించి సంతోషింపుడు.

జగద్గురు (ఖాన్ ఖాహె సర్వరేఆలం) ఆశ్రమముయొక్క వివరములు :-

ఈఆశ్రమము హైదరాబాదు పట్నము ఆసఫ్‌నగర్‌లో యున్నది. ఈ ఆశ్రమములో 150 ఇండ్లు వున్నవి. ఇందు ధర్మప్రచారముచేయు శిష్యులకు కుటుంబాలున్నవి. ఇచ్చట పురుషుల నొకటి, స్త్రీలకు ప్రత్యేకముగా ప్రార్థనాలయములు (మసీదులు) గలవు. జగద్గురు పేరిట నొక గ్రంథాలయము (Lil rary) పఠనాలయములు (Reading Room) గలవు. ఇందు శాస్త్రీముల గ్రంథములున్నవి. సర్వులువచ్చి పఠించుటకు అవకాశములున్నవి.

ఆశ్రమములో ప్రతిదినము సాయంకాలము 7 గంటల నుండి 9 గంటల వరకు పవిత్ర ఖురాను, హదీసులు, వేదఉపనిషత్తు శాస్త్రీముల జ్ఞానబోధము జరుగును. సర్వమతస్థులు స్వేచ్ఛగా ఇందులో పాల్గొనవచ్చును. అతిథి, అభ్యాగతులకు సత్కారములు జరుగును. వీరికి ప్రత్యేకముగా వంటశాల (లంగర్‌ఖాన) కూడయున్నది.

## అధ్యాయము 9

### జగద్గురువు ఆశ్రమముయొక్క కార్యవర్గము

1. సమాజాధ్యక్షులు:- శ్రీ అబుల్ బురహాన్ మౌలాన సయ్యద్ ఖాసిం సాహెబ్‌గారు శ్రీగణంగళు.
2. జనరల్ సెక్రటరీ:- శ్రీ మౌలానగాజి మహమూదుల్ ఖురేషిసాహెబ్, శ్రీ వీరభద్రావతారము.
3. సెక్రటరీ:- మౌలాన జుల్‌మారిజ్ సయ్యద్ రసూల్ సాహెబ్, శ్రీ కేశవ అవతారము.

## ఆశ్రమముయొక్క ఆశయములు

ఈ ఆశ్రమము కేవలము ధార్మికసమాజము. (Spiritual body) దీనియొక్క ముఖ్యోద్దేశ్యము జగత్తులోయుండే సర్వధర్మ శాఖల సమ్మేళనము. విశ్వశాంతికొరకు పంచశాంతి సూత్రములను కార్యరూపములో తెచ్చుటకు తన, మన, ధనము లర్పించుట.

## విశ్వకళ్యాణ పంచశాంతి సూత్రములు

**Five fundamental principles for the establishment of universal peace :**

1. అల్లాహ్ సర్వేశ్వరుని ఏకత్వమును విశ్వసించుట. ఇస్లాం ధర్మములో తౌహీద్ అందురు.

2 పరమాత్ముని సర్వప్రవక్తలను, అవతారపురుషులను విశ్వసించుట. వేదఋషులు శ్రీకృష్ణుడు, శ్రీరాముడు, శ్రీబుద్ధభగవానుడు, జైనమతస్థాపక శ్రీ వర్ధమాన్‌మహావీరుడు. పార్శీక మతస్థాపకుడు శ్రీ జురాష్టర్, చైనాదేశ ప్రవక్త శ్రీ కన్‌ఫ్యూషియస్ ఇస్రాయేలు వంశీయప్రవక్తలు అనగా శ్రీమోజెస్, శ్రీయేసుక్రీస్తు, శ్రీజోసెఫ్ ఇత్యాదులను విశ్వసించుటయేగాక "గురుణాంగురుః ప్రవక్తలాధిపతి ముద్రగురువులగు శ్రీమదఖిలాండకోటి బ్రహ్మాండనాయక కృపాసాగర ఆది నారాయణ దివ్యకళా పరిపూర్ణులైన స్వరాట్ విశ్వకళ్యాణ స్వరూపుడగు శ్రీ ముహమ్మద్‌గారిని విశ్వసించుట.

(ప్రమాణము, ప్రణవవేదము, సూర 3, రుకు 9 చూడుడు)

3. సర్వదేవోక్త గ్రంథములను విశ్వసించుట :- చతుర్వేదములు, ఉపనిషత్తులు, భగవద్గీత, శివగీత, బుద్ధభగవానుని త్రిపీటిక, జొరాష్టర్ ప్రవక్తయొక్క జిందావస్త, పవిత్రబైబిలు (పాత-క్రొత్త నిబంధనలు) ఇత్యాదులను విశ్వసించుటేగాక, సర్వదేవోక్త గ్రంథసారమై దేవుని అంత్యసందేశమగు పవిత్ర ఖురానువేదమును విశ్వసించుట.

ఈ పవిత్రగ్రంథముల సారమును సర్వ మతప్రజలకు ప్రబోధించి, తద్వారా మానవులలో సహజమైన శాంతి నెలకొల్పుట.

4 సర్వమతస్థులను సంఘటితపర్చి, సర్వేశ్వరుని మానసికపూజ సల్పించుట:- ఈ దైవిక ప్రార్థనలో, విశ్వములోయుండే సర్వ మతశాఖ భక్తులపూజలు చేరియున్నవి.

5. అస్పృశ్యతా నివారణ :- సర్వమానవులు సర్వేశ్వరుని దృష్టిలో సమానులై యున్నారు. ప్రవక్తలు, ప్రవాదులు, ఋషులు, మునులు, అవులియా అల్లాహ్లు అతని సన్నిధిలో గౌరవనీయులు, వారి నందరిని మనముకూడ గౌరవించవలెను. మానవుని ఆత్మాభివృద్ధి పథక

ములో ఆటంకములను కలుగచేసే వర్గ, వర్ణ, కులగోత్ర, దేశ, భాష, రాష్ట్రమున్నగు అభిమానములను తొలగించుట.

ఈ దైవిక పంచసూత్రములను జగత్తులో కార్యరూపమునఁ బెట్టుటకు సర్వేశ్వరుడే తన ప్రతినిధి అయోనికల్కి రూపమైన శ్రీ వీరభోగవసంతరాయులను నిలబెట్టినాడు. ఈ యుగ సంధిలో ఈ కార్యమును సాధించుటకు పరమాత్మునిపక్షము వహించి, ధర్మ పరిరక్షణకొఱకు శ్రీ మదఖిలాండకోటి బ్రహ్మాండనాయక సూర్యనారాయణ దివ్యకళాపరిపూర్ణ సంభవులైన శ్రీ మద్విరాట్ వీరభోగవసంతరాయులు వేంచేసియున్నారు. వీరిద్వారనే జగత్ శాంతి కల్గును గాని యెట్టి శక్తివంతుడైనప్పటికి కూడ లౌకిక ప్రముఖులద్వార సాగనేసాగదు.

అనాదికాలమునుండి ఆసియా ఖండమునందలి పుణ్యభూమియగు భారతదేశములో యెన్నెన్నో మతశాఖలు పుట్టి పెరిగి అభివృద్ధిచెంది ప్రపంచకీర్తిని సంపాదించినవి. యావద్భారత దేశమంతటా యుండే సర్వ మతశాస్త్రములు ఒక నిర్ణీతమైన కాలఅవధియగు కలియుగ 5000వేల సంవత్సరములనే సూచించుచున్నవి. కలియుగము 5000కు సంవత్సరముల తదుపరి అవధిని సూచించుటలేదు. ఎందుకనగా ఈ శాస్త్రములు భారతీయులను నేటివరకు రక్షించినవి. ఇకముందు రక్షింపజాలవు. కావున ఈ యుగసంధిలో సర్వ మతశాఖలు శాంతి సముద్రరూపమగు ఇస్లాం మతములోనే లీనమగునని, వెనుకటి సర్వధర్మ శాస్త్రవేత్తలు సూచించినారు. శ్రీ మద్విరాట్ పోతులూరి వీరబ్రహ్మంగారు ఈ క్రిందివిధముగా వ్రాక్రుచ్చినారు.

"ఆకాశ మెట్టుమాను, ఆరుమతము లొక్కటౌను"

(శ్రీ వీరబ్రహ్మముగారి వచనకాలజ్ఞానము పుట 1)

యావద్భారతదేశములో యుండే వైదీక, బౌద్ధ, జైన, పారశీక, శైవ, లింగాయత, శిఖ్ఖు, క్రైస్తవ, మతశాఖలన్నీ కృపాసాగరడగు శ్రీ హాజరత్ ముహమ్మద్ద్వార అల్లాఃసర్వేశ్వరుడు తన విశ్వవ్యాపక మతమును పూర్తిజేసిన శాంతి సముద్రమగు ఇస్లామునందే ఏకమౌను.

## శ్రీ గురుదేవు రామకృష్ణపరమహంస జీవిత చరిత్రములోని కొన్ని సుభాషితములు.

1. "సమగ్రమైన సత్యజ్ఞానము తుదకు ప్రపంచములోగల సర్వజాతులకును, మతములకును, నెట్లు సామరస్యమును చేకూర్చగలదో ఇంచుక బుద్ధి కుశలతతో యోచింపగల యందఱకును విశదము కాగలదు."

2. మహమ్మదీయ మత సాధనమూలమున శ్రీ గురుదేవునకు గలిగిన భగవత్ సాక్షాత్కారము హిందూదేశమునకు విశేషలాభకరముగ నుండగలదని తోచుచున్నది.

3. "శ్రీ గురుదేవునివంటి వైదికోత్తముడు మహమ్మదీయ మతసాధనను జయప్రద ముగా నాచరించి యుండుటనుబట్టి ఈ యుభయజాతుల నడుమగల అంతరము లెప్పుడో యొక నాడు సమసిపోయి సోదరులవలే వారొకరికొకరు ప్రేమసఖ్య భావములతో నాదరించగలుగుదురను ఆశ పొడముచున్నది. ఇందలి యదార్థమును కాలమే నిర్ణయింపగలదు."

["శ్రీ రామకృష్ణ లీలామృతము" అను గ్రంధము పుట (1) 378; (2) 283; (3) 283లు శ్రీ రామకృష్ణమఠము, బ్రాడీస్‌రోడ్డు, మైలాపూర్, మద్రాసు ముద్రణ 1933.]

1. "సామరస్యము" :- సర్వ జలప్రవాహముల సామరస్యము సముద్రములోనే చేకూరును అటులనే సర్వ జల ప్రవాహములవంటి సర్వ మతశాఖలు సముద్రరూపమగు ఇస్లాము మతములోనే సమావేశమగును.

2. "మహమ్మదీయ మతసాధనమువలన విశేషలాభకరము" :- మహమ్మదీయ తమ (ఇస్లాం ధర్మము) సాధనములో మానవుని శ్రేయోభివృద్ధికి అరికట్టే విగ్రహారాధన, జంతువుల, జల, ప్రవాహముల, చెట్టు, గుట్టల, పుట్టల ఆరాధన మానవహృదయములనుండి తొలగించబడును. ఈ మహత్తు శ్రీ ముహమ్మద్‌గారి ప్రవక్తతత్వ విశ్వాసములోనే యున్నది. కాబట్టి వీరి విగ్రహముగాని, ఫొటోగాని కనపడదు. ముందుకూడ రాజాలదు.

3. "అంతరము... కాలమే నిర్ణయింపగలదు" :- నేటికి 1380 సంవత్సరముల క్రితము శ్రీ కృపాసాగర ముహమ్మద్‌గారు అరబ్బు, పర్షియా, ఇరాక్, టర్కీ సిరియా, ఈజిప్టు, మొదలగు దేశములలో యుండిన వివిధ మతశాఖల భక్తులను సముద్రరూపమగు ఇస్లాములో ఐక్యపచ్చి, శాంతిని స్థాపించి, ఆ దేశస్తులను పరిరక్షించినారు.

కృత, త్రేత. ద్వాపర, కలియుగాల్లో అవతరించిన సర్వప్రవక్తలు. ప్రవాదిలు, ఋషులు, మునులు, భక్తులు, యోగీశ్వరులందరు, కలియుగ 5,000ల సంవత్సరములకు అయోని కల్కి అవతారపురుషు డుద్భవించి, సర్వ మతశాఖల భక్తులను శాంతి ధర్మములో సమావేశ పరచి, సర్వ ధర్మములను సర్వవిధాలుగా రక్షించును, యని శుభవార్త యిచ్చియున్నారు. ధర్మ రక్షకుడైన పరాత్పరుడు నిర్ణీతకాలమగు ఇప్పుడు అయోనికల్కి రూపుడగు శ్రీ వీరభోగవసంత రాయులను తన కార్యముకై నియమించినాడు, ఈ కార్యము వేదోక్తముగా సాగుచున్నది. శ్రీ గురుదేవు రామకృష్ణపరమహంసలు, వారి అనుచరులు ఆశించిన ధర్మకల్యాణము సర్వత్ర పూర్తియగును. ఇందులో లేశమాత్రము సంశయము లేదు.

## ఇకముందు జరుగు ధర్మపరివర్తనాంశములు

1. శ్రీమత్ కల్యాణస్వరూప, కృపాసాగర, ఆత్మసూర్యనారాయణ, సర్వప్రవక్త బీజరూప, స్వయంభో స్వప్రకాశక శివదేవేశ, విశ్వేస, భూతేశ, వ్యోమకేశ, గణేశ, జగన్నాధ,

రంగనాథ, బదరీనాథ, సోమనాథ. తిరుపతి వెంకటేశనాథ, గురునాథ, కేదారనాథ, కమలనాథ వైకుంఠనాథ, లక్ష్మీనాథ, పద్మనాథ, సర్వలోకైకనాథ, రామనాథ, ద్వారకనాథ, రామేశ్వర రాజేశ్వర, సోమేశ్వర, జగదీశ్వర, సంగమేశ్వర, ముక్తీశ్వర, బక్కేశ్వర, సుబ్రహ్మణ్యేశ్వర, వాసుదేవ, మహాదేవ, ప్రమథాధిప, శూన్యసింహాసనాధిపతి, సప్తస్వర్గఆరోహక, యేసుక్రీస్తుపిత, మృత్యుంజయ, భక్తవత్సల, సర్వలోకైక జగద్గురు శ్రీసాక్షాత్ నారాయణ స్వరూపియైన శ్రీ ముహమ్మద్ ప్రవక్తతత్వములోనే సర్వప్రవక్తల జ్యోతికిరణముల ఆకర్షింపబడినవి. కాబట్టి జగత్ప్రవక్తలల్లోకెల్ల వీరొక్కరే సాటింపు చేసినది ఏమనగా, "నేను సర్వప్రవక్తలకు పీతా మహుడను. నాఆత్మీక పుత్రులగు సర్వప్రవక్తలను మానవులందరును విశ్వసించియే తీరవలయును ఈకార్యనిర్వహణకు నాసర్వశక్తులు ధారపోసి, అల్లాఃసర్వేశ్వరుని స్తోత్రమును స్థిరపరచినాను." (ప్రణయవేదము సూర 3 రుకు 9 చూడుడు)

కాబట్టి నిజహృదయ ధ్యానగోచరమయిన ముహమ్మద్‌గారిని విశ్వసించినంత మాత్రము చేత ఇతర ప్రవక్తల విశ్వాసము నసింపుకాదు. పరిరక్షింపబడును. అయితే యితర మతప్రచారములు యిలాగుకాదు. ఉదా:- క్రైస్తవ ప్రచారకులు చేయునదేమనగా ఒక శ్రీరామభక్తుడు ఒక కృష్ణభక్తుడు, ఒక బౌద్ధభక్తుడు ఉన్నప్పుడు ఈభక్తుల హృదయలందుండే శ్రీరామ, శ్రీకృష్ణ శ్రీబౌద్ధభక్తిని, వదలివేయించి శ్రీయేసుప్రభుభక్తిని స్వీకరింపజేస్తారు. ఇది కేవలము రాజకీయ ఉద్దేశ్యములతో కూడిన దుష్ప్రచారముగా తోచుచున్నదే గాని మతశాసన సమ్మతమైన మత ప్రచారముగాదు. ఇట్టి దుష్ప్రచారకులపై ఆల్లాఃసర్వేశ్వరుని ఆగ్రహము యుండుగాక! ఇట్టి ప్రచారమును అల్లాఃసర్వేశ్వరుడు సహింపజాలడు. వీరిని తప్పక శిక్షించుగాక!

"ఆయన (శ్రీయేసుప్రభువు) ఇస్రాయేలు ఇంటివారై, నసించిన గొర్రెలయొద్దకే నేను పంపబడితిని గాని, మరి యెవరి వద్దకును పంపబడలేదనెను. అయినను ఆమె వచ్చి ఆయనకు మ్రొక్కి "ప్రభువా! నాకు సహాయము చేయమని" అడిగెను. అందుకాయన "పిల్లలరొట్టె తీసి కొని కుక్క పిల్లలకు వేయుట యుక్తము కాదనిచెప్పగా ... ..."

(మత్తయి 15 అధ్యాయము వాక్యము 21 నుండి 27వరకు)

పై మత్తయి బైబిలు చూడుడు. ఇందు యేసుప్రభువులు ఒకేజనాంగమగు యిస్రాయేలు సంతతికే పంపబడి యుండెను గాని, ఇతరుల సంతతి వారికి పంపబడలేదనే విషయమును స్పష్టముగా చెప్పినారు. పై వేదోక్త ఆజ్ఞలను ఉల్లంఘించి యితర కులస్థులందరకు ప్రచారము చేయుట శ్రీయేసుక్రీస్తుల మనస్సును నొప్పిగల్గించినట్లు అగుచున్నది.

శ్రీయేసుక్రీస్తు చాటించున దేమనగా "లోకాధికారి (సర్వశేఆలం పగత్ + నాథ = జగన్నాథ) ఆదరణకర్త (రహమతుల్లిల్లాలమీన్, కృపాసాగర. (The comofrter) వచ్చునిని చెప్పినప్పటికిని లోకాధికారి, జగన్నాథ, అదరణకర్త, కృపాసాగర మగు శ్రీ ముహమ్మద్‌గారిని

విశ్వసించక, శ్రీ యేసుక్రీస్తుల వాక్యమును తిరస్కరించినారు. ఇప్పుడు ప్రచారముచేయు క్రైస్తవ భక్తులు నిజముగ వారి విశ్వాసులు కానేకారు.

ఒక బౌద్ధప్రచారకుడు ఇతర ప్రవక్తల విశ్వాసమును తుడిచిపెట్టి బౌద్ధ ప్రవక్త విశ్వాసాన్ని స్వీకరింపజేస్తాడు. ఇట్టివి మతమార్పు ప్రచారములు. అయితే కృపాసాగర శ్రీ మహమ్మద్‌గారికే సర్వమత ప్రచారము చేయుటకు సర్వేశ్వరుడు ఆజ్ఞ యిచ్చినాడు.

"ఖుల్-యా-అయ్యుహన్నాస్-ఇన్ని-రసూలిల్లాహి-ఇలైకుం-జమియ"

(ప్రణవవేదము)

అర్థము:- అల్లా లోకరక్షకుడు తన ప్రియప్రవక్తకు ఆజ్ఞ యిచ్చినాడు "ఓయీ నా ప్రియప్రవక్తా! నేను సర్వ జనాంగముల మానవులకు ఏకైక ప్రవక్తగా వచ్చినారని చాటింపుము"

వీరి ప్రచారములోని యదార్థమేమనగా శ్రీరామ, శ్రీకృష్ణ, శ్రీ బౌద్ధ, శ్రీ ఏసుక్రీస్తుల విశ్వాసములను స్థిరపరచి, తనను సర్వప్రవక్తల అధిపతిగా వచ్చినాననే అంశమును ధృవీకరిస్తారు. ఇది మతమార్పు కాదు. సర్వధర్మసమ్మేళనము. భూమిపై ప్రవహించే సర్వజలప్రవాహములు సముద్రములో సమావేశమై తమలోయుండే దుర్గంధమును పోగొట్టుకొని, పరిశుభ్రావస్థను పొంది, శాంతి సముద్రములో సుఖించును. అటులనే వివిధప్రవక్తల భక్తులు శ్రీకృపాసాగర మహమ్మద్‌గారి విశ్వాసప్రభావముచేత, తాముచేసే అనిష్టకరమైన విగ్రహారాధనను పోగొట్టుకొని శాంతి సముద్రమగు శ్రీ మహమ్మద్‌గారిలో లీనమై, పరమాత్మునిలో ఐక్యమై, ఆనందాబ్ధిలో సర్వదా సుఖింతురు.

దైవోక్త గ్రంథమగు ప్రణయవేదము

The last word of God, The glorious Khuran;-

ఒక బాలునకు M. A. పట్టభద్రుని చేసేటందుకు, మొట్టమొదట ప్రాథమిక పాఠశాలలో చేర్పింతుము. అచ్చట బడి పంతులుగారు, అ, ఆ, ఇ, ఈ... ...అక్షరమాలతో బోధన ప్రారంభించును. క్రమేపి 1 నుండి 11 తరగతుల వరకు విద్యాభ్యాసము జరుగును. తదుపరి ఉన్నత కళాశాలలో F. A., B, A,లు అంతములో M. A. పట్టభద్రుడగును. ఈ M. A. డిగ్రీ పొందుటకు విశ్వవిద్యాలయమనగా విశ్వములోయుండే సర్వులకు సర్వవిద్యలు నేర్పబడుస్థానము, కాని M. A. డిగ్రీ చదివించుటకు ఏడుయేండ్ల బాలుని యూనివర్సిటీలో చేర్చరు. ఎందుకు?

అటులనే అల్లాఃసర్వేశ్వరుడు ఆత్మికవిద్య నేర్పేటందుకు శ్రీఆదము, శ్రీనూహు, శ్రీఏసుక్రీస్తు. శ్రీకోదండరాములు, శ్రీకృష్ణులు, శ్రీబుద్ధభగవానుడు మొదలగు వారిని, పంపెను. బడిపంతులు అ, ఆ అక్షరముల నేర్పునటులనే వీరు ఆయాయుగములలోని మానవులకు ఆత్మిక విద్య

భోగ్యనేము చేసి S. S. L. C., F. A., B. A. చదివించి ఆత్మీక విశ్వవిద్యాలయమును యిడకముందు కలియుగములో శ్రీ కల్కి అవతార పురుషునిద్వారా యేర్పడునని చాటింపు చేసినారు.

ఆత్మీక విశ్వవిద్యాలయమునకు అధికారిగా శ్రీ ముహమ్మద్‌గారు తమ కాలములో "నాకీయబడిన ధర్మము, సర్వజనీక ఇస్లాం శాంతిధర్మము, అనగా యూనివర్సల్ రిలిజియన్ (Universal Religion) బోధించుటకు వచ్చినాను. నాకీయబడిన గ్రంధమగు ఖురాను వేదము విశ్వములోని సర్వమానవులకు ఆత్మీక ఉన్నతోన్నత పదాంతముల అభివృద్ధికొఱకు వచ్చినది." అని ఉద్ఘాటించినారు.

అంత్యములో మాత్రమే యూనివర్సల్ రెలిజియన్ అనగా విశ్వవ్యాపక ధర్మము వస్తుందిగాని, ఓం ప్రథమములో రాజాలదు. దీనికి అనేక నిదర్శనములున్నవి.

ఖురాను వేదము (ప్రణవ వేదము)లో మానవుని సర్వ కార్యరంగాల సూత్రములున్నవి. ఒక సర్వసామాన్య మానవుడు, ఒక కర్షకుడు, ఒక వర్తకుడు, ఒక ధనవంతుడు, ఒక భూస్వామి, ఒక యోధుడు, ఒక సేనానాయకుడు, ఒక రాజు, ఒక మంత్రి, ఒక తత్వవేత్త, ఒక విరాగి, ఒక శాస్త్రవేత్త, ఒక భర్త, ఒక భార్య, ఒక పుత్రుడు, ఒక శాఖాహారి, ఒక మాంసాహారి, ఒక వైద్యుడు, ఒక ధర్మప్రచారకుడు, ఒక ఉపవాసకుడు, తన, మన ధనములను అర్పించు ఒక త్యాగమూర్తి మొదలగు సర్వమానవులకు సక్రమమైన సూత్రములనొసంగి, చక్కని మార్గము చూపెట్టు గ్రంధరాజము పవిత్రమైన ఖురాను (ప్రణయ వేదము) ఒక్కటేగాని మరేధార్మిక గ్రంధము కాదు.

పవిత్ర బైబిల్ ఒక యుద్ధయోధునకు సూత్రములను చూపెట్టజాలదు. ఒక రాజునకు రాజశాసనములను చూపెట్టదు. ఇందులో యుద్ధరంగ సూత్రములు లేవు. శ్రీ బుద్ధభగవానుని "త్రిపీటిక" గ్రంధముకూడ యింతటి శక్తి కలది. ఈ కలియుగములో ఈ గ్రంధములు పురుషుని సద్గుణసంపన్నునిజేయు వీర్య, శౌర్య సాహసకార్యములకు యేవిధముగానైనను తోడ్పడజాలవు.

శ్రీకృష్ణుని భగవద్గీత భార్యాభర్తలకు సంబంధించిన సూత్రములను యేమాత్రము చూపెట్టజాలదు. వితంతు వివాహము, విడాకుల నిబంధనలు, పితృని ఆస్తిలో కుమార్తెకు కలుగు హక్కు మొదలగు సంఘశ్రేయస్సునకు సూత్రములు లేవు. ఇందులో సర్వజనీకమైన ప్రార్థనా సూత్రములు కనబడవు. ఈ గ్రంధము కేవలము అప్పటి ద్వాపరయుగ క్షత్రీయులకు సహకరించినదే గాని యిప్పటి సర్వమానవుల శ్రేయోభివృద్ధికి ఉపకరింపజాలదు. అందుకనే శ్రీకృష్ణులు ఈ క్రింది విధముగా చెప్పినారు.

శ్లో॥ శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః ॥

(భగవద్గీత)

శ్రీకృష్ణులు "నేను క్షత్రియ ధర్మము నుద్ధరించుటకు వచ్చినానేకాని ఇతర ధర్మముల కొఱకు రాలేదు. అంత్యప్రవక్తయగు శ్రీ అయోనికల్కి అవతారపురుషుడు సర్వధర్మానుద్ధరణకు వస్తా" రని సూచించినారు.

(భారతము, అరణ్యపర్వము, భాగవతము ద్వాదసస్కంధము)

ఇలాగుననే కృత, త్రేత, ద్వాపరం కలియుగ ఓంప్రథములో అవతరణమైన దైవోక్త గ్రంథములు యిప్పటి కలియుగమానవులకు సంపూర్ణమార్గమును యేమాత్రము చూపెట్టజాలవు.

అయితే ఏకైక గ్రంథరాజమైన ఋగ్యజుస్సామాథర్వవేదంబుల స్వరూపమగు ప్రణవ వేదము ఖురానేకరీం తాత్విక, సాంఘీక, నైతిక, మానసిక, సాత్విక, రాజకీయ, రణరంగీక మొదలగు సర్వరంగాలకు చక్కని అమృతోపేతమైన దైవీక సూత్రములనొసంగి మానవులను, ఆత్మపదాంతముల ఉన్నతోన్నత అంతస్తులకు అభివృద్ధిపర్చును

కాబట్టి ఈయుగసంధిలో భారతదేశమంతటా సర్వమతభక్తులందరకును, నచ్చచెప్పుటకు అయోనికల్కి అవతార్ శ్రీ వీరభోగవసంతరాయులు వేంచేసియున్నారు.

విశ్వసమ్మేళన మహామంత్రము: లాఇలాహ, ఇల్లల్లాహు, మహమ్మదుర్-రసూలుల్లాహి:-

కృపాసాగర (రహమతుల్-విల్-ఆలమాన్) మేఘవర్ణుడు (సర్ ఫర్ బాదిల్ రఖనేవాలా) దేవాదిదేవుడు (సయ్యదుల్ ముర్సలీన్) హిరణ్యాగర్భుడు (గంజె-మఖ్ఫీ-కా-నూర్ వాలా) శుక్లాంబరధరుడు (సుఫేద్-చద్దర్-ఓడ్ నేవాలా) పీతాంబరాధరుడు (సున్హేరిరంగ్-కే-కపడే-ఓడ్ నేవాలా) గంగాధరుడు (నబూవత్-కా తాజ్ వాలా) దీర్ఘకేశాధరుడు (గేసుదరాజ్ వాలా) పుండరీకాక్షుడు (కమల్-జైసే-ఆంక్-రఖనేవాలా) జనార్ధనుడు (సారె-ఇన్సానో-కా- జికిర్ వాలా) పితామహుడు (అబుల్ అంబియా) లోకేశ్వరుడు (సర్వారే-ఆలం) చతుర్ముఖుడు (చార్-ఖలీపెవాలా) అబ్జయోనుడు (ఆఖరీ-కలాం-ఇలాహి-సె-ఖడేహోనేవాలా) కమలోద్భవుండు (ఇన్సానోకే దిల్ మెహర్ నేవాలా) పురాణపురుషుడు (ఖదీమ్-బషర్) యజ్ఞపురుషుడు (ఖుర్బానీ కర్నేవాలా) నరకాంతకుడు (దోజఖ్-సే-బచానే-వాలా) సురజ్యేష్టుడు (అఫ్జలుల్-అంబియా) దాతవిదాతడు (జరియే-ఫజల్-కర్ నే-వాలా) పూర్వోనిధుడు (ఖదీం-నూర్-వాలా) సత్సోహంసవాహనుడు (హాఖ్-కే-పరిందే-ఫర్-సవార్-హోనేవాలా) మృత్యుంజయుడు (హయాతున్నబి) సర్వవ్యాపిః (రూయే_జమీన్-కె-నబీ) విశ్వజగద్గురు (సర్వారే-ఆలం) గురుణాంగురుః (ఖాయదుంముర్సలీన్ ముద్రగురువు (ఖాతమున్నబీన్) శ్రీమద్ స్వరాట్ విశ్వకర్మ, విశోద్ధారక (కాఫతుల్ లిన్నాస్) అఖిలాండకోటి బ్రహ్మాండనాయక (సర్వారేకాయనాత్) ఆదినారాయణ (అజలీ-ఆబెహాయాత్ రఖనేవాలా నబి) దివ్యకళాపూర్ణ (ముబారక్-ముకమ్మిల్-నూర్ వాలా) పరమాత్మస్వరూప అల్లాః-కె-మిసల్) శ్రీహజరత్ మహమ్మద్ గారి, సూర్యసహస్రాణం తేజోరాసి, సమద్వితీయమగు (ఏక్ హజార్-సూరిజ్-కే-నూర్ వాలా) సర్వమంత్రోచ్ఛేదన (సారేకల్మో-కె-మాలిక్) సర్వ

పాపహరి (సారెగునాహోకుధోనేవాలా) మహత్కర మహామంత్రం (అఫ్-జలుల్-జికర్) "లాఇలాహా-ఇల్లల్లాహు-ముహమ్మదుర్-రసూలుల్లాహి" యొక్క మహిమ.

పై కనపరచిన మంత్రముయొక్క ఉదాహరణ ఒక వృక్షము మోస్తరుఉన్నది. బీజము భూమిలో దృష్టికి అగోచరమై, తనలో అంతర్గతముగాయున్న సర్వభాగములను అనగా వ్రేళ్ళు, మ్రాను, రెమ్మలు, కొమ్మలు, లెక్కలేనన్ని ఆకులను బహిరంగపరచి తానే అంత్యములో ఫల రూపములో వచ్చును. అటులనే వైదీకపురుషుల మంత్రములు, శ్రీ నరసింహ, శ్రీ కోదండరామ, శ్రీకృష్ణ, శ్రీ ఏసుక్రీస్తు, శ్రీ బుద్ధభగవానులు:- వీరి మంత్రములు వృక్షముయొక్క కొమ్మలు, రెమ్మలు, ఆకులరూపములో యున్నవి. అంత్యప్రవక్తయొక్క అంత్యమంత్రము బీజరూపముగా "లాఇలాహ - ఇల్లల్లాహు - ముహమ్మదుర్ - రసూలుల్లాహి" రూపములో వచ్చినది. బీజములో వృక్షముయొక్క సర్వభాగములు రక్షింపబడుతవి. అటులనే "లాఇలాహ-ఇల్లల్లాహు-ముహమ్మదుర్-రసూలుల్లాహి" అనే బీజ మంత్రములో సర్వప్రవక్తల మంత్రములు రక్షింపబడినవి. కాబట్టి ఈ మంత్రపఠనముచేత సర్వప్రవక్తల జీవితచైతన్య కణములు పరిపక్వమై అష్టైశ్వర్యముల ఆత్మ పదాంతములు ప్రాప్తించును. దీనినే సంస్కృతములో శ్రీ కల్కిపురుషుని కల్పవృక్షమందురు. అరబ్బీలో సిద్రతుల్-ముంతెహ" అందురు. కాబట్టి ఈ కలియుగములో ఆయుర్యశోధన స్వర్గ సుఖాదిపురుషార్థ ప్రదంబైయుండు నీ ముక్తిమంత్రమును పఠించవలెనని మా ప్రార్థన.

శ్రీ ముహమ్మద్‌గారి మహత్యములను, కార్యరూపములో పెట్టించి యావద్భారతీయు లందరినీ ఆత్మీకముగా ఉద్ధరించుటకు శ్రీ మద్విరాట్ వీరభోగవసంతరాయులు వేంచేసియున్నారు. ఈ మహామంత్రమును సర్వ మతశాఖ గ్రంథములలోకూడ పూర్వీకులందరు సూచించియున్నారు. ఇప్పుడు దాని రహస్యమును బయుటపెట్టుచున్నాము. ఈ మహామంత్రము ద్వారానే కాలజ్ఞాన ములో సూచించినట్లు ఆరు మతశాఖలన్నీకూడ ఏకమౌను. ఇది పరమాత్ముని సంకల్పము. ఎవ రడ్డుకొనిన, యెన్ని ఆటంకాలు కల్పించిన ఈ మహామంత్రముయొక్క వ్యాపకము ఆగజాలదు. విశ్వసించిన వారందరు పరమపురుషు లగుదురు, తిరస్కరించినవారు పరమాత్మునిచే దండింప బడుదురు.

(దీని మహిమ బైబిలుగ్రంథము యోహాను వాక్యము 1-12లలో చూడుడు.)

ఆదియందు వాక్యముండును, వాక్యము దేవునియొద్ద వుండెను, వాక్యము దేవుడై యుండెను.

ఆదియందు వాక్యము "కలైతయ్యెబా" ఉండెను. దాని భాగమువలె సర్వ ప్రవక్తల మంత్రములు వచ్చినవి. అంత్యప్రవక్త శ్రీ ముహమ్మద్‌గారి ద్వారా అంత్యమంత్రము:-

"లాఇలాహ-ఇల్లల్లాహు-ముహమ్మదుర్-రసూలుల్లాహి" వచ్చినది.

14 శతాబ్దములనుండి యే క్రొత్తమంత్రము రాలేదు. ఇక రాబోదుకూడ. కాబట్టి యిట్టి సుప్రసిద్ధ "కల్మను,"సర్వశైస్త్రవ భక్తులందరు విశ్వసించేతీరాలి. ఈ కార్యమును అమలు

పర్చేందుకని శ్రీ రుద్రాంశ యేసుప్రభువు శ్రీ వీరభోగవసంతరాయుల రూపములో వచ్చేసినారు. గుర్తించితే సుఖింతురు. తిరస్కరించితే దండింపబడుదురు.

## జగదేక సుప్రసిద్ధ పుణ్యక్షేత్రమైన మక్కాయొక్క మహిమ.

కృత, త్రేత, ద్వాపర, కలియుగములలో వచ్చిన ఒక్కొక్క ప్రవర్తకు ఒక్కొక్క పుణ్యక్షేత్రమున్నది. వైదీకులకు 1. కాశీవిశ్వనాథ పుణ్యక్షేత్రము. 2. శ్రీ తిరుపతి వెంకటేశ్వరనాథ పుణ్యక్షేత్రము. 3. జగన్నాథపుణ్యక్షేత్రము. 4. శ్రీబదరీనాథ పుణ్యక్షేత్రము 5. శ్రీసోమనాథ పుణ్యక్షేత్రము. 6, రామేశ్వర మొదలగు పుణ్యక్షేత్రములున్నవి.

ఈ క్షేత్రముల పేర్లన్నికూడా మక్కాక్షేత్రములో అంత్యమునవచ్చిన ప్రవక్తసుగుణ నామధేయములే. యెట్లన:-

1. శ్రీ కాశీవిశ్వనాథ:-

విశ్వ + నాథ = ఆలం + సర్వార్ = విశ్వనాథ = సర్వారేఆలం

శ్రీవిశ్వనాథుడు శ్రీముహమ్మద్‌గారే. సర్వప్రవక్తలలో విశ్వనాథ అనగా సర్వారేఆలం శ్రీ ముహమ్మద్‌గారొక్కరే. మరేప్రవక్త కాదు.

2. శ్రీ తిరుపతి వెంకటేశ్వరనాథ:-

అనగా బ్రహ్మ, విష్ణు, మహేశ్వర మూడుశక్తులు. ఈమూడుశక్తులను మూర్తీభవించినవారు శ్రీ ముహమ్మద్ ప్రవక్తలు ఒక్కరే.

గురుర్బ్రహ్మ గురుర్ విష్ణు। గురుర్దేవో మహేశ్వరః।
గురుస్సాక్షాత్ పరబ్రహ్మ। తస్మై శ్రీ గురువేనమః ॥

బ్రహ్మ, విష్ణు, మహేశ్వర శక్తులను మూర్తీభవించి పరమాత్మని సాక్షాత్కరించిన ప్రవక్త శ్రీ ముహమ్మద్ గారొక్కరే సర్వప్రవక్తల విగ్రహములున్నవి, గాని వారి విగ్రహము గాని, ఫోటోగాని, ఈకారణముచేతలేదు కాబట్టి శ్రీ తిరుపతి వెంకటేశ్వరనాథుడు శ్రీ ముహమ్మద్ గారే అని సర్వశాస్త్రములు సాక్షి పల్కుచున్నవి.

3. శ్రీ జగన్నాథ పుణ్యక్షేత్రము.

జగత్ + నాథ = ఆలం + సర్వార్ = జగన్నాథ = సర్వారేఆలం

కాబట్టి జగన్నాథుడు అనగా సర్వారేఆలం శ్రీముహమ్మద్‌గారు ఒక్కరే.

4. శ్రీ బదరీనాథ పుణ్యక్షేత్రము.

బదర్ + నాథ = బదర్ + దుజా = బదరీనాథ = బదరుద్దుజా. కాబట్టి బదరీనాథ అనగా బదరుద్దుజా శ్రీముహమ్మద్‌గారు ఒక్కరే. ఈశ్వరతత్వమున చంద్రశేఖరుడు శ్రీముహమ్మద్‌గారే.

5. శ్రీసోమనాథ పుణ్యక్షేత్రము:-

సోమ + నాథ = బదర్ + దుజా = సోమనాథ = బదరుద్దుజా కాబట్టి సోమనాథుడు బదరుద్దుజా శ్రీ ముహమ్మద్‌గారు ఒక్కరే.

6. శ్రీ రామేశ్వర పుణ్యక్షేత్రము:-

శ్రీరాములు ఒక ప్రవక్త: ఈశ్వర = అధిపతి.

శ్రీరామేశ్వరమనగా శ్రీరామప్రవక్తకు అధిపతి శ్రీ ముహమ్మద్‌గారు ఒక్కరే. ఎట్లన ''అన-సయ్యదుల్ ముర్సలీన్'' (హదీసే షరీఫ్) ''నేను సర్వప్రవక్తలకు అధిపతిగా వచ్చినానని'' శ్రీ ముహమ్మద్‌గారు ప్రకటించినారు. శ్రీరామేశ్వర అనగా సయ్యదుల్ ముర్సలీన్ శ్రీ ముహమ్మద్ గారొక్కరే.

ఈ ఆరు క్షేత్రముల సుగుణనామములన్నియు శ్రీ ముహమ్మద్‌గారి నామధేయములే వీరి రాకడ నిరీక్షార్థముగా ఈ క్షేత్రములను నిర్మించి వారి పేర్లనే సంస్కృతములో పెట్టినారు. యదార్థ అర్థములను విశదీకరించినాము. వీరి ఆత్మీకరాకడ అయోనికల్కి రూపమగు శ్రీ వీర భోగవసంతరాయుల రాకడతో పూర్తియగును.

సర్వకాలజ్ఞానములలో ఈసంధియుగము 5000లకు విగ్రహములన్నియు పోవునని పూర్వీకులు సూచించినారు. ఇదే విషయమును శ్రీ వీరబ్రహ్మముగారు తన కాలజ్ఞానములలో ''నూటయెనిమిది దివ్యతిరపతులు పాడైపోవును. ఇది మీకు గుర్తు'' అని సూచించినారు.

(వచన కాలజ్ఞానము పుట 20)

నేటివరకు పూజింపబడిన విగ్రహములన్నియు పాడైపోవుననిన వాక్యఅంతర్భావ మేమనగా, ఇక అనతి కాలములోనే యావద్భారతీయులు శ్రీ ముహమ్మద్‌గారిని విశ్వసించే తీరు తారు. ఈప్రవక్తమహిమ మేమనగా వీరిని విశ్వసించిన వారు, యే అవస్థలోనైనను, యేకాలములోనైనను, ఏకష్టనిష్ఠూరాలకు గురియైనను తమ శిరస్సులను వంచి ఈ విగ్రహములకు ''దాసోహం'' చేయరు. ఈ తరుణము యిప్పుడు ఆసన్నమైనది. మీరందరు చూడగలుగుతారు.

(శ్రీ తిరుపతి, కాశీ, శ్రీశైల, మొదలగు ఫోటోలు చూడుడు.)

''నూటయెనిమిది దివ్యతిరుపతులు పాడైపోవును. ఇది మీకు గుర్తు'' అనిన కాలజ్ఞాన వాక్యముల భావమేమనగా యీ నూటయెనిమిది దివ్యతిరుపతులు యెలాయున్నవో అలాగే

యుండును. కాని విగ్రహములు మాత్రము వీటిలో కనబడవు. ఇవన్నీకూడ ప్రార్థనాలయ పుణ్యక్షేత్రములగును. (మసాజిదుల్లాః) శ్రీ మహమ్మద్‌గారి విశ్వాసము మన భారతీయభక్తుల హృదయములలో అంకురించి నిలచిన పిమ్మట, వీరిలో అనేకులు మక్కా సుప్రసిద్ధ పుణ్యక్షేత్రముయొక్క యాత్రమును చేయుచురు. (మక్కా ఫొటో చూడుడు)

వేరు వేరు మతస్తులకు వేర్వేరు పుణ్యక్షేత్రము లున్నవి. వీటన్నింటికిని కేంద్రము మక్కాపట్టణము అల్లాఃసర్వేశ్వరునిచే నిర్ణయించబడి యున్నది.

1. మైసూరు దేశమున హాసనజిల్లాలో జైనమతస్తుల పుణ్యక్షేత్రమున్నది.
2. బౌద్ధభక్తులకు గయా పుణ్యక్షేత్రము.
3. లింగాయత, వీరశైవ మతస్తుల శ్రీశైల పుణ్యక్షేత్రము లున్నవి.

ఒక జైన భక్తుడు లింగాయత పుణ్యక్షేత్రమగు శ్రీశైలమునకు పోడు. ఒక లింగాయతుడు బౌద్ధుల పుణ్యక్షేత్రమగు గయకుపోడు. కాబట్టి వీరిలో అన్యోన్య ప్రేమానురాగములు లేవు. కావున వారియందు అన్యోన్య ప్రేమానురాగములను కల్పించుటకు జగమంతటాయుండే వేర్వేరు మతస్తుల వేర్వేరు పుణ్యక్షేత్రములకు ఏకైక జగత్కేంద్ర పుణ్యక్షేత్రముగా అల్లాః సర్వేశ్వరుడే మక్కాపట్టణమును నిర్మించినాడు, ఈ పుణ్యక్షేత్రము అఖిలభూమండలములకు దగ్గరగాను, కేంద్రముగాను యున్నది. జగత్తు సర్వదేశాల ప్రయాణసౌకర్యముల దృక్పథము నుండికూడా అందరకును అందుబాటులో యున్నది. ఈ విషయము ఉపనిషత్తులలోకూడ ఉదహరించబడియున్నది. ''క్షేత్రస్య స్మరణాదేవా మహాపాతక నాశనం'' 'దేవ' యనగా అంత్య రసూలు. దీనిద్వారా విడి విడిగాయున్న భక్తులందరినీ ఒకేస్థానమునకు రప్పించి విశ్వసౌభ్రాతృత్వమును పొందునట్లు నిర్ణయించియున్నాడు.

ఇక భారతీయులందరు ఇస్లాం శాంతి ధర్మమును స్వీకరించిన పిమ్మటకూడ జైన, బౌద్ధ, లింగాయతుల పుణ్యక్షేత్రము లన్నియు ఉండునుగాని, విగ్రహములు కనబడవు.

''నిజము నిలకడమీద తెలుసును'' (వీరబ్రహ్మముగారి కాలజ్ఞానతత్వములు పుట 8)

''శ్రీశైల పర్వతము పాడైపోవును. ఇది మీకు నిదానము''

(వీరబ్రహ్మముగారి వచనకాలజ్ఞానము పుట 20)

పై పదములోయుండే రహస్యము పై వాక్యములలోని భావమేగాని వేరొండుగాదు. జగదేకైక పుణ్యక్షేత్రమగు మక్కాపట్నమును విశ్వసించుటచేత యే ఇతర పుణ్యక్షేత్రముల విశ్వాసమూ నశింపు కాజాలదు.

5. విశ్వవ్యాపక ఏకైక ఇస్లాం శాంతి ధర్మము:- **(The universal Religion)**

## ★ TEMPLE OF TIRUPATI ★




తిరుపతి మందిరం :- 80 కోట్ల ధనం తీయబడును.

---

## ★ TEMPLE OF KASHI ★




కాశి మందిరం :- విగ్రహములు తీయబడును.

## ★ TEMPLE OF HAMPI ★



హంపీక్షేత్రం :- 3 పద్మలధనం తీయబడును.

## ★ TEMPLE OF SRISAILA ★



శ్రీశైలక్షేత్రం :- విగ్రహములు తీయబడును.

బీజము మొలకెత్తి, పెరిగి, మ్రానై, కొమ్మలు, రెమ్మలు, ఆకులు, పుష్పములుగా తన క్లుప్తమైన అవధిపూర్తి అయిన పిమ్మట, యెట్లు వృక్షవ్యాపకమైన ఫలము తానే బహిరంగపడి వృక్షముయొక్క ఫలమిచ్చే అవస్థను పూర్తి జేయునో, అటులనే ఇస్లాము శాంతిధర్మము, ఆదిలో బీజరూపముగాయుండి, మొలకై మ్రానై ఉపనిషత్తు, బైబిలు, శివగీత, భగవద్గీత మొదలగు ధర్మములను కొమ్మలు, రెమ్మలు ఆకులు రూపమున బహిరంగపరచి తన అభివృద్ధిని క్లుప్తఅవధిలో పూర్తి అవస్థనుపొంది విశ్వవ్యాపకమైన ఇస్లాంశాంతి ధర్మము ఫలరూపములో నేటికి 1380సంవత్సరముల క్రితము జగత్ నాభిస్థానమైన మక్కాపట్నములో బహిరంగపడెను. "అల్-యౌమ-అకమల్తు-లకుం-దీనకుం-వఅతమంతు-అలైకుం-న్యామతి-వరదీయతు-లకముల్-ఇస్లామ-దీన"

(ప్రణయవేదము సూరమాయిద రుకు 1)

దీని అర్థము జగత్ రక్షక అల్లాఃసర్వేశ్వరుడు తెలియపర్చిన దేమనగా "నాప్రియ ప్రవక్తకాలములో అనాదినుండి వచ్చుచున్న ఇస్లాం శాంతిధర్మాన్ని పూర్తిజేసినాను. మీకు నాఅనుగ్రహమును పూర్తిజేసి, శాంతి ఇస్లాము ధర్మమునుండి నేను సంతృప్తిచెందినాను."

ఒక బీజమగు మామిడివిత్తనము భూమిలో ఫిలచి, మొలక, మ్రాను, కొమ్మలు, రెమ్మలు, ఆకులు, పువ్వుల అభివృద్దినిపొంది క్లుప్తఅవధియగు పదిసంవత్సరములలో (ఉదాహరణ నిమిత్తము) బహిరంగపడును. పునః అదే వృక్షమునుండి ఫలము రావటానికి ఒక్క సంవత్సరము మాత్రమే పట్టును. గాని పదిసంవత్సరములు అక్కరలేదు. ఇది సృష్టిస్వభావము. ఈ సృష్టి స్వభావమును మానవుడు అరికట్టజాలడు.

అటులనే బీజఇస్లాం శాంతిధర్మము కృత; (17,28,000సం॥) త్రేత (12,96,000సం॥) ద్వాపర (8,64,000సం॥) కలియుగము (3,681సం॥) మొత్తము 28,91,681 సంవత్సరములకు మొలకై, మ్రానై. కొమ్మలై. రెమ్మలై, ఆకులై, పూలై తానే ఫలరూపములో వచ్చినది. తాను వచ్చినదేశము, పరిసరదేశములలో మరియితరత్రా దేశములలోయుండే 88 కోట్లమానవ హృదయములలో సింహాసనాలంకృతమై యున్నది.

పునః ఫలరూపములో వ్యాపించిపోవటానికి 28,91,681 సంవత్సరములు అక్కరలేదు. 1400 సంవత్సరములు పునఃజగత్తు అంతటా వ్యాపించిపోవును. ఆ తరుణము భారతదేశములో యిప్పుడు వచ్చినది. సృష్టిస్వభావకరమైన ఇస్లాం శాంతిధర్మ వ్యాప్తమును యెట్టిశక్తివంతుడైన మానవుడుకూడ అరికట్టజాలడు

మొదటిసారి ఫలమిచ్చిన మామిడిచెట్టు పునః పునః యేట యేట ఫలమును యిచ్చినట్లే ఫలరూపమగు ఇస్లాం శాంతిధర్మము పునః పునః 1400వ సంవత్సరముల ఒక్కొక్కసారి జగత్తులో వ్యాపించి విజృంభించును. అందుకనే (History repeats itself) చరిత్ర తన్నుతాను పునః పునః

వచ్చుచుండును. "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" (భగవద్గీత అధ్యాయము 4. శ్లోకము 8) అనే వేదోక్త సూత్రముకూడ వెలుగెత్తి ఇందుకొరకు చాటుచున్నది.

"తిల్కల్-ఐయ్యాము-నుదావిలుహా-బైనన్నాష్"

(ప్రణయవేదము ప్రసూర ఆలెయింరాను రుకు 14)

దీని అర్థము:- అల్లాః ధర్మరక్షకుడు ఈ శాంతిధర్మమును పునః పునః విజృంబింప చేయును.

పై ధార్మిక రెండు సూత్రములుకూడ ఈ యంశమును నొక్కి నొక్కి వక్కాణించుచున్నవి,

ఇక యుగయుగములలోకూడ ఇస్లాం శాంతిధర్మము యొక్కటే. ప్రతి 1400ల సంవత్సరములకు పునః పునః విజృంభించును.

ఒకసారి ఫలమిచ్చిన వృక్షము పునః ఫలమువచ్చె కాలసమీపములో, తన పాతఆకులను రాల్చి, క్రొత్తఆకులను, పువ్వులను చిగురుచుకొని ఫలము యిచ్చును. అటులనే ఇస్లాం శాంతి ధర్మము పునః వ్యాపించే ముందుగా తన్ను విశ్వసించినవారిని లౌకికముగా బీదతనములో నిశ్శక్తి చేసి, ఇతర ధర్మస్థులకు రాజ్యాధికారము మొసంగి, శక్తివంతులుగాచేసి, తన అద్భుత మహా త్కారశక్తులచేత, వారి హృదయములలో ప్రవేశించి, పాతవారిని క్రొత్తవారిని తన సన్నిధిలో సంఘటితపర్చి సర్వమానవులకు తన కల్యాణమును దానముగా ప్రసాదించును. ఇదే ఇస్లాం శాంతిధర్మముయొక్క అంతర్భాగములోయుండె విద్యుక్తశక్తి ప్రభావము.

ఇస్లాంశాంతిధర్మము ప్రప్రథముగా 360 విగ్రహములను పూజించే అరబ్బీదేశస్థులలో, తన్ను ధరించిన కృపాసాగర త్రైలోక్య పితామహుండైన శ్రీ ముహమ్మద్‌గారి వ్యక్తిత్వ రూపములో, ప్రచారనిమిత్తమై బహిరంగములో వచ్చెను. ఆ దేశస్థులగు అరబ్బులు, దీని నిజ స్వరూపమును తెలుసుకొనక అసహ్యపడిరి. అడ్డుపడిరి. అయితే చివరకు ఈ ధర్మాన్ని స్వీకరించి ఇతరత్ర దేశములలో ప్రచారము సాగించి, దైవానుగ్రహమునుపొంది లోకకీర్తిని సంపాదించిరి. సుప్రసిద్ధులైరి. విశ్వమాననీయులైరి. ఆ దేశములో మానవుని పరిపాలన, అంతరింపచేసి సాక్షాత్ పరమాత్మని రామరాజ్యమును స్థాపించిరి. జగత్ చరిత్రలలోకెల్ల ఈ అరబ్బులే ఓంప్రథముగా పరమాత్మని ప్రజాప్రభుత్వమును స్థాపించిరి.

ఇస్లాం శాంతిధర్మముయొక్క పునఃరాకడ, భారతదేశములో కలియుగము 5000 సంవత్సరములకు (దీనికి సరియగు హిజ్రి 1400 సంవత్సరములు) జరుగునని విశ్వశాంతిస్థాపక శ్రీ కల్కిఅవతారపురుషులగు ముహమ్మద్‌గారు శెలవు యిచ్చినారు. తత్ కారణముచేత యావత్ భారత

దేశ బ్రాహ్మణోత్తములగు భక్తులు ఇస్లాం శాంతిధర్మము రెండవరాకడను గురించి ఈ క్రింది విధముగా సంధ్యావందనమును పఠించుచున్నారు.

"శ్రీ గోవింద గోవింద మహావిష్ణురాజ్ఞాయా ప్రవర్తమానస్య ఆద్య బ్రహ్మణః ద్వితీయ పరార్ద్ధే... కలియుగే పంచసహస్రాధివర్షే... శ్రీ జగద్గురు చరణసన్నిధౌ..."

(సంధ్యావందన మంత్రము)

ద్వితీయ రాకడ యనగా శ్రీ మహావిష్ణుయొక్క రెండవ రాకడ యని అర్థము. శ్రీమహావిష్ణువు మొదటిరాకడ కల్కిఅవతారమగు శ్రీ ముహమ్మద్‌గారి ప్రవక్తృతత్వమునుండి పూర్తి అయినది, వారి రెండవరాకడ అయోనికల్కిరూపమగు శ్రీ వీరభోగవసంతరాయులు ఇచ్చట గమనించవలసిన విషయమేమనగా కల్కిఅవతారపురుషులు కృపాసాగర శ్రీ ముహమ్మద్‌గారు కల్కిరూపమనగా శ్రీ ముహమ్మద్‌గారి శరణుడు (ఉర్దూలో ఉమ్మతీ అందురు) కాబట్టి వారి అయోని రెండవరాకడ శ్రీ మద్విరాట్ వీరభోగవసంతరాయుల వ్యక్తిత్వములో పూర్తియగును.

పై సంధ్యావందనములోయున్న "జగద్గురు చరణసన్నిధౌ" అనే దానికి ఉర్దు అక్షర రీత్యా అనువాదము;- జగత్ + గురు + చరణ × సన్నిధౌ = సర్వారే × ఆలమ్ × ఖదమోమే అనగా శ్రీ జగద్గురుల పాదపద్మలలో మాకు ముక్తికల్గునని కోటానుకోట్ల సంవత్సరములనుండి వీరు విశ్వసించుచు, పఠించుచు వచ్చుచున్నారు. ఈ జగద్గురువుల మినహా వీరికి ముక్తికలుగదు. కాబట్టి అఖిలాండకోటి బ్రహ్మాండనాయక, ఆదినారాయణ, దివ్యకళాపరిపూర్ణసంభవులైన శ్రీ వీరభోగవసంతరాయులు శ్రీ జగద్గురువులో ఐక్యమై వారి అడుగుజాడలలో నిలచి, బీజస్వరూప ఇస్లాం శాంతిధర్మమునకు ఈ బ్రాహ్మణోత్తములను ఆహ్వానించుచున్నారు. ఈ వాక్యమును గమనించండి:-

"కలియుగము 5000 యేండ్లలోపల కల్కిరూపుడు తర్లివచ్చీనిమా ! ఎల్లలోకములూ యేలుచు చతుర్యుగములలో సధర్మములు సలిపేరుమా " ॥గో॥

(గోవిందవాక్యములు నెం 99)

ఈ వాక్యములలో కలియుగము 5000 సంవత్సరములు కనపర్చినారు, ఇప్పటికి 5060 సంవత్సరములు అయినవి. కల్కిరూపుడనగా కల్కియవతారపు శరణుడు (ఉమ్మతీ) కాబట్టి వీరభోగవసంతరాయులు జగద్గురువులయొక్క అనుచరులు.

పై కారణములచేత ఇస్లాం శాంతిధర్మము శ్రీ వీరభోగవసంతరాయులద్వార పునః ప్రచారములోనికి వచ్చినది. వారికి భారతదేశపు సర్వభాషలలో ప్రచారముచేయు 300 మంది శిష్యులున్నారు, వారిలో నేనొక్కడను. 21 సంవత్సరములనుండి వీరి శిష్యుడనై చాల ప్రచా

రానుభవమును పొందినాను. మా ప్రచారమును విని, కొందరు ఆనందిస్తున్నారు. ప్రోత్సాహము కూడ చేస్తున్నారు. మరికొందరు అసహ్యపడుచున్నారు. ఏ రీతిగా అరబ్బులు ప్రథమములో అసహ్యించుకొని చివరకు ఇస్లాం శాంతిధర్మమును స్వీకరించి అన్యప్రాంతములకు వ్యాప్తిజేసినారో ఆ రీతిగానే మన భారతీయులు మొదట అసహ్యించుకొన్నప్పటికిని, చివరకు అనతి కాలములోనే స్వీకరించి, శాంతిమాతలై, ఏడు దీపములలో శాంతిధర్మాన్ని స్థాపించి జగత్ ప్రఖ్యాతిని సంపాదింతురు.

ఈ వాక్యములు నాయూహాజనితములు కావు. పూర్వీకులందరు ఈ విషయాన్ని సర్వ శాస్త్రములలో వెలుగెత్తి చాటినారు, శాస్త్రములను పరిశీలించండి. ఉదా:-

"ఏనూరుకోట్ల భూమండలామంతాయు ఏకచక్రముగ ఏలీనిమా"

(గోవిందవాక్యములు నెం 309)

జగత్తులోయుండే సర్వధర్మములుకూడ వివిధ ప్రవాహముల వంటివి. ఇస్లాం శాంతి ధర్మము సముద్రమువంటిది. ఈనదీనద ప్రవాహములకు సముద్రమే శరణ్యము. అచ్చటనే యివన్నియు పరిశుభ్రతచెంది శాంతిని పొందును. అటులనే భారతదేశములోయుండే సర్వమత శాఖలకు సముద్రరూపమగు ఇస్లాం శాంతిమత శరణ్యము. ఇందులోనే ఐక్యమై తమలోయుండే మలినములను పోగొట్టుకొని, పరిశుభ్రమై యిందులోనే శాంతినిపొంది సుఖించును.

సముద్రములోనే తెల్లటిముత్యములు, ఎఱ్ఱని పగడాలు ఉత్పత్తియగును. అటులనే శాంతి సముద్రమగు ఇస్లాములోనే తెల్లటిముత్యములవంటి ఆత్మశుద్ధిగల యోగిపుంగవులు అనగా అవులియా అల్లాః ఎర్రటి పగడాలవంటి శౌర్యముగల వీరులు అనగా గాజియానేదీన్ జన్మింతురు. వాగులు, గుంటలు, చెరువులు, నదీనద ప్రవాహములలో తెల్లటి ముత్యములు, ఎర్రటి పగడాలు ఉత్పన్నము కాజాలవు. అటులనే యిప్పటి యుగములో వైదికులు, విశ్వకర్మలు లింగాయతులు, జైనులు, బౌద్ధులు, క్రైస్తవులు, పార్శీలు, యూదులలో తెల్లటి ముత్యముల వంటి యోగిపుంగవులు అనగా అవులియా అల్లాఃలు మెర్రటి పగడాలవంటి వీరులు, శూరులు, అనగా గాజియానేదీన్ పుట్టరు. ఇందుకు మేము సాక్షిపల్కుచున్నాము. ఈసత్యము ననుసరించి ప్రణయవేదమగు ఖురాను గ్రంథమును చదవండి. పరిశీలించండి :-

"వ-మైం-యబ్తగి-గైరల్-ఇస్లామి-దీనన్-ఫలై-యుగ్‌బిలా-మిన్‌హు-వహువ-ఫిల్లాఖిరితి-మినల్‌ఖాసరీన్"

(ప్రణవవేదము సూర ఆలెఇమ్రాన్, రుకు 9)

అర్థము:- అల్లాః సర్వేశ్వరుడు ఇట్లు ప్రకటించుచున్నాడు. "శాంతి ఇస్లాం ధర్మమును

# పంచాక్షరి మహామంత్రముగు




''లా ఇలాహ - ఇల్లల్లాహు - ముహమ్మద్ - రసూలుల్లోహి''

శ్లో॥ బ్రహ్మకృత శివ సహస్రనామ సుమృతం జయః ।
సూక్ష్మ తనుర్జగద్వ్యాపి జగద్గురుః ॥

ఈ బిరుదుగల శ్రీ ముహమ్మద్ (వీరిపై శాంతి ప్రసన్నత యుండుగాక!) గారి పంచాక్షరములతో కూడిన పంచపద మంత్రమును విశ్వసించుటకు జ్ఞాపకార్థముగా లలాటములపై పెట్టుతు వచ్చారు.

నేడు, ఈ గురువును విశ్వసించి, అతని మంత్రము, తెలియక లలాటముపై పెట్టబడులు, పఠించి మోక్షపదవిని పొందుడు.

(దీని వివరములకు హిందూ-ముస్లిం ధార్మికసమ్మేళనము, మొదటిభాగము చదవుడు.)

వదలి ఇతర ధర్మములను అనుష్ఠానించినచో వాటిని నే నొప్పుకొనను. అట్టి వారు దౌర్భాగ్యులగుదురు.''

సర్వోత్కృష్టమైన శాంతిధర్మాన్ని మీకు నచ్చచెప్పేటందుకు, హరి, హరా ఉభయాత్మక స్వరూపులైన శ్రీ మద్విరాట్ వీరభోగవసంతరాయులు అవతరించినారు. వీరి ఆగమనమును గుర్తించి భారతదేశమును స్వర్గసీమగా, స్వర్గధామగా, సాక్షాత్ వైకుంఠస్థానముగ, ప్రత్యక్షకైలాస నివాసముగ, చేయగలందులకు మేమందరము మనఃపూర్వకముగ నివేదించుచున్నాము.

సూర్యుడు ఉదయించిన పిమ్మట ఇంటింటిలోయుండే దీపములన్నియు, గగన మండలములో ప్రకాశించు నక్షత్రములన్నియు, తమ జ్యోతులను కోల్పోవును. తద్రీతిగానే శ్రీ ముహమ్మద్‌గారు సూర్యనారాయణుడుగా జగత్తులోకి వచ్చినపిమ్మట, దీపములు, నక్షత్రములవలె ప్రకాశించుచున్న సర్వప్రవక్తలు తమ తేజములను కోల్పోయినారు. శ్రీ ముహమ్మద్‌గారు జగత్తులోకి వేంచేసిన అనంతరము శ్రీ యేసుక్రీస్తు ప్రవక్తయొక్క ఆత్మీక వెలుగు ప్రకాసింపజాలదు, అందుచేతనే శ్రీ యేసుక్రీస్తులు ఈ రీతిగా ప్రకటించినారు:-

''నేను దావీదు సంతతివాడను మరియు ప్రకాశించుచున్న తెల్లవారు జాము నక్షత్రము''

(ప్రకటన 22:- వాక్యము 16)

పై వాక్యమునుండి అర్థమయ్యేదేమనగా ఏసుక్రీస్తు తెల్లవారుజాము నక్షత్రమువంటివాడు. తెల్లవారుజాము నక్షత్రము సూర్యుడుదయించగానే కనబడక పోవును తదుపరి సూర్యుడొక్కడే ప్రకాశమానుడై వుండును. తెల్లవారుజాము చుక్కతోపాటు అన్ని నక్షత్రములు ప్రకాశింపవు.

తత్ప్రకారముగా, సూర్యనారాయణుడగు శ్రీ ముహమ్మద్‌గారు జగత్తులో వచ్చిన పిమ్మట నక్షత్రములవంటి సర్వప్రవక్తలుగూడ ప్రకాశింపజాలరు. అందుచేత, ''నేను నక్షత్రములవంటివాడను, నా తండ్రియగు శ్రీ అహ్మద్ సూర్యనారాయణుడుగా వచ్చునని స్పష్టముగా తన భక్తులకు చాటించిరి. ఏసుప్రభుని సాక్షిపల్కిన సూర్యనారాయణుడగు శ్రీ ముహమ్మద్‌గారిని శిరసావహించి విశ్వసించి, శ్రీ ఏసుప్రభువుయొక్క ఆజ్ఞను పాటించెదరని ఆశించుచున్నాను.

కాబట్టి సూర్యనారాయణుడగు శ్రీ ముహమ్మద్‌గారిని విశ్వసించితే సర్వప్రవక్తల ప్రకాశములు మీలో ప్రజ్వరిల్లును. నేను, మనస్సాక్షిగా అనుభవరీత్యా సాక్షిపల్కుచున్నాను. శాస్త్రములు, వేద, ఉపనిషత్తులు, హదీసులు ఖురాను ప్రణవవేదము ఇందుకు సాక్షిపల్కుచున్నవి.

వానియందలి యదార్థమును నాజిహ్వాముఖో వకాల్తు చేయుచున్నాను. నన్ను వ్యక్తిగతముగా కలుసుకొని సర్వవిషయములు తెలుసుకొనవచ్చును.

ఓయీ అల్లా, సర్వేశ్వరుడా! మేము చేయదగినంతగా చేయుచున్నాము. ఇక నీ ధర్మము, నీ భారతీయులు, వీరిని నీ శాంతి సముద్రమగు ఇస్లామును స్వీకరించగలందులకు మేము నీసన్నిధిలో ప్రార్థించుచున్నాము. ఆమీన్—తథాస్తు జై హింద్! నారే తక్ బీర్ అల్లాహుఅక్బర్!!

శ్రీ కల్కియవతార రూపమున యదార్థమైన ఇస్లాం మతస్వరూపము.

జగన్మంగళావతారుడగు శ్రీ ముహమ్మద్‌గారిని (శాంతిప్రసన్నత వీరిపై స్థిరపడుగాక) విశ్వసించు బాధ్యత భూసురలగు సర్వబ్రాహ్మణోత్తముల భుజస్కంధములపై యున్నది. శక్తి కొలది శ్రీ కల్కియవతారవిషయములను సవివరముగా, సర్వశాస్త్రోక్తముగా వివరించుచున్నాను.

4 యుగములనుండి కోటానుకోట్ల ప్రజల 'దాసోహం' పొందుచున్న బ్రాహ్మణోత్తములారా! శ్రీ కల్కియవతారుడు మీ ముక్తిదాయక గురువు. ఈ పుస్తకములో వివరించిన విషయములేగాక, ఆగమనశాస్త్ర ప్రతిష్ట, బలిప్రతిష్ట, ప్రాణప్రతిష్ట, వాస్తుశాస్త్రములలో మీవద్ద జగత్ప్రభువగు శ్రీ ముహమ్మద్‌గారి (శాంతి ప్రసన్నత స్థిరపడుగాక) అనేక విషయములున్నవి. మూసిపెడితే పాసిపోవునను సామెతను అర్థము చేసుకొని, స్వారాట్ శ్రీ ముహమ్మద్‌గారిని విశ్వసించుటయే గాక మీ విశ్వాసప్రకటనను దినపత్రికలలో ప్రకటించవలయును. కల్కియవతార పురుషుడు శ్రీ ముహమ్మద్‌గారే యని, ప్రభుత్వాధికారి రాష్ట్రపతికిన్నీ, ప్రధానామాత్యులగు శ్రీ జవహర్‌లాల్ నెహ్రూగారికిని, ఢిల్లీ పార్లమెంటు, అసెంబ్లీ, కౌన్సిలు, సభ్యులకును మెమోరాండం రూపములో నివేదించవలయునని, నేను గురుపాదపద్మములలో నిలబడి, అల్లాఃపరమాత్మలో ఐక్యమైనందున అతని ఆజ్ఞననుసరించి మీకు ఆదేశించుచున్నాను. క్షణమాలసించక యీ బాధ్యత కార్యమును నిర్వర్తించవలెను. మీ పేరుప్రతిష్టలు శతరెట్లు అధికమై చిరస్థాయిగా వుండిపోవును. భారతదేశమునకు ప్రాణప్రధానముచేయు భూసురులగుదురు. లేనిచో రాబోవుకాలములో జరుగు ప్రజల కష్టనిష్టూరములకు మీరే బాధ్యులు సుమా! శ్రీ ముహమ్మద్‌గారి విషయములు బహిరంగ పరచినచో మానవుల రక్తపాతములకు మీరే బాధ్యులు. నేటివరకు నిలబడిన మీ పేరుప్రతిష్టలు మట్టిలో కలసిపోవును. బ్రాహ్మణేతరలు శ్రీ ముహమ్మద్‌గారిని గుర్తించిన పిమ్మట (వీరిపై అల్లాః శాంతి ప్రసన్నత యుండుగాక!) మీకు పవిత్రమైన మర్యాదలు సల్పరు, దుయ్యబోదురు.

## శ్రీ మహావిష్ణు మందిరము

శ్రీ మహావిష్ణు యవతారం కల్కియవతారం. కల్కి ఆఖరు అవతారం. కల్కి యవతారమే శ్రీ ముహమ్మద్‌గారు (వీరిపై అల్లాః పరమాత్మని శాంతి ప్రసన్నత యుండుగాక!)

వీరిఆగమనముకై జ్ఞాపకార్థముగా యావద్భారత దేశమంతటాయున్న దేవస్థానములు (విష్ణు,ఈశ్వర ఆలయములు) స్థాపించబడినవి. గాబట్టి ఈ దేవస్థానములలో వీరికిసంబంధించిన విషయములున్నవి.

పై దేవస్థాన ద్వారముపైయున్న శంఖుచక్రము లనబడేవి. శ్రీ ముహమ్మద్‌గారిపేర్లు (వీరిపై శాంతిప్రసన్నత యుండుగాక!) అరబ్బి అక్షరములలో కనపర్చబడినవి.

శిఖర కళశములపైకూడ అరబ్బీ భాషలో ఇత్తడి అక్షరాలతో కనపర్చబడినవి. శ్రీ ముహమ్మద్‌గారిపేర్లు పరిశీలింపుడు.

పురాతన విష్ణుమందిరముల గర్భగుడులలో శ్రీముహమ్మద్‌గారి ముక్తిదాయకమంత్రము ''లాఇలాహ-ఇల్లల్లాహు-ముహమ్మదుర్-రసూలుల్లాహి'' అరబ్బి అక్షరములతో యుంచినారు.

ఉదాహరణమునకు:- 1. శ్రీ తిరుపతి వెంకటేశ్వరనాథ 2. శ్రీ కాశీవిశ్వేశ్వర 3. శ్రీరంగము 4. శ్రీరామేశ్వరం మొదలగునవి.

దీని వివరములు:- హిందూ-ముస్లిం ధార్మిక సమ్మేళనము 3వ భాగములో వివరించబడును. పుస్తకము అచ్చుకానున్నది. నిరీక్షింపుడు. (విష్ణు మందిరం ఫొటో చూడుడు)

''ఓం'' యావద్భారతములోయున్న సర్వమతభక్తులు ''ఓంశ్రీగణేశాయనమః'' ఉచ్చారణ చేస్తూ తమపూజలు, శుభకార్యములు, మతగ్రంథపఠనములతో ప్రారంభింతురు.

ఆర్థిక ఇబ్బందులవల్ల ఇక్కడికి గ్రంథం ఆపవలసివచ్చి యున్నందున నన్ను మన్నించుదురని ప్రార్థించుచున్నాను. బహుక్లుప్తంగా వ్రాసితిని.

బ్రహ్మకృత శివసహస్రనామ సుమృత్యుంజయః
సూక్ష్మతనుర్జగద్వ్యాపి జగద్గురుః ||

ఈ బిరుదాంకితులైన కల్కి, అంత్య అవతారపురుషుడగు శ్రీముహమ్మద్‌గారి (వీరిపై శాంతి ప్రసన్నత యుండుగాక!) అగ్రశిష్యులలో 4వ శిష్యుడగు అరబ్బీ అక్షరాల ''అలి'' గారి పేరుతప్ప మరేదియునుగాదు సుమా! (ఓం ఫొటో చూడుడు)

దీని సవివరము హిందూ-ముస్లిం ధార్మికసమ్మేళన 3వ భాగములో యున్నది. నిరీక్షింపుడు. అచ్చుకానున్నది. అతి స్వల్పకాలములో అందించుదునని అల్లాఃపరమాత్ముని ప్రార్థించుచున్నాను.

## అధ్యాయము 11

### గ్రంథకర్తయొక్క సంక్షిప్త జీవితచరిత్ర

నేను మైసూరుదేశం, కోలారుజిల్లా, చిన్నబళ్ళాపురవాస్తవ్యుడను. తండ్రిపేరు జనాబ్

ముహమ్మద్ ఖాశింసాహెబుగారు. మాతల్లి పేరు జనాబా ఆమీనాబి. నేను ఇంటర్‌మిడియట్ వరకు విద్యాభ్యాసము చేసి, మైసూరు దేశములో 11 సంవత్సరములు ఫారెస్టరుగా పని చేసినాను. ఇప్పుడు నా వయస్సు 52 సంవత్సరములు. తదుపరి జగద్గురు ఆశ్రమము, ఆసఫ్‌నగర్ హైదరాబాద్ పట్టణము చేరుకున్నాను. సర్వధర్మ ప్రచారము హిందూ-ముస్లిం ధార్మిక సమ్మేళనము కొరకు పాటుపడుచున్నాను. ఆశ్రమములో నాకొక ఇల్లు యున్నది. ఒక భార్య, నలుగురు అమ్మాయిలు, ముగ్గురు అబ్బాయిలున్నారు.

అయోనికల్కి రూపముగు శ్రీ వీరభోగవసంతరాయుల శిష్యుడై, సర్వధర్మప్రచారము కొరకు దీక్షపూని 21 సంవత్సరములనుండి ప్రచారము చేయుచున్నాను.

కన్నడము, ఇంగ్లీషు, తెనుగు, హిందీ, సంస్కృతము, ఉర్దూ, అరబ్బీ భాషలను అవసరమైనంతగా నేర్చికొనియున్నాను.

ఇస్లాం-హిందూ-క్రైస్తవ శాస్త్రములను గురువుద్వార అవసరమైనంత పాండిత్యమును గడించినాను.

ఆల్లాః సర్వేశ్వరుడు ధర్మకార్యమును నెరవేర్చేటందుకై కొన్ని ఆత్మపదాంతముల శక్తులను నాకు ప్రసాదించినాడు. ఆ అంశములు నా ద్వారా ధర్మకార్యాన్ని నెరవేర్చుచున్నవి.

## ఆత్మపదాంతముల శక్తులు

1. శ్రీ పండిత దివాకర్
2. శ్రీ వర్ధమాన మహావీర్ అవతారం
3. శ్రీ వీరఆంజనేయ అవతారం
4. శ్రీ మత్ శంకరాచార్యులు
5. శ్రీ భక్తపోతన మహాకవి
6. శ్రీ రామకృష్ణ పరమహంస
7. శ్రీ చిరంజీవుడు (15-3-1956)
8. శ్రీ వీరభద్రావతారం (21-1-1956)
9. శ్రీ అమృతధార (ఆబె-హయాత్)
10. శ్రీ హయగ్రీవ అవతారం (శ్రీతుంబురుడు 11-1-1958)
11. శ్రీ భక్తవత్సల
12. శ్రీ సుబ్రహ్మణ్యం అవతారం (27-9-57)
13. శ్రీ గురుబాబానానక్
14. శ్రీ మధ్వాచార్యులు (12-9-1958)

శ్లో॥ జ్ఞానానంద మయం దేవం,
నిర్మల స్పటికాకృతం,
ఆధారం సర్వవిద్యానాం,
హాయగ్రీవ ముపాస్మహే ॥



శ్రీ హాజరత్ మౌలానా, పండిత దివాకర్, ముహమ్మద్ అబ్దుస్ సత్తార్, వర్ధమాన్ మహావీర్
శ్రీ హయగ్రీవ యవతార్ గారు.



శ్రీ వీరభోగవసంతరాయుల ప్రచారక మొదటి శిష్యుడగు:-

**పటేల్ అసుంది రాజాసాహెబ్ గారు**

15. శ్రీ హరా ! హరా ! శంకరా ! అవతారం (29-4-1958)
16. మౌలానా (7-10-1958)

21 సంవత్సరములనుండి మైసూరు, మద్రాసు, ఆంధ్ర, ఓఢ్ర, బెంగాల్, బీహార్ ప్రాంతములలో ధర్మప్రచార నిమిత్తము పర్యటించితిని. ఈ ప్రాంతములలో అనేక హిందూ-ముస్లిం ప్రముఖులు నన్నెరుగుదురు.

## : గమనిక :

ఈ గ్రంథమందు శ్రీ చెన్నబసవేశ్వరస్వాములే, శ్రీ వీరబ్రహ్మంగారు చెప్పిన కాలజ్ఞానములోని శ్రీ వీరభోగవసంతరాయులని సర్వవేదోక్త ప్రమాణములనుండీ నూటికి నూరుపాళ్ళు అక్షరరీతిగా నిరూపించియున్నాను.

అటులగాక, ఇతడు కాదు. మరొకరున్నారని యెవరైన శాస్త్రసమ్మతముగా ఋజువుపరచినయెడల, వారికి నేను శిష్యుడనై వారి ప్రచారము చేసేందుకు సర్వదా సిద్ధముగా యున్నాడను. లేనిచో ఋజువుపరచినవారికి 116-0-0 రూపాయలు పారితోషికముగా యివ్వగలవాడను.

**Md. Abdul Sattar.**
**10-6-1960**

## : ముఖ్య గమనిక :

1. ఈ పుస్తకమును వ్రతరూపకముగా 40 రోజులు నిష్కల్మషమైన హృదయముతో పఠించువారికి నా దర్శనం ఒసంగబడును.

2. 40 రోజులు సభలుసల్పి, పుస్తకమును ప్రజలకు చదివి విన్పించినవారికి దేవతా రూపుడగు శ్రీ వీరభోగవసంతరాయులవారు దర్శనమిత్తురు.

3. 40 మంది భక్తులకు కల్కి-అవతార పురుషుని ముక్తిదాయకమంత్రము "లాఇలాహ-ఇల్లల్లాహు-ముహమ్మదుర్-రసూలుల్లాహి" మంత్రమును ఉపదేశించు వారికి భగవత్ సాక్షాత్కారము గలుగును. శ్రీ ముహమ్మదుగారి ఆనందమయ రూపదర్శనమగును.

4. ఈ గ్రంథవిషయములను తిరస్కరించినవారికిని హేళనచేయువారికిని సూర్యచంద్రాదులున్నంతకాలము నరకము తప్పదు.

"సాధువుల పరిహాసంబుసల్పిరేని, అదిమూలమై వంశ నిర్మూలమగును."

అను భగవత్ ప్రసన్నగురువుల ఆదేశమును ఎల్లప్పుడూ పాటించుడు.

5. ఈ గ్రంథములో యున్న విషయములను కావ్యరూపములో వ్రాసియిచ్చినచో, వారి పేరిట ఆ పుస్తకమును అంకితముచేసి, ప్రింటుచేయగలవాడను.

6. ఈ గ్రంథమును చదివినవారు, తమయొక్క అభిప్రాయములను నా అడ్రసుకు పంపినచో, వాటిని మూడవభాగములో ప్రచురించెదను. మీ అభిప్రాయములను తెనుగు, ఇంగ్లీషు హిందీ, సంస్కృతము, కన్నడము, ఉర్దూ, అరబ్బీ భాషలలో వ్రాసి పంపవచ్చును.

7. ఈ గ్రంథములో శ్రీ వీరభోగవసంతరాయుల పరిచయము మాత్రమేచేసి యున్నాను నేటివరకు వీరు సాధించిన కార్యములు వీరి మహత్తులు సర్వమతస్థులను ఐక్యపరచి సర్వ భక్తులను ఒకే తాటిపై నడిపించేటందుకు తెచ్చియున్న మతసూత్రములను నా మూడవభాగములో సంపూర్ణముగా వివరించబడును. గాన ఎల్లరూ గుర్తుంచుకొనవలయును.

8. ఆంధ్రప్రదేశ్ రాజధాని హైదరాబాద్‌లో శ్రీ వీరభోగవసంతరాయులు స్థాపించిన జగద్గురు ఆశ్రమములో, ప్రతిసంవత్సరము హీజరి రజబ్ మాసము 7, 8, 9 తేదీలలో, సర్వమత సమ్మేళన శాంతిసభలు జరుపబడును. అప్పుడు నేను తప్పక ఆశ్రమములో నుందును. శ్రీ వీర భోగవసంతరాయుల శిష్యులును దర్శించుటకు ఈ ధర్మసభలను వినుటకు మంచి అవకాశముండును. ఈ మూడురోజులు వచ్చు భక్తజనులందరుకును భోజన, వసతి సదుపాయములు కల్పించబడును. గాన యావన్మంది భక్తులు యుగపురుషుని చరిత్రను తెలిసికొనుటకు రావలయునని ప్రార్థించు చున్నాను.

9. 3వ భాగము ప్రచురణ సిద్ధముగా యున్నది. క్రౌన్ 1/4 సైజులో పేజీలు 200గలవి. ఆర్టుపేపరు ఫొటోలు 15తో కూడిన బుక్కు. గాన బుక్కు ప్రింటు చేయించువారిపేర అంకితము చేయగలను. ఈ విషయంలో సంప్రదింపుడు.

లేనిచో గ్రామ ప్రముఖులు శ్రీ వీరభోగవసంతరాయుల జీవిత చరిత్ర 3వ భాగమును ఏ గ్రామస్థులైనను చందా ప్రోగుచేసి ఇచ్చినచో ఆ గ్రామస్థులపేరిట పుస్తకమును అంకితముచేసి ప్రింటు చేయగలవాడను.

శ్రీ వీరభోగవసంతరాయుల పాదపద్మములసేవ 13సం॥లు చేసిననంతరము దైవసూచనల ద్వారాను, నా ఆత్మబోధ విన్నందువల్లను యధేచ్ఛముగా హిందూ-ముస్లింలు నాకు శిష్యులవు తున్నారు. హిందూ బ్రాహ్మణ పండితులు, గురువులు, యితర హిందూభక్తులు శిష్యులయి నారు. ముస్లింలలో కొందరు మౌల్వీలు. హాజీలు, పేష్‌యిమాములు, ముతవల్లీలు మొదలగు వారున్నారు. వీరిలో S. S L. C, Intermediate, B. A, B. A, L. L. B, M. A,. డిగ్రీల వారున్నారు. హిందూ-ముస్లిం, స్త్రీలుకూడా వున్నారు. నా ఆత్మజ్ఞాన సంపత్తును భక్తులకు అందుబాటులో వుంచుటకు యీ క్రింద వ్రాసిన దీక్షఫారం వ్రాయుచున్నాను.

## ప్రథమ దీక్షా పత్రము

పేరు:-

వయస్సు:-

నేను యీరోజు మిమ్ములను (గ్రంధరచయిత) మార్గదర్శిక గురువుగా నమ్ముచున్నాను. కరుణానిధి శ్రీ ముహమ్మద్ ("శాంతిప్రసన్నత యుండుగాక") గారిని విశ్వసించి, వారి ముక్తిదాయక "లాఇలా-ఇల్లల్లాహు-ముహమ్మదుర్-రసులుల్లాహి" మంత్రమును పఠించుచుచున్నాను. ప్రణయవేద ఖురాన్ ననుసరించి నేను ప్రవర్తించుదును. అల్లాఃపరమాత్ముడు నాకు మోక్షపదవి ప్రసాదించుగాక!"

చిరునామా (పోష్టల్ అడ్రసు)

సంతకం.

పై ప్రథమ దీక్షాఫారము పూర్తిజేసి, నాకు పంపితే నేను వారికొరకు అల్లాఃసన్నిధిన ప్రార్థింతును. నేను అన్నివిధముల వారికి రక్షణ కల్పించుటకు బాధ్యుడను. తదుపరి వారుండే స్థానమునకుబోయి వారికి ఆత్మప్రబోధచేయుట నావిధిగా యుండును.

గాన ధర్మసంస్థాపన కొరకు నా శిష్యత్వమును జాగ్రత్తగా పొందుడు. పుణ్యపురుషులగుదురు. యిట్టి వారిచే సత్యయుగప్రారంభము కానున్నది.

శు భ మ స్తు, మ ం గ ళ మ స్తు.

గ్రంధరచయిత.
**ముహమ్మద్ అబ్దుల్ సత్తార్.**
పరివ్రాజకాచార్యుడు

## గోపాలపురవాసుల స్వాగతపతము

ఆర్యా, మీయొక్క వేదాంతగోష్టి మమ్ము యావన్మందిని మహానందభరితులుగా చేయుటయే గాక జ్ఞానోదయము కల్గించినది. హిందూ-మహమ్మదీయ. తదితర మతానుసారముగా మమ్ములను

# The Copy of the Judgment,

## S. D. M. COURT MIRYALGUDA.

In Presence of Shri Mirza mohd. Farooq Munsiff Magistrate, Miryalguda.
State Police, Wadapalli V. S. Mohd. Abdul Sattar Cose No. 16/3.56.

U/S 109 Cr. P. C.
Date of institution : 17-1-56
Date of disposal : 22-3-56

22nd March 1956

The S. P. O. is present The respondant is present along with his pleader. It is a Case U / S 109 Cr. P. C. It appears that respondant Abdul Sattar visited Wadapalli and there he was suspected by the Police so much so that his prosecution in the Court was held as essential Shri P. Sheshgiri Rao S. I. of Police P. S. Wadapalli gave out in his Statement taken in preseuce of the respondant that on 21-11-55 he returned by bus from Miryalguda and found the respondant at the bus stand. He questioned him as to his name and address and the purphose of his visit but the respondant turning a deaf ear to his question left the place towards the river Then the S. I. asked P. C. 500 to bring him back but as the respondant refused to come two Coustbales were sent to fetch him. The respondant was brought to the P. S. There upon interogations he gave out his name as Devakar, Verdhaman Mohd Abdul Sattar and Hyderabad City as his place of residence. The S. I. also come to know that his two sons are residing in Pakistan. These were the grounds for Suspicion and upon then the respondant was arrested and and sent to the Court for remand. Assuming that the respondant has no ostensible means of subsistence and no relations in Wadapolli he Came to the conclusion that the respondant visited those parts with some criminal intention. In may opinion it was a hasty conclusion unwarranted by the circumstances.

The respondant in his reply urged that he is a missionary working in the Deendar Anjuman since last sixteen years. He is well versed in Hinduism and Islam and hence he is called as Pandit Devakar. He is doing spiritual work all all over India and every one knows him by this name. He was a native of Mysore where he had worked as a forester and since, he is liviug in Asafnagar, Hyderabad City as a religious preacher. The respondant also wears a particular dress-a green turban and a yellowrish coloured long shirt with a kerchief of the same colour upon the shoulder-which is generally worn by the followers of Siddiq Dindar Chanbasheshwar They have their own association in Asafnagar. Now, whether there is any material to suppose that the respondant is a vagabond and a suspicius character as envisaged in S. 109 Cr. P. C. Two more witnesses were producted on behalf of the police. Thirpathi Rajaiah and P. C. No. 500 Mohd. Usman Ali P. W. (2) Rajiah said "that the respondant preached a sermon in the bazar of our village a day previous to his being interrogated by the police. I also heard the

speech. He said with ref:- to koran, Veda and purana that all religions are the same He is a well known man, Pandit Divakar means a pandit as shining as the sun. The muslims of wadapalli made some collections for him. I also contributed to it. We told the S. I that the respondant preached last night and he is now going to Andhra side. I being boating business man, wanted to send him by boat free of charges. He neither committed any offence in our village nor set one person against the other" P. W. S. Mohd. Usman Ali said that he had made a speech a day previous to his arrest. The witness went to Asafnagar upon the order o' the S. I. for enquiry. There he was told at the police station that the respondant has his wife and children. Upon his return he made a report to the S I. against this the S. I. said that he made no enquiries from P. S. Asafnagar regarding the accused. It appears from the record that the respondant made no evasive replies to the police He gave his correct name and address. Now as to the statment of the S. I. that the respondant turned a deaf ear to his question and proceeded towards the river, P. W. (2) Rajiah said that "we told the S. I. that the respondant preached last night and he is now going to Andhra". By this it appears that the respondant wanted to catch the boat which was on the point of departure, but he was stopped from going by the police and brought back to the P. S.

The respondant produced two witnesses Mohd. Abdul wahab, Imam of Miryalguda mosque and Manzur Ahmed, a resident of Miryalguda proper. They both said about him that he is a follower of Siddiq Deender chanbashveshwar and is coming to Miryalguda once or twice a year since last 15 years. He preaches when he comes and collections are made for him. He is generally called Divakar, meaning Shamshul - Ulma. Whenever he comes he stays in the mosque. P. W. (3) Rajiah also said that Whenever he comes from Andhra some times he pays for the boat and some tims no charges are taken from him. This shows that the respondant being a religious preacher remains coming always. Besides, the respondant filed so many posters in which his name and title was mentioned and he was shown as a preacher.

The P. S. I also said that he took the finger impressions of the respondant and sent them to the F. P. B Hyderabad and got the result that he is an Ex-convict U/s 395 I P. C. The result was also filed but there a different name is given and this previous conviction was not proved Besides, even if it is true, it has nothing to do with this case. Taking into consideration all the pros and cons of the matter, my opinion is that there is no material what soever which could be helpful in aplying S. 109 Cr P. C. to the case of the respondant. He is fit be discharged and I order accordingly. Records the judgment was typed to dictation and pronouced

(Sd.) Shri Mirza mohd farooq M. M. Miryalguda 22—3—56
(Sd) Shri S P O.
(Sd) Shri Mohd Abdul Gani, Pleader.
(Sd) Mohd Abdul Sattar, accused.

Date of delivery 17—9—1956

Name of the copyist Mirza Inamullah Baig To whom the copy deliverd, Shri Mohd. Gani Pleader.

True copy

## అధ్యాయము 12

**జాతీయ గీతముయొక్క మహత్మ్యము:- The miracles of the National Song**

జనగణమన అధినాయక జయహే, భారత భాగ్యవిధాతా !
పంజాబ సింధు గుజరాత మరాఠా ద్రావిడ ఉత్కలవంగా !
వింధ్య హిమాచల యమునా గంగా ఉచ్ఛల జలధి తరంగా !
తవశుభనామే జాగే తవశుభ ఆశిషమాగే ! గాహేంతవజయగాథా !
జనగణ మంగళదాయక జయహే, భారత భాగ్యవిధాతా !
జయహే జయహే జయహే జయ జయ జయ జయహే ॥

దీనికి అర్థము తెలుగులో శ్రీకంఠ కృష్ణరావు, B. A, L: T., గారు వ్రాసినారు:- చదువుడు.

సమస్త జనుల హృదయములను పరిపాలించు భారతదేశ సౌభాగ్యకర్తవైనట్టి, నీకు జయమగుగాక ! నీ శుభనామము పంజాబు, సింధు, గుజరాతు, మహారాష్ట్రము, ద్రావిడము, వుత్కళము, బంగాళము మున్నగు దేశజనుల, మనస్సులను వుప్పొంగ జేయుచున్నది. అది వింధ్య హిమాచల పర్వతములలో ప్రతిధ్వనించు చున్నది. యమునా, గంగా, నదుల ప్రవాహాగీతము లందు విలీనమై, హిందూ సముద్ర తరంగములచే గానము చేయబడుచున్నది నీ ఆశీర్వచనముల కొరకు వారు ప్రార్థించుచు, నీ కీర్తిని గానము చేయుచున్నారు. భారతదేశ భాగ్యకర్తవగు నీకు జయమగుగాక ! జయమగుగాక ! జయమగుగాక !

(ఉపవాచకము, ఏడవ తరగతి. గ్రంథకర్త : శ్రీ కంఠకృష్ణరావు, B. A, L T., printed 1958 Rao Brothers)

దీని యింగ్లీషులో అనువాదము:-

### ENGLISH TRANLATION

Thou art the ruler of the minds of all people, Thou Dispenser of India's destiny.

Thy name rouses the hearts of the Punjab. Sind, Gujarat and Maratha, of Dravid, Orissa and Bengal. It echos in the hills of the Vidyas and the Himalayas mingles in the music of Jumna and Ganges, and is chanted by the waves of the Indian Sea.

They pray for thy bleesings and sing thy praise, Thou Dispener of India's Destiny.

Victory, Victory, Victory to thee.

(Vide, free India Revised English Readers Book V)

పై జాతీయ గీతములోని సుగుణములన్నియు మహావిష్ణువు దశావతార పురుషులలో కడపటి కల్కి అవతార పురుషుడగు దేవతా చక్రవర్తి (The Head of the prophets) ముహమ్మద్‌గారికే చెందినవి. నేటికి 1380 సంవత్సరముల క్రితము కల్కియవతార శ్రీ ముహమ్మద్‌గారు (వీరిపై శాంతి ప్రసన్నత వర్ధిల్లుగాక!) అవతరించినారు. యీ విషయము భారతీయ హిందువులకు తెలియ రాలేదు, శ్రీ ముహమ్మద్‌గారు (వీరిపై శాంతి, ప్రసన్నత వర్ధిల్లుగాక!) చంద్రుని రెండు భాగములుగా జేసిన మహత్తును, వీరి కాలములో భారతదేశమున రాజ్యము పరిపాలించుచున్న మలబారు "చేర్‌మాన్ పెరమాల్" రాజు వీక్షించెను. తన దర్బారులోయున్న పండితులతోనూ, జ్యోతిష్యులతోనూ యీ విషయమును గురించి తర్కించెను. వారు తమ మతగ్రంథములలోయున్న కల్కి యవతార మహిమయగు యీ గుర్తునునుసరించి, ఒక మహాప్రవక్త అవతరించినాడని విశద పరచిరి. సముద్రమార్గమున శాల్మలద్వీప, అనగా అరబ్బు దేశస్థులగు మ్లేచ్ఛులు వాణిజ్యము నిమిత్తము వచ్చియున్న వారితో యీ విషయమును ప్రస్తావించెను. ఆ మ్లేచ్ఛులు తమ దేశములో ఒక మహాప్రవక్త, శ్రీ ముహమ్మద్ (వీరిపై శాంతి, ప్రసన్నత వర్ధిల్లుగాక!) గారు అవతరించినాడని సాక్ష్యము పలికిరి. యిట్టి మహాపురుషుని దర్శించి, మోక్షమార్గము పొందుట తన జీవిత పరమావధి యని యెంచి, కొంగలను తలవెంట తీసికొని, శ్రీ ముహమ్మద్‌గారిని దర్శించి, వారి ముక్తి మంత్రమును పఠించి, వారి యనుగ్రహముపొంది పుణ్యపురుషులైరి. వీరి వంశీయులు యిప్పటికిగూడ ముసల్మానులుగానే యున్నారు. మలబారురాజు చేరుమాన్ పెరుమాళ్ మక్కాక్షేత్రమునకుబోయి శ్రీ ముహమ్మద్‌గారి అనుయాయి అయిన విషయము హిందూదేశరేవు పట్టణములకు క్రమేపీ ప్రాకెను. రానురాను యీ విషయము బ్రాహ్మణోత్తములకు తెలియవచ్చెను. గాబట్టి వారు మ్లేచ్ఛులను దర్శించగూడదు; సంభాషించుటతగదు; స్పర్శించితే వారి మైలను నేళ్ళతో కడిగిన గానిపోదు. స్పర్శించినచోట అంతమేర కోసివేయవలయునని ప్రజలలో ప్రచారము చేసినట్లు పుస్తకములద్వారానూ, ఆచారముద్వారానూ యిప్పటికిగూడా కొందరిలో కానవచ్చుచున్నది.

కాలక్రమేపి మ్లేచ్ఛులను దేవస్థానములకు రానీయకుండా జరిగినది. నేను వ్యక్తిగతముగా మహానంది, జగన్నాథమందిరము (పూరీ) లలో ప్రవేశించుటకు ప్రయత్నించితిని. నన్ను చూచిన తక్షణమే పురోహితులు, ద్వారమువద్దకువచ్చి నన్ను ఆపిరి. వారు, నా వేషము (తలమీద పచ్చని ముస్లింల రీతి తలపాగ, తెల్లటి పాయజామా, మోకాళ్ళవరకు కాషాయరంగు జుబ్బా, కాషాయ రంగు వేస్టుకోటు, భుజముమీద కాషాయరంగు తువ్వాలు, కాళ్ళకు బూటులు, ఒకచేతిలో లెదర్ బ్యాగ్, యింకొకచేతిలో వెదురుకర్ర, పొడవైన గడ్డము, తలనిండా పొడుగైన శిరోజెములు) చూచి, గాబరాపడి, "నీవెవ్వరవు, యెందుకు వస్తున్నావు" అని ప్రశ్నించిరి. అందుకు ప్రత్యుత్తర ముగా "నేను ముసల్మానుడను, దేవస్థానమును చూచుటకు వచ్చుచున్నా" నని పల్కితిని. దానికి వారు "నీవు మ్లేచ్ఛుడవు, దేవస్థానములోనికి రాకూడదని" చెప్పి నన్ను అడ్డగించిరి. వారిని ఎంతగా ప్రాథేయపడిననూ నన్ను గుడిలోనికి పోనియ్యలేదు. కొన్ని దేవస్థానముల ద్వారములవద్ద మహమ్మదీయులు లోనికి రాకూడదను బోర్డులు యున్నవి.

పైన వివరించిన రీతిగామ్లేచ్ఛులను వర్ణించినందున, మన భారతీయ హిందువులతో ఒకరీతిగా అసహ్యాభావము యేర్పడుతూ వచ్చినది. భారతీయ అర్చకులకు, పౌరోహితులకు శ్రీ మహా విష్ణువు కడపటి కల్కియవతారము శ్రీ ముహమ్మద్‌గారని స్పష్టముగా నిస్సంశయముగా తెలుసును. నా వుపన్యాసములకు అధ్యక్షులుగా వుండిన అనంతపురంజిల్లా, పెనుగొండ తాలూకా, బుక్కపట్టణము శ్రీ సూర్యనారాయణశర్మ, ఓంఢ్రడ ప్రాంతము, బారిపద పట్టణము శ్రీ విద్వాన్‌విష్ణు ప్రహరాజ్, ఓంఢ్రడప్రాంతము, బాలేసోర్ పట్టణము శ్రీ గంగాధర పండిత బీహారు ప్రాంతము హల్దీపోకర్ శ్రీ పండిత పరమేశ్వర మొదలగు పండితులు శ్రీ మహావిష్ణువు కల్కియవతార పురుషుడు శ్రీ ముహమ్మద్‌గారని ఒప్పుకొనిరి. కొందరు వీరిని విశ్వశించి నా శిష్యులైరి. వీరి ముఖతః నేను కల్కియవతార శ్రీ ముహమ్మద్‌గారని విన్నాను. శాస్త్రిములలోకూడా చక్కగా పరిశీలించి యిప్పుడు మీకు విశదీకరించు చున్నాను. యిందులో లేశమాత్రము కల్పితములు కావు. వూహా జన్యములు కావుసుమా! కల్కియవతార పురుషుని విషయములను యేబ్రాహ్మణోత్తములైన పండితులు; మన భారతదేశ యిప్పటి పరిస్థితులు అవగాహన చేసుకొని ప్రజలకు వెల్లడించి నట్లయితే, ముస్లింలు, హిందువులు, మూడురోజులలో మూడు రోజులెందుకు ? మూడు గంటలలోనే యేకమై పోవుదురు.

శ్రీ కల్కిపురుషుడగు ముహమ్మద్‌గారిని విశ్వసించిన ముస్లింలు మన భారతదేశమునకు వచ్చి, రాజ్యము స్థాపించి, దాదాపు 800 సంవత్సరములు యేకైక సామ్రాట్టులుగా రాజ్యపాలనము గావించిరి. వీరు అనుష్టానించు ప్రణవవేదమగు ఖురాన్‌లో అల్లాఃసర్వేశ్వరుడు, తన ప్రియ ప్రవక్త శ్రీ ముహమ్మద్‌గారి విషయములను, యే దేశమునకు పోయినను, ఆ దేశప్రజలకు ప్రచారము చేయ వలయునని ఆదేశించి యున్నాడు. దానిని పాటించనందున వారి భోగములంతరించెను రాను రాను ఒక చిన్నరాష్ట్రిముగాని నిల్వలేదు. మొన్న మొన్ననే నైజాము రాజ్యముకూడా అంతరించి పోయెను, 800 సంవత్సరములు రాజ్యము పరిపాలించిన యేఒక్క నవాబుకూడా శ్రీ కల్కి అవతార పురుషుడగు యీప్రవక్తను ఖురాన్ వేదమును భారతీయభక్తులకు ప్రచారము చేసినట్లు చరిత్రలో యెక్కడా కనిపించదు, యేవుద్దేశ్యముతో యీదేశమునకు వచ్చిరో ఆవుద్దేశ్యము పూర్తియైనది. అనగా రాజ్యకాంక్ష. యిస్లాం మతప్రచార వుద్దేశ్యముతో రాలేదు. ఆ కార్యముకూడా యిచ్చట సాగలేదు.

యిస్లాం మతసూత్రముల ప్రకారము విగ్రహారాధకులగు భారతీయులను పైనవాబులు తమ మతమునకు ఆహ్వానించక దూరమునందుంచిరే గాని; తమ సన్నిధికి తీసికొనలేదు. దైవరాధన విధానము యిచ్చట వారికి యేమాత్రము బోధించలేదు. అయితే సర్వేశ్వరుని నిజ భక్తులు అనగా అనేక అవలియా అల్లాఃలు మన దేశమునకువచ్చి శ్రీ ముహమ్మద్‌గారిని విశ్వసింప జేసిరి. అల్లాః సర్వేశ్వర ఆరాధనము నేర్పిరి. యీ అవలియా అల్లాఃలయొక్క సమాధిస్థానములకు నేటివరకు పోవుచు, వారిని సన్మానించుచున్నారు. వుదాహరణకు అనంతపురంజిల్లా, పెనుగొండ క్షేత్రములోయున్న శ్రీ హజరత్ బాబాఫక్‌రోదీన్, వురుసు వుత్సవమున ముస్లింలకన్నా హిందూ

భక్తులే యెన్నోరెట్లు యెక్కువగా వారి సన్నిధికివచ్చి పూజలుసల్పి, వీరి ఆశీర్వాదములను పొంది, కష్టములను పోగొట్టుకుని సుఖించుచున్నారు.

అర్చకులు, పురోహితులు యేరీతిగా మ్లేచ్ఛులను దూరమునందు వుంచుటకు అసహ్యాభావమును కల్పించినారో ఆ రీతిగనే ముస్లింమౌల్వీలు "అల్కాఫర్, లాయతి శార్, ముష్రిక్, బుత్పరస్త్" అని తమ ముస్లింలలో చెప్పసాగిరి. భక్తులయిన ముస్లింలు భారతీయ హిందువుల ప్రవక్తలను నావంటి ప్రచారకులు, ముస్లింలు మన్నించవలయునని చెప్పగానే, అసహ్యాపడుచున్నారు. "యిస్లాం మతమువచ్చ దాదాపు 1380 సంవత్సరములయినది. యేమౌల్వీ సాహెబులు కూడా చెప్పలేదే; మీరు యెట్లా చెప్పుచున్నారో మాకు అనుమానముగా నున్నది" అని చెప్పువారనేక ముస్లిం లున్నారు. హిందూదేశములో అవతరించిన శ్రీ వేదవ్యాసులు, శ్రీరామ, శ్రీకృష్ణ మొదలగు పురుషులను. ముస్లింలు శ్రీఅబ్రహాం, శ్రీమోజస్, శ్రీయేసుక్రీస్తు మొదలగు ప్రవక్తలుగా (రసూల్) విశ్వసించినారో అటులనే విశ్వసించవలయునని నావంటి యిస్లాం ప్రబోధకుల ప్రచారమును విని, మన్నించువారు; గౌరవించువారు ముస్లింలలో అనేకమంది యున్నారు. ముస్లిం విద్యావంతులు శ్రీరామ, శ్రీకృష్ణ, శ్రీబుద్ధ మొదలగు అవతార పురుషులు భారతదేశమున అవతరించినవారిని విశ్వసించుటకునూ మన్నించుటకునూ అంత్యదైవోక్త ఖురాన్ వేదము అనేక సూత్రములను చూపెట్టుచున్నదని తాము రచించిన గ్రంథములో కనపరచినారు. అయితే యీ అంశము ప్రజాబాహుళ్యానికి ప్రచారములోనికి రాలేదు.

యీకార్యము అష్టకష్టాలతో కొనసాగును. మనదేశమును 800 సంవత్సరములు పరిపాలించిన నవాబులుకూడా మతవిషయములకు దిగలేదు. తదుపరి యింగ్లీషువారి పరిపాలనములో, క్వీన్‌విక్టోరియాకూడా, మనదేశమునకు వచ్చినప్పుడు A. D. 1857 యీ సమయమున "మేము కేవలము రాజ్యపరిపాలకులేగాని మతసంబంధమైన విషయముల జోలికిబోము. మీ మీ మతములను యథేచ్ఛముగా అనుష్టానించ వచ్చును" అని ప్రకటించినట్లు నాకు జ్ఞప్తియందున్నది. అందువల్లనే యింగ్లీషువారు మన మతవిషయముల జోలికి పోలేదు. అల్లాఃసర్వేశ్వరుడు భారతీయులకు సంపూర్ణస్వతంత్రము ప్రసాదించినాడు. మన భారతీయ ప్రభుత్వముకూడా "మాది సెక్యులర్ గవర్నమెంటు (Secular Govt) అనగా మతరాహిత్య పరిపాలనము" అని ప్రకటించిన విషయము మనకందరకు చక్కగా తెలిసినదే. మన దేశమున యెందరుందరో విజ్ఞానులు, లోకకీర్తి సంపాదించినవారున్నప్పటికిన్ని, ఒక మతసమస్య—హిందూముస్లింల ఐక్యత—పరిష్కరించలేనందున, యుగయుగాలనుంచి అఖండముగా వచ్చుచున్న భారతదేశము మూడుముక్కలయినది. భారతీయులెందరో యిందుకై దుఃఖించినారు. నేనుకూడా దుఃఖించినాను. పునః భారతదేశము యథారీతిగా యిక అనతికాలములోనే అఖండ భారతదేశమగుటకు మాగురుదైవుడగు శ్రీమద్విరాట్ వీరభోగవసంతరాయులు భక్తులగు మాకు మతసూత్రములను ప్రభోదించినారు. ఆరు నూరైనా, నూరు ఆరైనా మూడు ముక్కలుగానున్న భారతదేశము అఖండభారతదేశము అయి, "జైహింద్"

లోవున్న అద్భుతకార్యము భారతీయులచే సాధింపబడును. దీని సవివరము హింధూముస్లిం ధార్మిక సమ్మేళనము శివ భాగములో వివరించుదును.

దాదాపు 960 సంవత్సరములనుండి త్రివిధములయిన ప్రభుత్వములు స్థాపించినప్పటికిని, సర్వశక్తి సంపన్నులయిన రాజులకుకూడా యీమతవిషయములలో శక్తులు లేవని విధితమగు చున్నది. గాబట్టి శ్రీభగవద్గీత యీరీతిగా ప్రకటించుచున్నది.

శ్లో॥ పరిత్రాణాయా సాధూనాం వినాశాయచ దుష్కృతాం।
ధర్మసంస్థాపనార్థాయా సంభవామి యుగేయుగే ॥

(భగవద్గీత అధ్యాయము 4 శ్లో॥ 8)

పవిత్ర ఖురాన్ వేదము యీ అంశమునే చాటుచున్నది.
"యా-అయ్యూహల్-లజీనా-ఆమను-మై-యర్ తద్దా-మిన్ కుమ్-
అన్-న్ నిహీ-ఫసోఫా-యాతియల్లాహు-బీకౌమిన్"

(ఖురాను సూరా, మాయిదా, రుకు 8, ఆయత్ 54)

**O ye who believe whoso of you becometh a renegade from his religion, (know that in his stead) Allah will bring a people.**

పై భగవద్గీత శ్లోకమునుండియు; ఖురాన్ వేదప్రమాణమునుండియు అర్థమయ్యేదేమనగా మతస్థాపకుడు, సంస్కర్త అల్లాః పరాత్పరుడని విధితమగుచున్నది. అందుకనే కలియుగమును 5000 సంవత్సరములకు ఒక అవతారపురుషుడు అల్లాఃసర్వేశ్వరునిపట్ల నిలబడి, సర్వభారత మతశాఖ ములను సంస్కరించి, శాంతి యిస్లాం మతములో ఐక్యపరచి. సర్వులకు చక్కగా దైవమార్గము చూపెట్టి: భారతీయులను వుద్ధరించునని వాగ్దానము, వేద, వుపనిషత్, పురాణ, కాలజ్ఞాన, ఖురాన్ హదీసులలో వున్నది. అవుసరమైనచో పరిశీలింపుడు.

యీ మతసంస్కరణము యుగపురుషునిద్వారా యిక అతిస్వల్పకాలములోనే పూర్తి యగుచున్నది.

కాబట్టి కల్కితారపురుషుడగు శ్రీ ముహమ్మద్‌గారి రాకడ కొరకు జాతీయగీతమును భారతీయులందరూ బహుశ్రద్ధాభక్తులతో నిలబడి; అతని సుగుణములను గానము చేయుచున్నారు. జాతీయగీతములోని సుగుణ నామములన్నియూ శ్రీమహావిష్ణువు కడపటి కల్కిఅవతారమగు శ్రీ ముహమ్మద్‌గారిలో మూర్తీభవించి యున్నవి.

జాతీయగీతమును రచియించినవారు, లోకకీర్తి సంపాదించిన కవి శ్రీరవీంద్రనాథ ఠాగూరుగారు. వారు యిచ్చిన యీజాతీయగీతములో శ్రీముహమ్మద్‌గారిని సూచించినారు.

యీ జాతీయగీతము సంస్కృత పదములలో నున్నది. మన భారతదేశమున సంస్కృత మార్తాండులు, సాటిలేని మేటిపండితోత్తములు. యీ సంస్కృత పదముల అర్థములను విడదీసి 40 కోట్ల ప్రజలకు దీనిభావమగు ఆఖరు అవతారము కల్కి–పురుషుడు శ్రీముహమ్మద్‌గారని అవలీలముగా చెప్పుశక్తి, సామర్థ్యములున్నవి. 13 సంవత్సరములనుండి యీ జాతీయగీతమును మన భారతప్రజానీకానికి చూపెట్టక మౌనముగా యెందుకున్నారో నాకర్థమగుటలేదు ? దీని భావము నాకు తెలిసినందున మీకు సంస్కృత పదముల అర్థములు విడదీసి, చూపెట్టుటకు సాహసించుచున్నాను. సహస్రశక్తి సంపన్నులయిన కల్కి–యవతార పురుషుడగు శ్రీముహమ్మద్‌గారు; తనను విశ్వసించుటకు మిమ్ములనందరిని ప్రేరేపించుటకై అతనిని నేను శరణు జొచ్చుచున్నాను.

"జనగణమన అధినాయక జయహే"

జన=జనులు, గణ=సమూహము, మన=హృదయములను, నాయక=నడిపించువాడు నేత;

జనసమూహ మానవుల హృదయములను నడిపించువాడు. ఓంకార సంపన్న ప్రవక్త అని అర్థము. అనగా మానవులలోనే మానవున్ని, అల్లాః సర్వేశ్వరుడు, ప్రేరేపించి, అతని హృదయమును ప్రాపంచిక ఆశపాశములనుంచి పరిశుభ్రముచేసి, అతనికి తన ఆకాశవాణి–ఓంకారము ఉర్దూలో "వహీ" అందురు. యింగ్లీషులో Divine commands; ప్రసాదించును. అతడు ఓంకార పురుషుడు—దివ్యపురుషుడు—భగవానుడు అనబడుతాడు. యిట్టి అవతారపురుషునకు అరబ్బీలో "నబీ" రసూల్–అనబడును. సర్వమానవుల శారీరక; మానసిక; దైవీక పోష్యకర్తయగు అల్లాః సర్వేశ్వరుడు, ఆయా కాలములలో అనగా కృత, త్రేత, ద్వాపర, కలియుగప్రారంభమున సర్వదేశముల జనాంగములలో అనేక ప్రవక్తలను (రసూలు) నిలబెట్టి, వారి దైవీక, శారీరక పోషణములను కొనిసాగించినాడు.

యీ ప్రవక్తల అంత్యమున జగన్నాభియగు మక్కా–క్షేత్రమున శ్రీముహమ్మద్‌గారిని సర్వలోకముల ప్రవక్తల అనుయాయులను అయిక్యపరచుటకు నియమించెను. అంత్య, దైవోక్త గ్రంధఖురాను వేదములోనేగాక మన భారతీయ సర్వగ్రంధములలో ఆంత్యకల్కి యవతారము దేవతాసార్వభౌముడయి వచ్చునని పూర్వీకులందరూ సూచించినారు. ఆ గ్రంధములను తమ తృప్తికొరకు పరిశీలింపుడు.

శ్రీకల్కి–పురుషుడగు ముహమ్మద్‌గారు తన ప్రవక్త తత్వమును గురించి యిట్లు వాక్కుచ్చినారు.

"1,24,000 ప్రవక్తలు (రసూల్‌లు) జగదంతటిలోను వచ్చినారు, అన-అబుల్-అంబియా, అనగా సర్వప్రవక్తలకు తండ్రివంటివాడును; అన-సయ్యదుల్-ముర్‌సలీన్; అన-ఖాయదుల్-ముర్సలీన్. అనగా సర్వప్రవక్తలకు అధినాయకునిగా నేను వచ్చినానని" ప్రకటించినారు. యీ అంశమును, ఖురాను, హదీసు; వారి జీవితచరిత్రములను చదువుడు: పరిశీలింపుడు. మీగురువు మహిమ మీకు గోచరమగును. నా యీమాటలకు కొంతవరకు మీరు జంకుచున్నప్పటికినీ; కొంత కాలములోనే మీరు వారిని విశ్వసించి, శ్రీముహమ్మద్‌గారు జన గణమన అధినాయకుడుగా వచ్చినారని ప్రపంచ సర్వదిశలలో శంఖమును పూరించు తరుణము సమీపించుచున్నదని, నేను యోగదృష్టితో మీకు యీదివ్యసందేశ మిచ్చుచున్నాను.

"జనగణమన అధినాయక జయహే" అనగా ప్రపంచములోని సర్వజనులకు యేకైక అధినాయకునిగా శ్రీముహమ్మద్‌గారిని, అల్లాఃసర్వేశ్వరుడు ఖురాను వేదములో అనేకచోట్ల వుద్ఘాటించినాడు. ఖురాను పరిశీలింపుడు. మన భారతపురాణములలో యీఅంశమునే యీక్రింద విధముగా, మనకు ప్రకటించినారు.

శ్లో॥ బ్రహ్మకృత శివసహస్రనామ సు॥

మృత్యుంజయ సూక్ష్మ తనుర్జగద్వ్యాపి జగద్గురుః॥

యీ బిరుదాంకితము మహావిష్ణు అంత్యఅవతార పురుషుడగు శ్రీముహమ్మద్‌గారికే చెందుచున్నదిగాని మరేప్రవక్తకు చెందదు. జనగణమన అధినాయకుడగు శ్రీముహమ్మద్‌గారి విషయములు భారతీయ సర్వశాస్త్రములలో నిండి తొణుకు చున్నవి. పాతక్రొత్త బైబిల్ నిబంధనములోయున్న, ఆదమ్, నూహు, యాకూబ్. యిస్మాయిల్ మొదలగు ప్రవక్తలందరు తమ అధినాయకడగు శ్రీముహమ్మద్‌గారి రాకడను గురించి ప్రకటించియున్నారు. యిట్టి అధినాయకుని విషయములు జగత్తులోనున్న సర్వమత గ్రంథములలో వున్నందున వీరిని పూర్వీక మహాపురుషులందరూ దేవతాసార్వభౌముడని వర్ణించియున్నారు. శ్రీముహమ్మద్‌గారు, సప్తస్వర్గ ఆరోహణ-మేరాజే షరీఫ్-సమయమున బెత్లహేమ్- (మస్‌జిదే-అక్సా - దేవాలయములో, 1,24.000 ప్రవక్తలందరికిని, అధినాయకత్వమును వహించి, దైవప్రార్థన చేసినారు అను విషయమును గురించి శ్రీముహమ్మద్‌గారి జీవితచరిత్రమును చదువుడు.

"జనగణమన అధినాయక జయహే"

పై వాక్యములోనున్న "జయహే" అనగా జయమగుగాక, జనగణమన అధినాయకుడగు అంత్య ఆవతార కల్కి-పురుషునకు జయమగుగాక అని అర్థము. గనుకనే పురాణములలో కల్కి-అవతార పురుషునిప్రస్తావన వచ్చినప్పుడు, "జయ జయ జయ" అని పూర్వీకులు వ్రాసినారు. కల్కి-పురాణేమున యీక్రింది శ్లోకములో సూచించినారు.

శ్లో॥ జయ సత్యుగస్థాపన కరన్, నాశన్ మ్లేచ్ఛ అపార్,
కరిన్ ధార్ తల్వార్ కర్, కృష్ణ కల్కి అవతార్ ॥

(విజ్ఞప్తి పుట 1, కల్కి-సంస్కృత పురాణము, లక్ష్మీవెంకటేశ్వర్ స్టీమ్ ప్రెస్, కల్యాణ బొంబాయి 1937)

పై కల్కి-పురాణము విజ్ఞప్తిలో, హిందీ అనువాదకుడగు శ్రీమాన్ పండిత బలదేవ ప్రసాద్‌జీ మిశ్రగారు, కల్కి-అవతార పురుషునకు జయమగుగాక అని వ్రాసినారు.

వేదవ్యాసులు కల్కి-పురాణమున యీక్రింద శ్లోకములో ''జయ జయ'' అనివ్రాసినారు.

శ్లో॥ జయ జయ నిజమాయయా కల్పితా శేషవిశేష కల్పనా పరిణామ !

జలాప్లుత లోకత్రయోజ కరణ మాకలయ్య మనుమ నిషామ్య పూరితమనిజనా నిజనా విఖ్యాతమహామీనశరీర !

త్వంనిజకృత ధర్మసేతు సంరక్షణ కృతావతారః ॥

(సంస్కృత కల్కి-పురాణం అంశము 2 అ 3 శ్లో 21, పుట 104)

నిజకృత ధర్మసేతుసంరక్షణ కృతావతారుడగు శ్రీకల్కి-అవతార పురుషునకు జయమగునని స్పష్టముగా మనకు సందేశమిచ్చినారు.

శ్రీకల్కి-యవతార పురుషుడు రెండుసార్లు అవతరించునని కల్కి-పురాణములో వ్రాసినారు. శ్రీకల్కి-యవతార పురుషుని మొదటి రాక, నేటికి 1380 సంవత్సరముల క్రితము, శాల్మల ద్వీపము మక్కా- నగరములో పూర్తియైనది. కల్కి-అవతార శ్రీముహమ్మద్‌గారి విశ్వాసప్రభావముచేత అరబ్బులందరు శాంతి ధర్మాన్ని స్థాపించినారు. అరబ్బుదేశము, పరిసరదేశములలో శ్రీకల్కి యవతారమునకు జయము కలిగినది. వీరిని విశ్వసించిన అరబ్బులను (మ్లేచ్ఛులను) యెవ్వరూకూడా జయించలేక పోయినారు.

శ్రీకల్కి-యవతార పురుషుని రెండవరాక; భారతదేశమున కలియుగము 5,000 సంవత్సరములకు జరుగునని భారతదేశములోనున్న సర్వమతగ్రంథములు శంఖమును పూరించుచున్నవి, వీనిని మీరుగూడా పరిశీలింపుడు.

శ్రీ జనగణమన అధినాయకుడగు శ్రీ మహమ్మద్‌గారి రెండవరాక, భారతదేశమున శ్రీ మద్విరాట్ వీరభోగవసంతరాయులద్వారా పూర్తికానున్నది. శ్రీ విరాట్ పోతులూరి వీర బ్రహ్మేంద్రస్వాములవారు, తన కాలజ్ఞానములో పై అంశమును, దాదాపు 600 సంవత్సరముల నుండి మనకు విశదపరచు చున్నారు,

కల్లాయుగము అయిదు వేలేండ్లలోపల కలికిరూపుడు తర్లీవచ్చీనిమా :

ఎల్లలోకమూలు యేలుచు చతుర్యుగముల్లో సద్ధర్మములు సలిపేరుమా ॥

(వీరబ్రహ్మంగారి కాలజ్ఞానగోవింద వాక్యములు, నెంబరు 99, సంగ్రహిత, కీ. శే॥ జివంగుల నాగభూషణదాసుగారు, 1951)

పై గోవిందవాక్యములో "కలికిరూపుడగు" అని సూచించినారు కల్కి-యవతార పురుషుడు జనగణమన అధినాయక బిరుదాంకితము పొందిన శ్రీ మహమ్మద్‌గారు (వీరిపై శాంతి ప్రసన్నత వర్ధిల్లుగాక !) అతని రూపము అనగా తన అనుయాయి అని అర్థము. ఉరుదు భాషలో "వుమ్మతి" అందురు. గాన శ్రీ వీరభోగవసంతరాయులు తన గురువగు శ్రీ మహమ్మద్‌గారిలో సంపూర్ణముగా ఐక్యమయినందున, వారి సంపూర్ణకార్యక్రమము మన భారతదేశమున జరిగి, భారతీయులందరికి జయము గలుగును. గాబట్టి శ్రీ మహమ్మద్‌గారి సుగుణనామమగు, "జనగణ మన అధినాయక" మనము గానము చేయుచున్నాము.

మన భారతదేశమున నాలుగు యుగములలో అవతరించిన శ్రీనారసింహ, శ్రీపరశురామ, శ్రీకోదండరామ, శ్రీకృష్ణ, శ్రీవర్ధమాన మహావీర్, శ్రీబుద్ధభగవాన్ మొదలగు ప్రవక్తలకు, వారి వారి కాలములలో జయమైనది. కడపటి యవతార కల్కి-పురుషునికి జయము కానున్నది. అందుకనే కృత, త్రేత. ద్వాపర, కలియుగములలో, "జనగణమన అధినాయక" యీ జాతీయ గీతమును భారతీయులు గానము చేసినట్లు, యేపురాణ యితిహాసములలోను కనపడదు. యిప్పుడు యీజాతీయగీతమును మనమందరము గానము చేయుచున్నామంటే, యిందులో మహోజ్వల భవిష్యత్తు వున్నదని విదితమగుచున్నది.

"జనగణమన అధినాయక జయహే
భారత భాగ్యవిధాత !"

పై జాతీయగీతములో "భారత భాగ్యవిధాత" అను పదములకు అర్థము భారత = భారత దేశముయొక్క; భాగ్య = ఐశ్వర్యము; సంపత్తు: ఐశ్వర్యము = యావత్ భారతదేశ స్వతంత్రము,

"ఆత్మపదాంతములగు, అణిమ, లఘిమ, మహిమ మొదలగు అష్టైశ్వర్యములు. ఉర్దులో 'విలాయత్'' అందురు, యింగ్లీషులో Godly powers, Sainthood. విధాత = యిచ్చువాడు, అనగా బ్రహ్మ 1,24,000 ప్రవక్తల సంపూర్ణ బ్రహ్మతత్వమును మూర్తీభవించినవారు కల్కి యవతారపురుషుడగు శ్రీ దేవతాసార్వభౌముండైన ముహమ్మద్‌గారు.

ఒక బిడ్డకు తల్లితండ్రులిరువురు పోషణకర్తలు. తండ్రి కుటుంబమును నడిపించును. బిడ్డకు తండ్రి సృష్టికర్తగా నుండును. అయితే యీబిడ్డయొక్క సంపూర్ణపోషణ తల్లిగర్భమునుండి ప్రారంభమగును. ప్రసవించిన మరుక్షణమే, తల్లి తన స్తనములనుండి పాలుత్రాపును. బిడ్డకు తండ్రిసృష్టికర్త అయినప్పటికి గర్భధారణ తండ్రిచేయడు. అతని స్తనములలో పాలు వుత్పన్నము కావు కొంతకాలమువరకు తన ప్రక్కలో పరుండబెట్టుకొని, మలమూత్రములను పరిశుభ్రము చేయుచు, సకాలములో స్నానము చేయుచు బిడ్డను పోషించును. యీపని తల్లిదేకాని తండ్రిది కాదు. తల్లి బిడ్డకు "యిదిగో మీతండ్రి యితడు'' అని చెయ్యిపెట్టి చూపును, అప్పుడు బిడ్డ తండ్రిని గుర్తించును. తల్లిబిడ్డకు అతని తండ్రిని చూపెట్టువరకు తెలియరాదు. అటులనే మానవుల సృష్టికర్త తండ్రివంటి అల్లాఃసర్వేశ్వరుడు. పోషణకర్త తల్లివంటివాడు, సర్వప్రవక్తల అంత్యమున అవతరించిన జగదంతటకు యేకైక జగద్గురువు స్వరాట్ శ్రీ ముహమ్మద్‌గారు.

తల్లి తండ్రు లిరువురకు బిడ్డమీద హక్కుండును. యిరుగు పొరుగువారు తల్లిని "యీబిడ్డ'' యెవరని ప్రశ్నించిన "నాబిడ్డ'' యని ప్రత్యుత్తరమిచ్చును, తండ్రిని స్నేహితులెవరైన యీబిడ్డ యెవరని ప్రశ్నించిన నాబిడ్డయనే చెప్పును. బిడ్డమీద తండ్రికన్న యెన్నోరెట్లు తల్లికి మమతయుండును. యీ ఉదహరణమే సృష్టికర్త అల్లాఃకును, దయాసాగరుండగు శ్రీ ముహమ్మద్‌గారికే వర్తించును.

గనుక, శ్రీ ముహమ్మద్‌గారు 1380 సంవత్సరముల క్రిందట అవతరించి, తనను విశ్వసించిన అనుచరులందరకునూ, పరమాత్ముని సన్నిధినియున్న ఓంకార-ప్రణవ-స్వీకరించి 13 సంవత్సరములవరకు తల్లి రీతిగా పోషించెను. అరబ్బులు శ్రీ ముహమ్మద్‌గారిని, వీరిద్వారా అల్లాః సర్వేశ్వరుని విశ్వసించి. అతని శాసనమగు ఖురాన్‌వేదమును అనుష్టించినందున, సంపూర్ణ శాల్మల ద్వీప-అరబ్బు, ఈరాన్, ఈజిప్టు తుర్కీ దేశములు - స్వాతంత్ర్యమును అల్లాఃసర్వేశ్వరుడు వీరికి ప్రసాదించెను. యీదేశములలో స్వతంత్రము నేటివరకు వున్నది. యిక ముందు కాలముతోకూడా శాశ్వతముగా నుండును.

గనుక శ్రీ ముహమ్మద్‌గారు భాగ్యవిధాత లైరి. శ్రీ ముహమ్మద్‌గారు 5000 సంవత్సరముల కాలపరిస్థితులను వర్ణించెను. "అరబ్బులను నాఅనుయాయులారా! ఆఖరి కాలములో అనగా కలియుగము 5000 సంవత్సరములకు నేను భారతదేశమున నుందునని సూచించిరి.

యిప్పుడు అరబ్బు దేశము నాలోయున్నది. (అనగా అరబ్బు దేశస్థులందరు నన్ను విశ్వసించినందున ముందు నా అవుసరం యిక్కడ వుండదు.) యిచ్చటకు దూరముగా హిందూ దేశమున్నది. అందులో అప్పటికి నేను అందుందునని శెలవిచ్చినారు. (అనగా భారత దేశమున నాకార్యమున్నది అని అర్థము) నాకు ఇప్పుడే ఆ భారత దేశమునుంచి చల్లనిగాలి వీచుచున్నది'' అని పునరుద్ఘాటించిరి యీవిషయమునకు సంబంధించినవి చాలా వున్నవి.

ఈ గ్రంథమును అచ్చువేయుట కొరకు ధనసహాయమిచ్చి అన్ని విధములుగ తోడ్పడి పుస్తకము విడుదల చేయించిన గుడివాడ పట్టణనివాసియైయున్న మహా భక్తునకు అల్లాఃసర్వేశ్వరుడు ఆయురారోగ్యమొసగి పుణ్యము ప్రసాదించుగాక !

పై వారికి గుడివాడ పట్టణనివాసులైన మరిద్దరు భక్తులు తమ శక్తికొలది ధనమిచ్చి సహాయపడినందులకు అల్లాఃసర్వేశ్వరుడు వారికి పుణ్యము ప్రసాదించుగాక!

ఈ పుస్తకమును ప్రింటింగువేసిన రత్నాప్రెస్ వారు అన్ని రకములుగా మాకు తోడ్పడినందుకు వారికి అల్లాఃసర్వేశ్వరుడు పుణ్యము ప్రసాదించుగాక !



( స శే షం )

రత్నా ప్రెస్, గుడివాడ.



* గ్రంథరచయిత *
ముహమ్మద్ అబ్దుస్ సత్తార్

## ★ పుస్తకములు దొరుకు రెండవ చోటు ★

అబ్దుల్ రహీం,
[గవర్నమెంటు హాస్టలువద్ద]
2 వ వార్డు గుడివాడ,
కృష్ణాజిల్లా
(Andhra Pradesh India)